## III పంజెను గూర్చి

పంజె యవర నెనపిగాగి (పంజె స్మారక సంపుటం), పంజె స్మారక గ్రంథ సమితి, ప్రమ. హర్ష ప్రకాశన, పుత్తూరు. సంపా. సర్వశ్రీ ఎం. గోవింద పై, వి. సీతారామయ్య, కె. శివరామ కారంత, 1952.

పంజె మంగేశరావ్ - శేఖర్ ఐద్య, ఎం. జి. ఎం. కాలేజి, ఉడుపి, 1971.

పంజె మంగేశరాయరు – కె. శివరామ కారంత్, ఐ. బి. హెచ్. ప్రకాశన, బెంగళూరు, 1972.

పంజె మంగెశరావ్ - ఎం. సుమిత్రా శానభాగ, భారత - భారతి పుస్తక సంపద, బెంగళూరు, 1974.

(ఈ గ్రంథసూచిని శ్రీ శేఖర్ ఐద్య, ఎం. ఎ. శతాబ్ది ఉత్సవ సంపుటం తెంకణగాళి (1974) కోసం తయారుచేసిన గ్రంథసూచి సహాయంతో తయారుచేశాను).

భారతీయ సాహిత్య నిర్మాతలు

# పంజె మంగేశ రావ్

మూలం :

వి. సీతారామయ్య

తెలుగు అనువాదం :

ఆర్వీయస్. సుందరం



సాహిత్య అకాడెమి

న్యూ ఢిల్లీ

PANJE MANGESHA RAU - Telugu translation by R. V. S. Sundaram of V. Sitaramiah's Monograph in English. Sahitya Akademi, New Delhi, 1981 - Prize Rs. 4-00.


First edition - 1981

*Copies available at:*
SAHITYA AKADEMI
Rabindra Bhavan, New Delhi - 110 001
*Regional Offices:*
29, Eldams Road. Madras - 600 018;
Block V B, Rabindra Stadium, Calcutta - 700 029;
172, Mumbai Marathi Grantha Sangrahalaya Marg,
Dadar, Bombay - 400 014.

PUBLISHED BY SAHITYA AKADEMI, NEW DELHI - 1 AND
PRINTED AT STREE SEVA MANDIR PRESS, MADRAS - 17.

# తొలిపలుకు

పంజె మంగేశరావుగారి జీవితం, రచనలు, వ్యక్తిత్వాలను గూర్చిన ఈ స్థూలచిత్రణను పెద్దవాడైన ఆ మహిమాన్వితుని పట్ల గౌరవాన్ని సూచించడానికి వ్రాశానేగాని, ఈ విషయాన్ని సాధికారికంగా చెప్పగలనని కాదు. ఈ శతాబ్ది రెండో దశాబ్దం మధ్యభాగం తర్వాత నేను అప్పుడప్పుడు ఆయనను కలుస్తూ, ఆయనపట్ల అభిమానాన్ని పెంచుకున్నాను. ఆయన వదిలి వెళ్ళిన సాహిత్యకృతుల విలువకంటే మానవమూర్తిగా ఆయన గుణ గణాలు ఉన్నతమైనవి. ఆయన తలచివుంటే మరోవిధంగా అయ్యేవారు; అయితే మంగళూరులోగాని, కర్నాటకంలో మరోచోట గాని, పంజె యువ రచయితలందరికీ మార్గదర్శకులుగా, స్నేహితులుగా వుండాలనే కోరు కున్నారు. ఆ కాలంలో ఆయన్ను దగ్గరగా ఎరిగిన కొందరు మాత్రమే నేడు మనమధ్య వున్నారు. నా టైపుప్రతిని చదివి కొన్ని వివరాలను, ఊనికిలోను, సామాన్యంగా నా రచనలో వున్న కొన్ని వ్యత్యయాలను సూచించిన డా. మాస్తి వేంకటేశ అయ్యంగారుకు కృతజ్ఞతలు. వయసులో ఆయన పంజెకు దగ్గరివారు. కన్నడ సాహిత్య ప్రపంచంలో కవిత, గద్యం విమర్శ మొదలైన వాటిలో ఆయన స్థానం అత్యున్నతమైంది.

పంజె కుమారుడు శ్రీ ముకుందరావు, ఇద్దరు కుమార్తెలు, ఇద్దరు కోడళ్ళు ఆయన్ను గురించి తమ అభిప్రాయాలను చెప్పి సహాయం చేశారు. పంజె చిన్నకొడుకు శ్రీ రామారావ్ పంజె వ్రాసిన జీవిత చిత్రణలోని విషయాలను ఆయన మనుమరాలు ఇచ్చారు. ఇది వెలలేనిది. శ్రీశేఖర్ ఇద్య సమకూర్చిన కొన్ని వివరాలు సహాయపడ్డాయి. రావుగారు పరిష్కరించిన ఇంగ్లీషు - కన్నడ నిఘంటువు ప్రతినిచూచే అవకాశాన్ని నాకు కల్పించారాయన.

ఇది ఏవిధంగా చూచినా పంజెను గూర్చిన సంపూర్ణ చిత్రణ కాదు. ఆయనను కలిసి కొంతకాలం ఆయనతో గడిపిన వారెవరు గాని ఆయన వ్యక్తిత్వాన్ని మరిచిపోలేరు. వ్యక్తిగా మనుష్యుల అభిమానాన్ని ఆయన చూరగొన్నారు. తమ రచనలను తగినంతగా ప్రచారం చేసుకోలేదు. ఇతరులు ఆయనకోసం ఈ పనిని చేపట్టవలసి వచ్చింది. కన్నడిగులు ఇలాంటి విషయాలలో ఎప్పుడూ ముందంజ వేయరు.

అనేక ప్రసిద్ధ రచయితలు రచించిన గ్రంథములలో దీన్ని చేర్చి నాచేత ఈపనిని చేయించిన సాహిత్య అకాదెమీవారు ప్రశంసార్హులు. ఇది వారి అభిమతానికి తగ్గట్లుగా ఏమాత్రం వున్నా సంతోషిస్తాను. పంజెలాంటి ప్రసిద్ధమాననీయ వ్యక్తి, సహాయకారి, దయామయుడు, ప్రీతిపాత్రుని గూర్చి సరైన రీతిలో ఈ రచన చేసివుంటే నాకు ఎంతో సంతోషం. సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియాకు చెందిన శ్రీ ఎం. వి. వెంకటేశమూర్తి మొదటినుంచి నాకు వ్రాయసకాడై, ప్రెస్‌కాపీని కూడా టైపుచేసి సహాయపడ్డాడు.

బెంగళూరు<br>
8-7-1977

వి. సీతారామయ్య

# ప్రవేశిక

భాషారాష్ట్రాలు ఏర్పడడానికి ముందుండిన పాత ప్రాంతాలలో ఎంత గొప్ప ప్రతిభ అయినాసరే, అఖిలభారత స్థాయిలో పెద్దగా లెక్కకు రాలేదు, అందరిదృష్టి నాకర్షించలేదు. నాణ్యతలో, ఔన్నత్యంలో, ప్రాముఖ్యంలో లోపంవల్ల ఈతప్పు జరిగిందని చెప్పలేం. భాషా మాధ్యమం ఈ క్లిష్టతకు కారణమనవచ్చు. ఇప్పటికీ అదేకారణం. నేనిప్పుడు చెప్పదలచుకున్నది సుప్రసిద్ధ కన్నడకవి, పండితుడు అయిన పంజె మంగేశరావు గురించి. కన్నడదేశంలో కూడా అన్ని ప్రదేశాలలో ఆయనను గురించి చాలాకాలం వరకు తెలియదు. ఎందుకంటే కర్నాటకంలో ఇతర ప్రాంతాల నుంచి ఆయన నివసించిన జిల్లా వేరుగా ఉండేది. ఆ జిల్లా కోస్తాప్రాంతం కావడం, ఇతర భౌతిక, రాజకీయ విషయాలు దీనికి కారణాలు. అందువల్లనే ఆయనను గురించి పాతమైసూరు రాష్ట్రంలో చాలా కొద్దిమందికే తెలుసు. ఉత్తర కన్నడజిల్లా, తుంగభద్రకు ఆవలి భూమీ, ప్రత్యేక పరిపాలనా విభాగంగా ఉండేవి. ఇప్పటి మహారాష్ట్ర (ముఖ్యంగా పూనాకేంద్రంగా ఉండిన సంస్కృతి) ప్రభావం ఈ భాగంమీద ఉండేది. సామాన్య వ్యవహారాలకు బొంబాయి కేంద్రం. మదరాసులో ఇప్పటి కేరళ, ఆంధ్ర, ఒరిస్సాలు చేరివుండినట్లు, అప్పట్లో సింధ్, గుజరాత్‌లు బొంబాయిలో చేరిఉండేవి. కన్నడదేశంలోని 'దక్షిణమరాఠీ' ప్రాంతాలు ఉర్దూ, తెలుగు, తమిళజాతులతో సంబంధమున్న ఇతర ప్రాంతాలకు భిన్నంగా ఉండేవి. వీరిని కలపడానికి ఎన్నో మాండలిక విభేదాలతో కూడిన ప్రాంతీయభాష ఒకటితప్ప, సాన్నిహిత్యానికి రాకపోకలకు మరో కారణం ఉండేదికాదు. ఉత్తర, దక్షిణ కన్నడ జిల్లాలలోని హవ్యకులు కన్నడ గ్రంథాలను వారి మాండలికంలో పురావస్తువులుగా భద్రపరిచారు. తుళు, కొంకణి భాషలకు లిపిగాని, గ్రంథస్థ సాహిత్యంగాని లేకపోవడంవల్ల ఆజిల్లాలలో కన్నడమే పాఠశాలలలో వ్యవహార భాషగా ఉండేది. మైసూరికి, కన్నడ జిల్లాలకు మధ్య సహ్యాద్రి, పర్వత ప్రదేశమైన మలెనాడు అనబడే పడమటి కనుమలున్నాయి. పంజె మంగేశరావుగారి స్వంత ప్రదేశమైన దక్షిణ కన్నడజిల్లా మద్రాసు ప్రాంతంలో భాగంగా ఉండెది. ఆనాడు కేరళ కూడా దీనికి చేరిందే. కొచ్చిన్, పుదుక్కోట, తిరువాన్కూర్లలో సంస్థానాల

పరిపాలన, ఉత్తర కేరళలో బ్రిటిషు పరిపాలన ఉండేవి. ప్రత్యక్షంగాను, పరోక్షంగాను కొడగుకూడా మదరాసు ప్రాంతంలోనే ఉండేది. పాలనకు సంబంధించిన అధికారి మైసూరులో ఉన్నా సూచనలన్నీ మదరాసునుంచి అందేవి.

పంజె సారస్వత బ్రాహ్మణుడు. ఆయన మాతృభాష కొంకణి. మంగళూరులో వ్యవహారభాష తుళు ఇది కన్నడంతో సమీప సంబంధం గల, గుర్తింపు పొందనిభాష. కొంకణిలో క్రైస్తవ విభాగం ఒకటి (అందులోనూ రెండుభాగాలు: రోమన్ కేథలిక్, ప్రొటెస్టంట్), ఉచ్చారణలో భేదంఉండే గౌడసారస్వత శాఖ మరొకటి. దక్షిణ కన్నడ జిల్లాలో ఉడిపివరకు శైవ, వైష్ణవ శాఖలకు చెందిన బ్రాహ్మణులలో కూడా తుళు వాడుకలో ఉంది. గౌడ సారస్వతులకు వ్యాపారంలో, బ్యాంకింగ్‌లో, పరిశ్రమలలో, రవాణా సంస్థలలో పెట్టుబడీ, వ్యాపారమూ ఉన్నాయి. అయితే సమాజంతో వీరికి వారికి మధ్య ఎక్కువగా సంబంధ - బాంధవ్యాలు పెళ్లివంటివి ఉన్నట్లు కనిపించదు. మత సంబంధంగా అద్వైతం, ద్వైత మనే రెండు భిన్నవర్గాలకు చెందివుండటమే కారణం.

వివిధవర్గాల మధ్య సంబంధాలు, సన్నిహితమైనవీ, దృఢమైనవీ కావని చెప్పడానికే ఇదంతా చెప్పవలసి వచ్చింది. హవ్యక బ్రాహ్మణులలో పాతకన్నడంలోను, సంస్కృతంలోను మంచి పండితులు, ఉపాధ్యాయులు ఉండేవారు. సామాజిక సంబంధాలు ఐకమత్యభావానికి ఏమాత్రం దోహదం చేసేవికావు. కన్నడభాషయైనా ఆపని చేస్తుందనుకుంటే దాని సహజ వాసస్థానం ఉడిపికి ఉత్తరాన్నే. కాని హవ్యకేతరులలో బుద్ధి సూక్ష్మత, ఔత్సుకత ఉండేవి. ఎందుకంటే వారు దక్షిణంలో మలయాళీలతోను, పాలకవర్గమైన తమిళులతోను పోటీ పడవలసిఉండేది. ప్రభుత్వ కేంద్రస్థానమూ, న్యాయకేంద్రమూ మదరాసే. అది భారతదేశం దక్షిణాగ్రం వరకూ పాలనాకేంద్రం. సామాన్య వ్యవహారానికి, పాఠశాలల్లో బోధనా బాషగా, కన్నడం వాడబడేది. ఆసక్తికరమైన విషయమేమిటంటే దక్షిణ భారతంలోని రెండుచివర్లలోఉండే మంగళూరు (పశ్చిమం), మదరాసు (తూర్పు) లకు సరిగ్గా మధ్యభాగాన బెంగుళూరుఉంది. ఇది చాలావరకు తిరుపతికి సమానమైన అక్షాంశరేఖపైన, సముద్రమట్టానికి 3000 అడుగుల ఎత్తునఉంది. కన్నడంతోబాటు అప్పట్లో కొంకణికూడా వాడుకలో ఉండటం అదృష్టమే.* కన్నడం జిల్లాలో అందరికీ అర్థమవుతుంది. అయినా తుళు, కొంకణి జాతిపరంగా, ఆర్థికకారణాలవల్ల, నిత్య వ్యవహారంలో జీవిస్తున్నాయి.

* ఈ అదృష్టం రాబోయే పాతికేళ్ళలోనో, ఏభై ఏళ్ళలోనో వివిధంగా పరిణమిస్తుందో ఊహించవచ్చు. ఎందుకంటే కొంకణి తనదే అయిన సాహిత్యాన్ని పెంపొందించుకుంటున్నది; సాహిత్య అకాడెమిచేత గుర్తించబడింది కూడా. తుళుకు కూడా ఆ అదృష్టం పడుతుందా?

సారస్వతులు అందగాళ్లు, తెలివిపరులు అయిన చిన్న శాఖ. వారు మేధాపరమైన జ్ఞానార్జనలో ఆసక్తులు. శాంతి, మానవతాదృక్పథాలతో కూడిన కళలలో వృత్తులలో ఆసక్తి కలవారు. సాహిత్యక, కళాత్మక, రాజకీయ, పాలనా సంబంధమైన, చట్ట సంబంధమైన, వైద్యపరమైన విభాగాలలో పేరెన్నిక గన్నవారు. వారిలో వారికి గల సమిష్టిపరమైన ఆత్మీయత బాలా గట్టిది. దక్షిణ కన్నడ జిల్లాకు వెలుపల ముఖ్యంగా బొంబేలో, ధార్వాడలో, బెంగుళూరులో, మదరాసులో వారు వ్యాపించారు. ఇవన్నీ ఉన్నత విద్యకూ, సంస్కృతికీ కేంద్రాలుగా ఉండేవి. సాంస్కృతికంగానే కాక సామాన్య జనసంబంధమైన, పౌరవ్యవహార సంబంధమైన ప్రభావాన్ని కల్గిన కేంద్రాలు. సారస్వతులు ఎక్కడున్నా వాళ్ళ ఉనికిని అందరూ గుర్తించేట్లు మసలుకుంటారు; ఆభిజాత్య సహజమైన ప్రతిభతో నడుచుకుంటారు. సాహిత్యపరమైన సాధనకు దోహదమయ్యేట్లుగా సారస్వతులకు తమిళం, మళయాళం, కొంకణి, మరాఠీ, కన్నడ భాషలతో పరిచయం వుంది. మరాఠీ మీద వారిలో చాలా మందికి పక్షపాతం ఉండేది. ఎందుకంటే అనేకులు సులువుగా ధార్వాడ, పూనా, బొంబాయిలకు వలసవెళ్లారు. అందువల్ల ఎక్కువమందికి మరాఠీతో పరిచయం ఉండేది. ఈ విధంగా దక్షిణ కన్నడజిల్లాలో వేరూని ఉన్నా పై చెప్పిన ప్రదేశాలకు వ్యాపించి అక్కడి భాషనూ, అలవాట్లనూ తమ సొంతం చేసుకున్నారు. ఇలా వీళ్లు వెళ్లిన ప్రదేశాల్లో బహుశా గోవా మొదటిది.

తుంగభద్రకు ఈవలివైపుగాని, ఆవలివైపుగాని కన్నడసీమలోకూడా అప్పట్లో కన్నడభాషకు తగినంత గౌరవం లభించలేదు. శుద్ధ కన్నడ ప్రాంతమైన పాతమైసూరు రాజ్యంలో కూడా అంతగా స్థానం లభించలేదు. 1870 ప్రాంతం నుంచి మదరాసుకు చెందినవారే దివానులై మైసూరు పరిపాలన సాగించారు. మైసూరు వారు ఇంగ్లీషును బాగా ఆదరించారు. 1798 – 99 వరకు రెండు తరాల ముస్లింపాలకుల అధీనంలో ఉండడం వల్ల ఇస్లామ్ ప్రభావమూ ఉంది. ఈ శతాబ్దపు రెండవ - మూడవ దశాబ్దాల వరకు కూడా కన్నడం ఒక ప్రత్యేక శక్తిగా రూపొందలేదు. కన్నడంమీద నిజమైన అభిమానం మాత్రం - అస్పష్టంగానైనా సరే ఉంటూ వచ్చింది. వంగదేశంలో, మహారాష్ట్రంలో అప్పుడప్పుడే పొటమరించిన భావనలను కన్నడ పండితులు, అనేకసాహిత్యవేత్తలు జీర్ణం చేసుకోడానికి ప్రయత్నించారు. తమకున్న ఆంగ్ల పరిజ్ఞానంతో తమ ప్రాంతీయ భాషలో సృజనాత్మక శక్తిని ఆధునిక విజ్ఞానసాధనంగా మలచడానికి ప్రయత్నించారు. అదృష్టవశాత్తు దక్షిణ కన్నడ జిల్లాలో పంజెవంటి వారు కన్నడ భాషాభివృద్ధికి ఉుఒడే

మహనీయులను కొందరిని కూడగట్టారు. పంజె అన్ని విధాల వివేకి విద్య కోసం, సృజనాత్మక సాహిత్య సృష్టి కోసం నిర్విరామ కృషి సల్పినవారు. దీక్షతో ఆయన చేసిన సేవ గణనీయమైంది.

ఈ శతాబ్దపు మొదటి దశాబ్దంలో మేము బడిలో చదువుకుంటున్నప్పుడు పంజెవంటి రచయితలను గురించి విన్నాము. ఆ తర్వాత కొన్నిరోజులకు ఎం. ఎన్. కామత్‌ను గురించి, స్వదేశాభిమానివంటి వార్తాపత్రికలను గురించి, కంఠీరవ ముద్రణశాలను గూర్చి, ధర్మప్రకాశ ప్రెస్‌వంటి ప్రచురణ సంస్థలను గురించి విన్నాము. కోడియల్ బెయిల్ గురించి, మంగళూరులోని బాసెల్ మిషన్ గురించి విన్నాము. ప్రొటస్టెంట్ క్రైస్తవ నాయకులతో కూడిన బాసెల్ మిషన్ ప్రెస్ నూతన్న విద్యావిధానానికి చాలావరకు పునాది వేసింది. ఇప్పటికీ అనధిగమ్యాలై నిలిచిన విలువైన వ్యాకరణాలను, నిఘంటువులను ప్రచురించింది. కన్నడ లిపికి అవి తుది రూపాన్నిచ్చాయి, ఆ సంస్థలనుంచే మదరాసు, మైసూరు ప్రాంతాలకు కన్నడ వాచకాలు లభించాయి. అదృష్టంకొద్దీ పంజె, బాసెల్ మిషన్ ప్రెస్ ఒక్కటైనారు. ఇద్దరికీ దీనివల్ల లాభించింది. విద్యారంగంలో, సాహిత్య సాంకేతికరంగాలలో అనేక విధాలుగా పుష్టికరమైన సాధన చేశారు. పండితులు, సారస్వతసేవ చేసినవారు ఉండవచ్చు. కాని ఉన్నతవిద్య, జ్ఞానము అభివృద్ధి చెందిన ఆ జిల్లాలో కూడా పంజెవంటి మానవీయత, తేజస్సు, సరసత కలవారు నేటికీ మరొకరు కనిపించరు. విద్వత్తులో, సాహిత్యసేవలో మంజేశ్వరానికి చెందిన ఎమ్. గోవిందపైగారు, డా. టి. ఎం. ఎ. పైగారి ఆధ్వర్యంలో ఉండే ఉడిపి, మంగళూరులలోని సాంస్కృతిక సంస్థలూ అనేక సాంస్కృతిక కేంద్రాలకు తర్వాత దారిదీపాలు కావడం గమనార్హమే. అయినా పంజె మంగేశరావుగారిని గురించి తెలిసినవాళ్ళకు ఆయన వ్యక్తిత్వంతో, మానవీయతతో, సంస్కృతికి చిహ్నంగా ప్రత్యేక వ్యక్తిగానే దర్శనమిస్తారు.

ఉన్నతమైన సాంస్కృతిక, ధార్మిక సంప్రదాయాలుండే మధ్య తరగతి కుటుంబంలో 22 - 2 - 1874 నాడు పంజె జన్మించారు. ఆర్థికంగా వాళ్ళది చెప్పుకోదగ్గ సంసారంకాదు. దక్షిణ కన్నడానికి, మైసూరికి మధ్య ఉండే పుణ్యక్షేత్రమైన సుబ్రహ్మణ్యానికి దగ్గర ఉండే పల్లెటూరు పంజ. అక్కడినుంచి వీరి కుటుంబం మంగళూరుకు దక్షిణంగా 30 మైళ్ళ దూరంలో ఉండే బంట్వాల్‌కువచ్చి అక్కడ స్థిరపడింది. ఇది దక్షిణ కన డంలోని పెద్ద నది అయిన నేత్రావతికి అటువైపు ఉంది. పంజె తండ్రి రామప్పయ్య దైవభక్తి కలవాడు. తల్లి శాంత - దుర్గ లేక సీతమ్మ భక్తి యుక్తులు గల్గిన హిందూగృహిణి. భర్త మరణం తర్వాత ఆమే నలుగురు కొడుకుల్నీ, ఒకరిద్దరు కూతుళ్ళనీ పెంచి పెద్ద చేయవలసివచ్చింది.

రామప్పయ్యగారి జీవితకాలంలో వారి కుటుంబం కొన్ని వ్యాజ్యాలలో ఇరుక్కొని పిత్రార్జితమైన ఆస్తిని పోగొట్టుకుంది. తండ్రి దేవాలయం అర్చకుడుగా సంపాదించి దాని మీదే ఆధారపడవలసివచ్చింది. పంజె తల్లి తన ఆభరణాలను అమ్మి, తను పొదుపుచేసి వుంచిన కొద్ది డబ్బును వెచ్చించి ఉండడానికి ఒక ఇల్లు కట్టించింది. దానితోపాటు కట్టించిన రెండు చిన్న కుటీరాలమీద వచ్చిన బాడుగతో పిల్లలను పెంచింది. ఆమె పడింది చాలా కష్టమే. అయితే ఆమె అంటే చుట్టుపక్కల కుటుంబాల వారందరికీ గౌరవం ఉండేది. అనేకులు ఆమెను చాలావాటికి సంప్రదించేవారు. సాంప్రదాయిక విజ్ఞాన ఖని ఆమె పంజె తల్లి సహాయంచేసే గుణం, ధార్మిక భావనకల వ్యక్తి. పంజె తండ్రి పరిశుద్ధమైన, ధర్మబద్ధమైన జీవనం గడిపినవాడు. వారి పిల్లలు తండ్రిని గూర్చిన చక్కని జ్ఞాపకాలతో, తల్లి మీద గౌరవభావంతో పెరిగి పెద్దవాళ్ళయ్యారు.

(పంజె కుటుంబాన్ని గూర్చి, ఆయన జీవితాన్ని గురించిన కొన్ని వివరాలు అనుబంధం 1, 2 లలో ఇవ్వడమైనది.)

# II

# బాల్యం – విద్యాభ్యాసం

బంట్వాల్ చిన్న పట్టణం, అయినా అందమైనది. పాత మైసూరు, అప్పట్లో ఉత్తర కర్నాటకమని పిలువబడుతుండిన భూభాగమూ గల సమతల ప్రదేశానికి పడమటి కనుమల ద్వారా వెళ్ళే రహదారిలో ఉన్నదీ పట్టణం. అందువల్ల పట్టణప్రాంతపు లక్షణాలు, గ్రామీణ లక్షణాలు రెండూ ఉన్నాయి దానికి. పంజె కుటుంబం వాళ్లు అక్కడి 30 - 40 సారస్వత బ్రాహ్మణ కుటుంబాలలో చాలా ముఖ్యమైనవాళ్లు. అంతేకాక రామప్పయ్యగారి పిల్లలు వారి పెద్దల దైవభక్తికీ, జ్ఞానసంపత్తికీ, వాళ్ల సరస సౌమ్యగుణాలకూ పేరు పొందారు. ఆ పట్టణంలోని పిల్లల సామాజిక, సాంస్కృతిక సమావేశాలలో వాళ్లు పాల్గొనేవారు. పెద్దన్నయ్య కృష్ణారావు అభిప్రాయాలలోనూ, అలవాట్లలోనూ గంభీరుడు. మంగేశరావు రెండవవాడు. మిగిలిన సోదరులైన శివరావు, శ్రీనివాసరావు, రాఘవేంద్ర, తండ్రి చనిపోయేనాటికి

పదినెలల పసికందు అయిన చిన్న తమ్ముడూ - అందరూ మెరికల్లాంటి పిల్లలు. చుట్టుపక్కల వారితో కలుపుగోలుగా ఉండేవారు. కొబ్బరి, మామిడి, పనస, జీడి మామిడి, చింతచెట్లు పచ్చని సంపదతో ప్రకృతి శోభనినుమ డింపజేయగా, నేత్రావతినది వాళ్ళకెప్పుడూ ఆనందాన్ని చేకూర్చేది. స్థానీయంగా చిన్న పిల్లలు ఆడుకునే ఆటలలో పంజె చురుకుగా పాల్గొనే వాడు. కాని శరీరదార్ఢ్యం కలవాడు కాడు. ఆయనకు చదరంగమన్నా, ఈత అన్నా ఇష్టముండేది. మంచి ఈతగాడయినా ఒక మారు ఆయన చిన్న తమ్ముడు నీళ్ళలో మునిగి పోతుండగా రక్షించడానికి వెళ్ళి తనే మునిగిపో బోయాడు. శంకర్‌ను రక్షించాలనుకుంటే అతనికి అలవికాకపోగా అప్పుడు శివరావు కూడా దూకాడు. అందరూ మునిగి పోయేవారే. ఒడ్డున ఉండిన ఎవరో దూకి వాళ్ళను రక్షించారు. అలా అచేతనమైన స్థితిలో బతికి బయటపడ్డ పిల్లలు కొన్ని దినాలవరకు కోలుకోలేదు. పంజె తన తండ్రివలెనే దైవభక్తి కలవాడు. ఇంట్లోను దేవాలయంలోను నేర్చుకున్న మంత్రాలను అతను వల్లెవేసేవాడు. తల్లి దగ్గర్నుంచి అతను మరాఠీ, కన్నడ భక్తిగీతాలను, సూక్తులను నేర్చుకున్నాడు. మృదుమధురమైన కంఠంతో ఆయన గీతాలను గానం చేసేవాడు. కొన్నిటిని ఆయనే రచించాడు. మొదటినుంచీ ఆయనకు అక్షరరమ్యత మీద అభిమానం. ఆయన చేస్తుండిన హాస్యప్రసంగాలూ, ఛలోక్తులూ తల్లికి, నాయనమ్మకూ సంతోషం కలిగించేవి. చిన్నవాడిలో వికసిస్తున్న ప్రతిభ వాళ్ళకు ఆనందదాయకమయింది. సమస్యాపూరణం వంటివి అప్పట్లో కన్నడ దేశంలోను, తెలుగు దేశంలో మరింతగానూ ప్రసిద్ధమై వుండేవి. ఒక పదంతో ప్రారంభించి దాన్ని పాదంచేసి దానికి మరో పాదం జతకూర్చడం, అర్ధపుష్టి ఉన్నా లేకపోయినా, దాన్ని నాలుగుపాదాల పద్యంగా పూర్తిచెయ్యడం పద్ధతి. ఇదొక కసరత్తు. అనేక సంఘటనలు, పంజె, ఆయన సోదరులు ఇలాంటి ఆశు కవితా రీతిలో పద్యాలుగా కూర్చడం గూర్చి చెబుతారు. పంజె తల్లికి ఇవి చాలా సంతోషాన్ని కలిగించగా, ఇతరులు వీరి ప్రదర్శనంలోని సౌందర్యానికి, సాధనకు అచ్చెరువు చెందేవారు. వాళ్ళ కులంలోని కొందరు పెద్దవాళ్ళు కూడా ఇలాంటి పద్యాలను కొన్నింటిని అల్లేవారు.

పంజె తమ వూళ్ళో చదువుకోడానికి కాని, సంప్రదించడానికి గాని మంచి గ్రంథాలయం వగైరాలు లేకున్నా స్వతః చదువుపట్ల ఉత్సుకత, ఆలోచన ఉన్నవాడనడంలో సందేహంలేదు. తనకు తెలిసిందేదో తనతో తిరిగే యువకులకు తెలియజెప్పేవాడాయన. పంజె చేసిన కవితా ప్రయోగా లను పంజె ముఖ్యోపాధ్యాయుడుగా వుండిన పాఠశాలలో ఆయన స్నేహితులు అనుసరించేవారు. ఆయన కవితా ప్రయోగాన్ని బంట్వాల్‌లో చాలాకాలం

జ్ఞాపకం వుంచుకున్నారు అక్కడివారు. పంజె వాళ్ళమ్మకు ఇంటిపనులలో సహాయం చేయవలసి వచ్చేది. బావిలో నీళ్ళు చేది ఇచ్చేవాడు. ఊళ్ళో రథోత్సవం జరిగినా, మరేవైనా వుత్సవాలు, వూరేగింపులు జరిగినా ఎంతో మంది స్నేహితులను పోగుచేసేవాడు. ఆయన ఇచ్చే సహకారం, సహాయం పెద్ద ఎత్తునే వుండేవి. తండ్రి ఆదాయం చాలా తక్కువగా ఉండడంచేత కుటుంబ భారమూ, అప్పులూ ఎక్కువవడం వల్ల వాళ్ళ కుటుంబం ఎట్లానో సర్దుకోవలసివచ్చేది.

## ఉన్నత పాఠశాల విద్య:

ఉన్నత విద్యకై పంజె వెళ్ళవలసిన సమయం వచ్చింది. బంట్వాల్‌లో ప్రాథమిక పాఠశాల మాత్రమే వుండడంచేత అక్కడ అతని చదువు కుదర లేదు. వాళ్ళ కుటుంబం కూడా అతనికి ప్రోత్సాహం ఇవ్వలేక పోయింది. తాను మంగళూరులో తల్లి వైపు బంధువు ఒకరి ఇంట్లో వుండడం పంజెకు గుర్తు ఉండేది. మంగళూరు వంటి పట్టణంలో పాఠశాల విద్యార్థిగా ఆయన ఎట్లాగో దుస్తులు కొన్ని సమకూర్చుకొన్నాడు ఆయన బుద్ధి కుశలత వల్ల, పరిశ్రమ వల్ల ఉపకార వేతనం పొందగలిగాడు. మిగిలిన అవసరాలకోసం ప్రయివేట్లు చెప్పుకోవలసి వచ్చింది. ఆయన పొద్దుటి, సాయంత్రపు ఉపాహారం కోసం ఏం చేసిందీ, రాత్రి ఎక్కడ పడుకున్నదీ మంజేశ్వర గోవిందపై వర్ణించారు :

"అప్పటికి ఆయన కుటుంబాన్ని మంగళూరుకు తీసుకొని రాలేదు. గణపతి దేవాలయానికి వెళ్ళే వీథిలో, వేణుగోపాల దేవాలయానికి చెందిన మఠం పక్కనే వున్న సోదరి యింట్లో ఆయన పొద్దున - రాత్రి - రెండు పూటల భోంచేసేవారు. రెండుపూటల ఉపాహారాన్ని మంగళూరులోని విట్టలరావు రెస్టారెంటులో తీసుకునేవారు. బస గౌరి మఠం వీథిలో ఉండే నయంపళ్ళి శంకరనారాయణరావు ఇంట్లో. ఇది ఆయన దినచర్య. ఆయనను కలవాలంటే శంకరనారాయణరావుగారింటి ముంగిలి వైపుండే పై అంతస్తు చిన్న గదికి వెళ్ళి చూడవలసివుండేది...." అప్పట్లో రాయటానికిగాని, నోట్సు తీసుకోవడానికి గాని కాగితం కావాలంటే దొరికేది కాదు. కాగితం కరువు రోజులవి. ఒకే వుటలో పంజె రెండుసార్లు వ్రాసేవాడని తోస్తుంది. ఒక గీతకు మరొక గీతకు మధ్యలో ఒకసారి ఒక సిరాతో, మరొకసారి మరో సిరాతో రాసేవారు. తీరికైనప్పుడు తన దగ్గరలేని పుస్తకాలను ఇతరుల దగ్గర తెచ్చుకొని చదువుకునేవాడు. జ్ఞాపకశక్తి, ధారణ చక్కగా వుండడం వల్ల, మంచి అవగాహన శక్తి వుండడం వల్ల పంజె ముందుకు వచ్చాడు.

బంట్వాల్‌లోని తన కుటుంబంవారికి, సోదరులకు సహాయం, అవసరం అనిపించడం వల్ల పంజె కొన్ని ప్రయివేట్లు చెప్పాడు. దీనితో కొంత

డబ్బు వచ్చింది. దీనివల్ల అతనికి, అతనివారికి కొంత సహాయం లభించి నట్లయింది. 1892 లో తన బంధువర్గానికి సంబంధించిన ఋణభారంవల్ల, హృదయావేదనతో రామప్పయ్య కాలధర్మం చెందాడు. ఉన్నత న్యాయ స్థానంలో ఆయనకు వ్యతిరేకంగా తీర్పు చెప్పబడింది. వారి కుటుంబం బాధల పాలయింది. తన తండ్రి చివరి గడియలో ఉన్నవార్తవిని, రాధారి పడవల్లో చివరది కూడా వెళ్ళిపోగా, పంజె రాత్రల్లా నడిచి తన వూరు చేరుకుని తండ్రి నుంచి చివరి ఆశీర్వాదం పొందగలిగాడు. అందరు పిల్లలూ తండ్రి వద్దనే ఉండినారు. పంజెకు వాళ్ళ నాన్నగారిచ్చిన ఆజ్ఞ "ఎప్పుడూ మద్యం ముట్టవద్దు: నిర్మలంగా నిజాయితీతో వ్యవహరించు, ఎంత కష్టమైనా నీ అన్నదమ్ముళ్ళను, అక్కచెల్లెళ్ళను సరిగా చూచుకో" అని. దానిని చివరివరకు నిష్ఠతో పాలించాడు పంజె.

అప్పటికి వాళ్ళ పెద్దన్న పై చదువులకోసం మదరాసు వెళ్ళాడు. గ్రాడ్యుయేట్ అయిన తర్వాత పెళ్ళి చేసుకొని బొంబాయి రాజ్యంలో ఉద్యోగంలో చేరాడు. దానితో వాళ్ళ కుటుంబానికి అరుదైపోయాడు. సోదరుల మధ్య చివరిదాక ప్రీతికి కరువు లేకున్నా, కుటుంబానికి కృష్ణారావు చేయగలిగిందేమీ లేకపోయింది. వాళ్ళ కుటుంబం మంగళూరుకు వెళ్ళవలసి వచ్చింది. అప్పట్లో ప్రయాణం కష్టంతో కూడుకొని వుండేది. తపాలా సౌకర్యాలు సవ్యంగా వుండేవికావు. ప్రభుత్వపు నౌకరీబాధ్యతల వల్ల కృష్ణా రావుకి తీరికవుండేది కాదు. 1894 ప్రాంతంలో ఒక ప్రసిద్ధ కన్నడ పండితుని చెల్లెల్ని పంజె పెళ్ళి చేసుకున్నాడు. ఆ పండితుడు తర్వాత మదరాసు ప్రభుత్వంలో ప్రధాన అనువాదకుడయ్యాడు. వాళ్ళ కుటుంబం మంగళూరుకు దక్షిణాన 35 మైళ్ళ దూరంలో వుండే పుత్తూరికి చెందింది. పంజె ఎఫ్. ఎ. పాసయ్యాక పై చదువుకు, కుటుంబ సంరక్షణకు ప్రయత్నాలు సాగించాడు. ఆయన గణితంలో పట్టం పుచ్చుకోవాలని ఉబలాట పడ్డాడు. అదంటే ఆయనకు చాలా ఇష్టం. కాని మంగళూరులోని ఒకే డిగ్రీ కళాశాల అయిన సెయింట్ ఎలోషియస్. కాలేజీలో ఆ విషయం లేకపోవడంవల్ల కన్నడం, చరిత్ర, అర్థశాస్త్రాలతో తృప్తి పడవలసివచ్చింది. త్వరలోనే రెండు భాగాలలో ఉత్తీర్ణుడై - పూర్తిగా పట్టం కూడా పుచ్చుకో కుండానే మంగళూరులోని ప్రభుత్వ కళాశాలలో ఆయన సహాయో పాధ్యాయుడుగా చేరాడు. విద్యార్థిగా పనికిరాడని ఆశవదలుకున్న కన్నడ అధ్యాపకునికిది ఆశ్చర్యం కలిగించింది.

# III

# ఉద్యోగజీవనం

ఈ సందర్భంగా అందరూ చెప్పుకునే ఒక సంఘటన ఆసక్తి కరమైంది. మంచికవి, కన్నడ పండితుడూ అయిన నందళికె లక్ష్మీ నారాయణప్ప కూడా అదే వుద్యోగానికి దరఖాస్తు వేశాడు. ఆయన తర్వాతి కాలంలో కన్నడ సాహిత్యానికి గొప్ప సేవచేశాడు. ప్రభుత్వ కళాశాలాధ్యక్షులైన శ్రీ హెన్స్‌మన్ అనే సింహాళీయుడు పంజెనే ఎన్నిక చేశాడు. పంజెకు ఇంగ్లీషు తెలిసివుండడం, మరొకరికి ఆ అర్హత లేక పోవడమే అందుకు కారణం. ఈ విషయాన్ని గురించి పంజెకు ముందుగా తెలియదు. అందువల్ల ఇద్దరి జీవన మార్గాలు తారుమారయ్యాయి. తన ఎంపికవల్ల నందళికెగారి అవకాశం తప్పిపోయిందని తెలుసుకున్నపుడు, పంజె ఆయనకొక తియ్యని లేఖ రాశాడు :

"వడ్లు దంచను వుపయోగించే రోకలిని కన్నడ సాహిత్యాన్ని, ప్రక్రియలను బోధించడానికి ఎన్నుకున్నారు; నెమలిపింఛంతో తయారైన చిత్రకారుని కుంచెను చెవిలో గుబిలి తీసుకోడానికి వదలిపెట్టారు."

ఉడిపిలో వ్యాయామ శిక్షకుడుగా ఉండిన నందళికె సృజనాత్మక శక్తిని గురించి పంజెకు కూడా పూర్తిగా తెలియదు. నందళికె తనతో ఉద్యోగంకోసం పోటీచేస్తున్నాడని కూడా ఆయనకు తెలియదు. నందళికె రాసిన కుమారవిజయమనే యక్షగానం చదివిన తర్వాత ఆయన్ను మెచ్చుకోకుండా వుండలేకపోయాడు పంజె. అనేక వేదికలమీద 'దక్షిణ కన్నడ జిల్లాలోని నిజమైనకవి ఈయన' అని ఉద్ఘాటించాడు పంజె. వృత్తిధర్మంగా పంజె కన్నడ అధ్యయనంలో ప్రత్యేక పరిశ్రమ చేయవలసివచ్చింది. ఆయన ఎంపిక నందళికెకి దురదృష్టకరమైతే, ఆయనకు కలిసివచ్చిన అదృష్టమని చెప్పాలి. ఆయనకు వేతనం నెలకు 20 రూ. మాత్రం వచ్చేది. అందరు సోదరులూ విద్యాభ్యాసంకోసం మంగళూరులో వుండేవారు, అప్పటికే వాళ్ల కుటుంబమంతా బంట్వాల్‌కు నీళ్ళు వదిలేసి మంగళూరులో స్థిరపడింది. కొంతకాలం తర్వాత వాళ్ల అమ్మ పెద్ద కొడుకు దగ్గర వుండడానికి వెళ్లినట్లుంది. మరొక సోదరుడు మదరాసులో చదవడానికి వెళ్ళాడు. అప్పుడు మంగళూరులో పంజె, ఆయన భార్య, పిల్లలు మిగిలారు. తన సంపాదనతో పంజె ఎలాగో కాలం వెళ్ళ బుచ్చేవాడు.

పంజె ఇద్దరు సోదరులు త్వరగానే కాలధర్మం చెందారు. పంజెతో చాలా అనుబంధం వున్నవాడు, 'బహిశ్చరాః ప్రాణాః' అన్నట్లుగా వున్న వాడు, పంజెతో ఎప్పుడూ చదరంగం ఆడేవాడు అయిన సోదరుడు రాఘవేంద్ర కూడా చనిపోయాడు. ఇదంతా వాళ్లమ్మ ఇంటినుంచి వెళ్లక ముందే జరిగింది. 'అగంద' అని పిలవబడుతుండిన ఈ సోదరుని మరణం పంజెకుదిగ్భ్రాంతి కలిగించింది. ఒకవైపు ఈదుఃఖం, మరోవైపు మంగళూరులో సంసారభారం వహిస్తూ స్వతంత్రంగా నిర్వహించుకుని రావడం - శీల దార్ఢ్యం లేని మరొకరినయితే క్రుంగదీసి ఉండేవి. అయితే ఆయన ఎంతో నిగ్రహంతో, సంయమంతో తననూ, తనవాళ్ళనూ ఉద్ధరించుకోవాలని దీక్ష పూనాడు. ఈ కాలంలో ఆయన రాసిన పాటలలో ఒకటి శ్రీమతి హెమన్ గారి పద్యానికి అనువాదమో, అనుసరణో అని కొందరు భావిస్తారు. తరువాతి కాలంలో ఆయన చిన్నకొడుకు, ఇంకా కొందరు ఈ విషయాన్ని గురించి అడిగినప్పుడు ఆయన నవ్వి ఊరకున్నారట. ఇలాంటివి ఏవో మూల రచనలనుంచీ ప్రేరణపొందినవీ తీసుకున్నవీ కావచ్చు. అయితే ఈ రచనలోని భావావేశం పెంపొందినతీరు, ముఖ్యంగా చివరి పద్యం చూస్తే భారతీయ కుటుంబ జీవనాన్నీ, సంస్కృతినీ ప్రతిబింబించేదిగా, అందులో తల్లి మనసును పట్టి చూపేదిగా వుంది:

"చందు కేళ్ ! దారియలి నా పోపె ముందె
బందపను బళిక నిన్నయ ముద్దు తందె
మంది మక్కళు పడెదు బా నీను హిందె
ఎందవన బాయ బిగిదళు ముద్దినిందె"

"విను చందు ! దారిలో నేను వెళ్తాను ముందు
వస్తాడు వెనక నీ ముద్దులతండ్రి
పిల్లా జెల్లాతో రా నీవు వెనక
అంటూ అతని నోరు మూసింది ఒక ముద్దుతో"

— తరతరాల హిందూకుటుంబ సంస్కృతిని, సంప్రదాయాన్ని ప్రతిబింబిస్తున్నదిది !

కొంతకాలం తర్వాత కృష్ణయ్య మాస్టారు పదవినుండి నివృత్తులు కాగా ఆ ఉన్నతస్థానం పంజెకు లభించింది. దీనితో ఆయన నెలసరి వేతనం మరో పదిరూపాయలు పెరిగింది. అప్పటినుంచి పంజె జీవనం సక్రమంగా, ఆర్థికపరమైన ఇబ్బందులను అధిగమించి నడచినట్లుగా అనిపిస్తుంది.

ఇప్పటికి ఉపాధ్యాయ జీవితంలో స్థిరపడాలన్నది నిశ్చితం కాగా విద్యాబోధనలో పట్టం పొందవలసివచ్చింది పంజె. అంటే మదరాసుకు ప్రయాణం చెయ్యాలి. వాళ్ళు వాళ్ళు మదరాసు రైలెక్కడానికి కన్ననూరు వరకు ఎద్దుల బండిలో ప్రయాణం చేశారు. ఆయన భార్య, పిల్లలు మదరాసు లోని బంధువు లింట్లో బసచేశారు. పంజె భోజనం వసతి వున్న దక్షిణ కన్నడ జిల్లా విద్యార్థుల కూటమిలో చేరాడు. ఎంత కష్టమయినప్పటికీ తొమ్మిది నెలల్లో విద్యావధిని ముగించుకొని ఎల్. టి. పట్టం తీసుకొని పంజె మళ్ళీ మంగళూరు చేరాడు. ఆయన్ను ప్రభుత్వోద్యోగంలో స్థిరం చేశారు.

పాఠశాల పర్యవేక్షణాధికారి (ఇనస్పెక్టర్) :

తర్వాతి దశలో పంజె పాఠశాలల ఉప సహాయ పర్యవేక్షణాధికారి అయ్యాడు. ఆయనను అప్పట్లో దక్షిణ కన్నడ జిల్లాలో వుండిన కాసరగోడ్‌లో వేశారు. (ప్రస్తుతం ఇది ఉత్తర కేరళలో వుంది. అప్పట్లో అదీ మదరాసు రాజ్యానికి చెందినదే). పర్యవేక్షణాధికారిగా ఆయన కారకులైన సంఘటన ఒకటి, చిన్నపిల్లల విద్యాబోధనను సరళంగా చెయ్యడం గురించి ఆయనకున్న ఆకాంక్షను తెలుపుతుంది. బాసెల్ మిషన్ ప్రెస్‌తో ఆయనకు వుండే సంబంధం వల్ల అప్పటికే మూడు 'R' లను బోధించటంలో ఆయన దిట్ట అయ్యారు. (Reading Writing and Arithmetic are the three 'R'S – Translator) మిషనరీలతో వున్న సాంగత్యం వల్ల ఆట - పాటలతో కిండర్‌గార్డన్ విధానంలో చదువుచెప్పే పద్ధతి ఆయనకు నచ్చింది. అంతకు ముందు పిల్లలకు బడికి పోవాలంటేనే తలనొప్పిగా వుండేది. ఇప్పుడు ఎప్పుడెప్పుడు వెళ్దామా అనే స్థితికి వచ్చారు. వాళ్ళు ప్రతిరోజు తెల్లవారడం కోసం ఎదురుచూచేవారు. ఆట, విద్యాభ్యాసం ఒకటిగా సాగేందుకు జర్మన్, పాశ్చాత్య పద్ధతిలో పాటలను కట్టడం ప్రవేశపెట్టి పాఠ్యగ్రంథాలను అచ్చువేశారు. మూలగేయ పాదాన్ని కన్నడంలోకి అనువదించియో, లేక కన్నడ పాఠశాలలకు తగినట్లుగా మార్చియో, పాశ్చాత్య సంగీతంకూర్చి పాటలను ప్రవేశపెట్టారు. అది మిషనరీలకు పూర్తిగా నచ్చకపోయినా, పంజె తమ కొత్త విధానంతో పిల్లలను ఎలా ఆకట్టుకొన్నదీ, పంజె కొత్త విధానాలను, రీతులను మనస్ఫూర్తిగా ఎలా అలవరుచుకున్నది వాళ్లు గమనించారు. ఒక పాఠశాలా పర్యవేక్షణాధికారి విషయంలో ఇది గొప్ప అనే చెప్పాలి. కాసరగోడులో ఒక అందమైన స్థలంలో భార్య, పిల్లలూ స్థిరపడ్డారు. ఇన్‌స్పెక్టరుగా వుండిన తమ తండ్రితో పొద్దుపుచ్చిన మధురక్షణాలు ఎటువంటివో వాళ్ళ పిల్లలనడిగితే చెప్తారు. అంతేకాక పాఠాలను నేర్చుకోడానికి వాళ్ళ నాన్న పద్ధతులు ఎంత సులభమయినవో

కూడా వాళ్ళు చెప్తారు. పెద్దకొడుకుల విద్యాభ్యాసం పూర్తి అయింది. త్వరలోనే అందరూ మంచి వుద్యోగాలలో చేరారు. అందరిలోకి పెద్దవాడైన శ్రీ ముకుందరావు జంషెడ్‌పూర్‌లో చేరాడు. ఆ తర్వాత భిలాయ్‌కి మారాడు. రెండవ కుమారుడైన పంజె గోపాలరావు హైదరాబాదులో ప్రసిద్ధ అడ్వకేటుగా స్థిరపడ్డాడు. మూడవ కుమారుడు పంజె రామారావు. ఆయన 1973లో విషాదకరమైన పరిస్థితిలో ఒక బస్సు ప్రమాదంలో మరణించాడు. కూతురు శ్రీమతి అనసూయ లండన్‌లో సాహిత్యంలో పట్టం పుచ్చుకొని వచ్చిన ఒక యువకుణ్ని పెళ్ళిచేసుకొని బొంబాయిలో స్థిరపడింది. అందరికంటె చిన్న అమ్మాయి శ్రీమతి శాంత రామేశ్వరరావు ఇప్పుడు హైదరాబాదులో నివసిస్తున్నది. పంజెగారు కుటుంబంతో ఉల్లాసంగా, సంతోషంగా కాసరగోడులో జీవితం గడిపేరు ఆరోజుల్లో.

పర్యవేక్షణాధికారిగా పంజె పల్లెపల్లెకూ నడకతోగాని, ఎద్దులబండి మీదగాని తిరగవలసి వచ్చేది. బాబుపై అనే వంటవాడు, రామానాయక అనే సేవకుడు ఆయన వెంట ఎప్పుడూ వుండేవారు. వంట చేయడం, కావలసిన పనులు చూచిపెట్టడమే కాక వాళ్ళిద్దరూ మంచి సహాయకులుగా వుండేవారు. ఆయనతో గడిపిన రోజులను జ్ఞాపకం పెట్టుకోడమే కాక వాళ్లు పంజె ఆ రోజులలో రచించిన పాటలను కూడా గుర్తుపెట్టుకున్నారు. పంజె జానపదగేయాలను, కథలను, సామెతలను సేకరించడంలో వాళ్ళు తోడ్పడే వారు.

అప్పటికి కొంతకాలం క్రిందట మదరాసు విద్యాశాఖకు ఎ. జి. బోర్న్ అనే దొర వచ్చాడు. ఆయనొక విద్యాసంస్కర్త. ఆయన భాషా బోధనలో ప్రత్యక్ష విధానమనేదాన్ని ప్రవేశపెట్టాడు. అది అంతకుముందు విద్యా సంస్థలలో వున్న బోధనావిధానానికి పూర్తిగా భిన్నమైనది. పంజెకు ఈ విధానం చాలా సంతోషాన్ని కలిగించింది. దాన్ని మన పరిస్థితుల కనుగుణంగా మలచుకుంటే విద్యాభ్యాసం సులువవుతుందని, పిల్లలకు భారం తగ్గిస్తుందని ఆయన భావించాడు. ఈ విధానం ఉపాధ్యాయునికి, విద్యార్థికి – ఇద్దరికీ భారం తగ్గించడమేకాక నేర్చుకునే కాలాన్నికూడా తగ్గిస్తుంది.

కాసరగోడు తాలూకా మలేరియా వ్యాధిగ్రస్తమైన ప్రదేశం. అక్కడ

---

[1] కొన్నిరోజుల క్రితం ఉద్యోగం నుంచి నివృత్తులై ఆయన పూనాలో నివసిస్తున్నారు. రెండవ కొడుకు ఇటీవల దివంగతులయ్యారు.

[2] రామారావుగారు తమ తండ్రిగారి జీవనం గురించి కన్నడంలోను, ఆంగ్లంలోను ఆసక్తికరమైన, వివేకవంతమైన రచన చేశారు. వీరి జీవన రీతులను గురించి రామారావుగారి రచన వల్ల తెలుసుకోగల్గాను.

సహాయక పర్యవేక్షణాధికారిగా మారుమూల ప్రదేశాలలో కూడా తిరగ వలసివచ్చిన పంజె మొదట అనారోగ్యం పాలైనా, ఉక్కుమనిషి కావడంవల్ల విద్యా విషయికమైన శ్రద్ధాసక్తులు పుష్కలంగా వుండడం వల్ల తాలూకాలో ప్రాథమిక పాఠశాలా విద్యను గూర్చిన నూత్న దృక్పథాన్ని ప్రవేశపెట్ట డంలో కృతకృత్యుడయ్యాడాయన. ఆయన చేసింది కేవలం కార్యనిర్వ హణకు సంబంధించిన అజమాయిషీ, ఉపాధ్యాయులమీద పెత్తనం సాగిం చడంకాదు. ప్రతి పాఠశాలా ఆయన పర్యవేక్షణకోసం ఎదురుచూస్తుం డేది. ఆయన స్వయంగాచేసే బోధన పాటలతో, నృత్యాలతో, ఆటలతో, కథలతో, మొత్తంమీద పాఠశాల జీవితాన్నే సంతోషప్రదంగా మారు స్తూండేది. ఇంటిబాధలు, స్థానికమైన వాతావరణంనుంచీ అక్కడివారికి విముక్తి లభించినట్లుండేది. అది ఉపాధ్యాయులకు కూడా విద్యాభ్యాసంగా వుండేది. బోర్న్‌గారి ప్రత్యక్షవిధానం పూర్తిగా అమలుజరిగేది.

బోధనలో కొత్త పద్ధతులు :

గ్రామీణ ప్రాంతాలలోని ప్రాథమిక పాఠశాలల్లో విద్యాభ్యాసానికి ఎంత ప్రాధాన్యమిచ్చిందీ, ఇంకా ఇతర ప్రాంతాలలోని పాఠశాలలకూ ఎంత ప్రాధాన్యమిచ్చిందీ ఉపాధ్యాయులకు ఆయన మీదుండే ప్రేమనుబట్టి, ఆయన వాళ్ళను చూచిన విధానాన్నిబట్టి తెలుసుకోవచ్చు. వాళ్లదొక విషాదకరమైన పరిస్థితి. తర్వాత ఆయన రాసిన 'ఒక ఉప - సహాయక పర్యవేక్షణాధికారి అబద్ధపు దినచర్య' అనే రచనను గూర్చి చెప్తాను : దానిలో వారి జీవితం మనోహరంగా చిత్రించబడింది. రాయచూరులో జరిగిన కన్నడ సాహిత్య పరిషత్తువారి వార్షికోత్సవంలో అధ్యక్షోపన్యాసమిస్తూ (1934) చివరిపేరాకు ముందుపేరాలో పల్లెల్లోని పాఠశాలలను, అక్కడి అధ్యాపకులను పరిషత్తువైపు ఆకర్షించడంలో తనకెంతటి ఆసక్తివున్నది ఆయన వివరించారు :

"సాహిత్యసృష్టి, భాషాభివృద్ధి, గ్రామీణ ఆరోగ్యాభివృద్ధి, జాతీయసం క్షేమం ఇవన్నీ అధ్యాపకుల చేతిల్లోవున్నవి. వీరైతే సభ్యత్వపు చందాను తగ్గించి అయినాసరే, పరిషత్ సమ్మేళనాల ఆశయాలను, ఆకాంక్షలను తెల్పి వారిని సభ్యులుగా చేర్చుకోవాలి. వాళ్ళ ఆసక్తిని, ఆదరాన్ని సంపాదించడానికి మనం పాటుబడాలి. ఈ అధ్యాపకులు గనక సాహిత్య దీపాన్ని, వేడిని ప్రతి పల్లెకూ తీసుకుని పోగల్గితే ప్రతి పల్లెలోని పాఠశాలా ఒక పరిషత్ భవనమవుతుంది. పిల్లలు కలుసుకునే ప్రతి సభా చిన్నసాహిత్య పరిషత్తు సమ్మేళనం అవుతుంది. పాఠశాలవారు తయారుచేసే వ్రాతపత్రిక ఒకవిధంగా చిన్నరకం సాహిత్య పరిషత్పత్రికను పోలుతుంది. ఈవిధంగా పరిషత్తు,

పరిపత్తును గురించిన భావనపౌర జీవనంలో సంస్కరణను తీసుకొనివస్తుంది. ప్రాథమికమైన, శాశ్వతమైన, సత్యమైన సాహిత్యసృష్టికి తోడ్పడుతుంది. అటువంటి పునాదిని నిర్మించే వాస్తుశిల్పులైన గ్రామీణ పాఠశాలల యువ అధ్యాపకులే నా స్నేహితులు.”

ఆ కాలంలో బాలల విద్యాభ్యాసాన్ని ఆ పాఠశాలల్లో నడిపిస్తుండిన వారు సానిక సంస్థలవారు, ప్రయివేటు యాజమాన్యంవారు. వారిలో చాలా మంది లంచగొండ్లు, స్థానిక రాజకీయాలలో మునిగి, కులతత్వంతో ప్రవర్తించేవారు, సంస్థ పొందుతున్న సహాయధనంలో, అధ్యాపకుల జీతా లలో వాళ్ల భాగం తీసుకోడంవల్ల యాజమాన్యానికి చెందిన అధ్యక్షుడూ, సభ్యులూ లాభాలు పొందేవారు. పంజె అభిప్రాయంలో, మనంగనక ఈ విద్యను ప్రాథమికమని నిజమైన అర్థంలో భావించేట్లయితే త్వరలోనే ఆరోగ్యకరమైన విధానాలను ఆచరించే తరం తయారవుతుంది. ఆ తరం మన జాతీయ జీవితాన్ని, సకలరీతులా మన పౌరజీవనాన్ని చక్కగా నిర్మించగలుగుతుంది. అధ్యాపకులకు వారి బాధ్యతలను గుర్తించేట్లు చేయడంతోబాటు, వారిని మనుష్యుల్లా గౌరవించడమూ అవసరమే. వాళ్ల జీతాలు, జీవన స్థితిగతులు, కార్యసాధనలో వాళ్లకు లభించే సహకారం, యాజమాన్యంనుంచి వాళ్లపనికి తగిన గుర్తింపు ఇత్యాదులన్నిటినీ విద్యా శాఖవారు చక్కగా పరిశీలించాలి.

ఇతర పర్యవేక్షణాధికారులకు గాని, విద్యావిధానం అనబడేదానికి గాని ఈ పద్ధతులు నచ్చినా నచ్చకున్నా ఇదే పంజెగారి దృక్పథం, ఆయన ప్రయత్నాల స్వరూపం. పర్యవేక్షణాధికారిగానే పంజె మంగళూరుకు మళ్ళీ బదిలీ అయ్యేసరికి పాతదృక్పథాలుకలవారి హస్తాలు ఆయన కొత్త విధానాలకు అడ్డుతగిలాయి. పాఠశాలలను నడుపుతుండిన పురపాలక సంఘమూ, తాలూకా సమితులు, వాటి అధ్యక్షులూ, పలుకుబడిగల సభ్యులు— వాళ్ళలో కొందరు ఆయన కులానికి చెందినవారైనా - పంజెకు అడ్డు తగిలారు. ఆ విధమైన వారి ఆజ్ఞలు తప్పుగాను, నిరంకుశంగాను, అప్రామాణికంగాను ఉంటుండినా అవి ఆయన విధానాన్ని మార్చలేక పోయాయి. ఆయనను అన్యాయానికి ఒక సాధనంగా చేయలేకపోయాయి. అందువల్ల వారంతా పంజెకు ఎదురుతిరిగారు. వాళ్ళ ప్రోత్సాహంవల్ల ఆయన మీద ఆరోపణలు చేయబడ్డాయి, విచారణలు జరపబడ్డాయి. కాని అధికారులు ఆయనలో తప్పేమీ లేదనే విషయాన్ని తెలుసుకున్నారు. అయినా స్వార్థపరులైన పలుకుబడిగల ప్రతిపక్షంవారిని తృప్తిపరచవలసి వచ్చింది వారికి. అందువల్ల ఉన్నత ప్రాథమిక విద్యాశాఖకు చెందిన శిక్షణ పాఠశాలకు ముఖ్యోపాధ్యాయునిగా పంజెను బదిలీ చేశారు. ప్రాథమిక

పాఠశాలలకు చెందిన ఆ జిల్లాలలోని అధ్యాపకులందరూ విద్యార్థులుగా వస్తూండడం వల్ల పంజెకు పరోక్షంగా ఇదొక మంచి అవకాశమయింది. ఇది చిన్న పిల్లలకు బోధనగరపే అనేకులకు దూరదృష్టి నివ్వడానికీ, ప్రయోగానికీ, సంస్కరణకు తోడ్పడింది. ఆయన సహచరులు స్నేహ భావంతోను, సహకరించే దృష్టితోను మెలిగారు. అందరికీ ఆయన మీద మంచి గురి ఏర్పడింది. వారిలో ముఖ్యుడు ఉళ్ళాల మంగేశరావు. వాళ్ళ సహకారం వల్ల, కార్యదీక్ష వల్ల శిక్షణ పాఠశాలలోని శిక్షణా పద్ధతి పూర్తిగా మార్చివేయబడింది. ఆ సంస్థలోని ప్రత్యేకత ఏమంటే జాతి అనీ, కులమనీ భేదభావం వుండేదికాదు.

మొదటినుంచీ పంజె ప్రాథమిక పాఠశాలల బీద ఉపాధ్యాయులను మనుష్యులలాగా చూచేవాడుగాని, సేవకులలాగా కాదు. వాళ్ళ నెప్పుడూ ఏకవచనంతో సంబోధించడంగాని, ఒక అధికారి సేవకులపై చేసే అజమాయిషీ గాని పంజె చేసేవాడుకాదు. తమ పిల్లలకు కూడా ఇంట్లో ఇదే నేర్పించాడాయన. నిజానికి ఆయన వాళ్ళకు పిల్లలతో ఎలా మాట్లాడాలి, వాళ్ళ విధులను గూర్చి, చేయవలసిన పనులను గూర్చి ఎలా నచ్చచెప్పాలన్నదీ చెప్పేవాడు. జిల్లా స్థాయిలో పంజె ప్రవేశపెట్టాలనుకున్న విధంగానే పాటలు, నృత్యం, కథలతో విద్యాబోధన సాగింది. కాసరగోడులోను, మంగళూరు లోను ఆయన కార్యవిధానానికి ఆయన స్వంత బిడ్డలే సాక్షులు. ఆయన పిల్లలకోసం ఎక్కువ కాలం వెచ్చించడానికి వీలయ్యేదికాదు. అయితే పిల్లలు ఆయన రాకకోసం ఎదురు చూస్తుండేవారు. క్రీడలలో విజయం సాధించడమో, పాఠశాల విద్యార్థుల కోసం బహుమతులు ఏర్పరచడమో మాత్రమే చేయక, ఈ శిక్షణ పాఠశాల ఏర్పాటుచేసిన సమావేశాలు సంతోషానికి ఆటపట్టులుగా వుండేవి. తిరస్కారానికి, పీడనకు గురియైన - ఈనాడు హరిజనులనబడేవారిని - ఉన్నత కులాలవారి పిల్లలతో సమానంగా చూచే వాడు. ఒక ఉత్సవ సందర్భంలో ఆ కులానికి చెందిన ఒక విద్యార్థిచేత ఆయన ''హొలెయన హాడు'' (హరిజన గీతం)లో పెత్తనం చెలాయిస్తున్న వారిని ఉద్దేశించి ప్రార్థన, కొంతవరకు బెదిరింపూకూడా వున్నవి. సార్వజనిక జీవితంలో అందరికీ సమానాధికారాలున్నవని, అందరూ సమానంగా శ్రమించినప్పుడే దేశ సంక్షేమాన్ని సాధించడం వీలవుతుందని, దేశ స్వాతంత్ర్యం లభ్యమవుతుందని ఈ గీతం చెప్తుంది.

## ప్రాతికూల్యం:

పంజెను ఎదిరించినవారు పెత్తందార్లు, మొండివాళ్ళు, క్షమాగుణం లేనివాళ్ళు - ఆయసను జిల్లానుంచి పంపివేసే వరకు వాళ్ళకు నిద్రపట్టలేదు.

అయితే మదరాసులోని విద్యాశాఖ ముఖ్యాధికారులు పంజె విధానాలు ఎంత ఆధునికమైనవి, సత్త్వయుతమైనవి, తెలివైనవి, దూరదృష్టితో కూడినవీ అన్నది ఎరిగినవారు. మైసూరికి, కొడగుకు, మంగళూరికి విద్యాశాఖాధికారిగా ఉండిన ఒకరు పంజె మీద విచారణ జరపడానికి (అంతకు ముందు వడగళ్ళ వానలాగా) వచ్చినా, త్వరలోనే వాళ్ళిద్దరూ మంచి స్నేహితులయ్యారు. దక్షిణ కన్నడ జిల్లాలో పంజె వంటి నిబ్బరంగల మనిషిని అణచడం సాధ్యమయ్యే పని కాదు. ఐ. ఎ. ఏట్సు పంజెను కొడగు జిల్లాకు బదిలీ చేశారు. కొంతకాలం ఎద్దుబళ్ళలోను, ఇతర విధాలుగాను ప్రయాణాల కష్టాలను అనుభవించి పర్యవేక్షణాధికారిగా పంజె అక్కడి పరిసరాలను పరిశీలించాడు. మళ్ళీ పంజెను మెర్కరాలోని కేంద్ర ఉన్నత పాఠశాలకు ముఖ్యోపాధ్యాయుడుగా బదిలీ చేశారు.

అక్కడ కొత్తదైన అవరోధాన్ని, ద్వేషాన్ని పంజె ఎదుర్కొనవలసి వచ్చింది. మాటకారులు, స్వార్థపరులు అయిన కొడగువారు కొందరు పంజె విద్యాశాఖ కార్యాలయాలలో ఎక్కువ మంది కొడగువాళ్ళను తీసుకోవడం లేదని ఆరోపించారు. కాని దీన్ని నిరూపించడానికి తగిన కారణం లేదు. పంజె వచ్చేంతవరకు కేంద్ర ఆంగ్ల పాఠశాలల ముఖ్యోపాధ్యాయులు బ్రిటిషువాళ్ళుగా ఉండేవారు. ధోవతి, కోటు, తలపాగా వున్న పక్క జిల్లాకు సంబంధించిన వారొకరు వచ్చేసరికి కొడగులోని పెద్ద మనుషులకు రుచించ లేదు. కొన్ని రోజులు ఉద్యోగ నిర్వహణ పంజెకు కష్టమయింది. అయితే త్వరలోనే ఆయన స్నేహితులను సంపాదించుకోగలిగాడు. అక్కడి సంఘ సంస్థలలో సభ్యుడయ్యాడు. గౌరవానికి ప్రేమకు పాత్రుడయ్యాడు. అయినా ఆయనకు సన్నిహితులైన మిత్రులు తక్కువగానే ఉండేవారు.

### కొడగులోని మెర్కరా (మడికేరి)లో పంజె:

పంజె భార్యను పిల్లలను ప్రధాన పట్టణాలలో ఒకటైన మెర్కరాకు తీసుకొని వచ్చాడు. పల్లె పల్లెకూ తిరగవలసిన పని తప్పింది. మంగళూరులోని నార్మల్ పాఠశాల ముఖ్యోపాధ్యాయుడుగా ఉన్నప్పుడు, మెర్కరాలోని కేంద్ర పాఠశాలకు ముఖ్యుడుగా వచ్చినప్పుడు ఆర్థికమైన ఇబ్బందులను పంజె అధిగమించాడు. ఆర్థిక జీవనం సాఫీగా నడవసాగింది. అయినా దక్షిణ కన్నడలోని మంగళూరుకు వెళ్ళాలని ఆయన గుండెల్లో గుబులు వుండేది.

ఆయన చిన్న పిల్లలను సంతోషపెట్టడం కోసం కాసరగోడులో ఉన్నప్పుడు అపూర్వమైన మనోహర గీతాన్నొకదాన్ని 'నాగరహావే' (నాగుబామా !) అనే పేరుతో రాశారు. మంగళూరులో ఆయన రచించిన కొన్ని గీతాలు భారత స్వాతంత్ర్యం కోసం మహదాకాంక్షను వ్యక్తం చేస్తాయి.

మొత్తంమీద ప్రజలను దేశసేవకు ప్రేరేపించే గీతాలను ఆయన రాశాడు (ఉదా: తూకడికెయను కళెదు — మత్తు వదిలించుకొని) ఆయన రాసిన మరికొన్ని గీతాలు గోఖలే, తిలక్ కీర్తిశేషులయిన సందర్భాన్ని గురించినవి (ఇప్పుడు దొరకవు). అనేక గుప్తనామాలతో ఆయన వ్యాసాలు, కవితలు, పాటలు రాసేవాడు. వాటిలో ఒకటి ఆయన పేరును తిరగదిప్పించిన "రా. మ. పం." అన్నది. మరొక పేరు "హరటెమల్ల" (వదరుబోతు), ఇంకొక పేరు "కవిశిష్య". తన మొదటి మూడుకవితాసంకలనాలలో ఆధునిక కన్నడాన్ని గూర్చిన పక్షపాతాన్ని ప్రదర్శించాడాయన. ఆయన వ్రాసిన గొప్ప గీతాలలో ఒకటైన 'హుత్తరిహాడు' అన్నది కొడగువారి జాతీయ పర్వాన్ని గురించి. కొడగు సౌందర్యం, కొడగు ప్రజలు, వారి జీవనవైభవం ఆయనకు ప్రేరణనిచ్చాయి. ఆయన ఎక్కడున్నా, ఏం చేస్తున్నా జానపదగేయాలను, ఐతిహ్యాలను సేకరించడంలో ఆసక్తి చూపించాడు. ఇవేకాక భాష, సంస్కృతి మొదలైన వాటికి సంబంధించిన విషయాలను కన్నడ భాషా సాహిత్యాల అభివృద్ధి నాశించి సేకరించాడు. తద్వారా కన్నడ జనజీవనం ప్రగతి సాధించాలని ఆయన ఆశించాడు. ఆయన చురుకైన, కల్పనా శక్తిగల మనస్సు సామాన్యజనులకు సంబంధించిన సరైన చిత్రాలను అవగాహన చేసుకునేది. వంటవాడు బాబుపై, సేవకుడు రామానాయక్ ఎప్పుడూ ఆయన్ను అంటిపెట్టుకొని వుండి, ఆయన పనులలో సహాయం చేసేవారు. వాళ్ళ జ్ఞాపకాలు, వాళ్ళమీద కృతజ్ఞతాభావం ఆయన చివరి దినాల వరకు ఉన్నాయి.

## పత్రికారంగంలోను, ప్రచురణ సంస్థలోను పంజె :

ఉన్నత పాఠశాల ప్రాధ్యాపకులుగా పదవీ విరమణ చేసేముందే అధికారుల అనుచితమైన ప్రవర్తనకు నిరసనగా పంజె నివృత్తుడయ్యాడు. మంగళూరుకు వెళ్ళి అక్కడ కద్రి అనే భాగంలో స్థిరపడ్డాడు. అది తర్వాత సాహిత్యవేత్తలకొక పుణ్యస్థలంగా మారింది. 1927లో కన్నడ సాహిత్య పరిషత్తు సమావేశం మంగళూరులో జరగగా పంజె, ఉళ్ళాల మంగేశరావు అండగా నిలిచారు. ఆ వేళకు బాసెల్ మిషన్ వారు తమ విద్యావిషయకమైన పనులు, ప్రచురణకార్యాలు చూచిపెట్టవలసిందని ఆయనను అడిగి ఆ విధంగా తామూ లాభంపొందారు, ఆయనకూ సహాయం చేశారు. కన్నడంలో ప్రాచీన గ్రంథాలను, కన్నడభాషా వ్యాకరణ మొకదాన్ని (సూత్రాలకు ఇంగ్లీషు వివరణతోబాటు - ఇలాంటిది అంతకు ముందుగాని మళ్ళీగాని రాలేదు) సంపాదకత్వం వహించి ప్రచురించ వలసిందిగా కోరారు. వారితో పరిచయం, ఐరోపా సంస్కృతితో సంబంధం, జర్మన్ యూరోపియన్ సంగీత పద్ధతుల

పరిజ్ఞానం, పాశ్చాత్య విద్యాసంస్థల్లో ఉపయోగించే బాలసాహిత్యాన్ని గురించిన పరిచయం - ఇవన్నీ పంజె ఆధునిక విజ్ఞాన సమృద్ధికి తోడ్పడ్డాయి. దృష్టిని విశాలంచేశాయి. 1902 ప్రాంతంలో ఆయన బావమరిది బెనగల్ రామరావు "సువాసిని" అనే పత్రికకు సంపాదకత్వం వహించేవాడు. అందులో ఇంచుమించుగా ముఖ్యరచయిత మంగేశరావుగారే. ఈ పత్రికకు ఆర్థికసహాయం నెల్లికై అనేవారి కుటుంబం నుంచి, వెంకటరావు అనే ఆయన నుంచి లభించేదంటారు. దక్షిణ కన్నడజిల్లాలోని యువ రచయితల కృషివల్ల బాలసాహిత్యాన్ని, జానపద కథలను ప్రచురించడానికి చోదియాల్ బైల్ అనేచోట బాల సాహిత్యమండలి అన్న సంస్థ ఏర్పడింది.

బాల సాహిత్యాభివృద్ధికి బాల సాహిత్యమండలి బాలా కృషి చేసింది. పరిషత్సమావేశానికి సంబంధించినసంపుటంలో పంజెపంచకజ్జాయమనే పేరుతో చారిత్రక, శాసనాత్మకమైన మంచి వ్యాసాన్ని వ్రాశాడు. ఈక్షేత్రంలోకూడా పంజెకు ప్రవేశం ఉందని దీనివల్ల మనకు తెలుస్తుంది. ఆ తర్వాత కెళది రాజులను గురించి, బిళిగి గురించి కూడా ఆయన రాశాడు. "హరటెమల్ల" పేరుతో ఆయన రచనా చిత్రాలు, పారడీలు, వ్యంగ్యరచనలు (అప్పటికి పూర్తిగా కొత్తవి), విమర్శలు (సమకాలీన జీవితంమీద, సామాజిక, సాంస్కృతిక విషయాలమీద) రచించాడు. బాలా కథానికలు కూడా రాశాడు. ఈ శతాబ్దం ఆదినుంచి కూడా ఈ రచనలు సాగుతుండేవి. ఇవన్నీ ఆయనను కథారచయితగా, జానపద విజ్ఞానిగా, భాషావేత్తగా, ఇతర సామాన్యజీవనాన్ని చిత్రించే రచయితగా, అన్నిటికంటె ముఖ్యంగా బాలసాహిత్యాభివృద్ధికి పాటు పడిన మహనీయుడుగా, జానపదకథలను ఉద్ధరించిన వానిగా నిలబెట్టాయి. కొన్ని కథలను ఆయన ఆంగ్లంలో కూడా రాశాడు. ఇదంతా శ్రీమంతమైన కల్పనా వైభవమని, రచనయని చెప్పడానికి ఎవ్వరూ వెనుకాడరు. ఆయన సాహిత్య సేవ గమనార్హమైంది.

బాలసాహిత్య మండలితో పంజెకున్న సంబంధం ఒకవైపు, పాఠశాల విద్యార్థుల అవసరాలను చూడడానికి, విద్యాబోధన పద్ధతులను మెరుగు పరచడానికి, యువ రచయితలతో సంబంధాలను పెంచుకోడానికి ఆయన చేసిన కృషి మరొక వైపు - ఇవి రెండూ కూడా ఆయన విశాల దృష్టి కారణంగా పాశ్చాత్య సంస్కృతితోవున్న పరిచయంవల్ల లాభం పొందాయి. జర్మన్ మిషనరీలతో కలిగిన సంబంధం వల్ల పంజె తన సాంఘిక, ధార్మిక సంబంధమైన విలువలను విశాలం చేసుకోగలిగాడు. ఆ సమయంలోనే వంగదేశంలోను, ఇతర ప్రదేశాలలోను ప్రారంభమైన జాతీయోద్యమం ఆయన దేశభక్తికి పదును పెట్టింది. ఆయనకు పనిలో ఇంకా అభిలాషను, జీవశక్తిని పెంపొందించింది. ఈనాటికి కూడా ఇంకా

మనం సంస్కరించుకోలేని వాటిని కూడా పంజె అనాడే పసికట్టారు. ఉపనయనానికి, పెళ్ళికి, ప్రార్ధనకు, పూజకు సంబంధించిన ఆచారాలను, విధులను సరళం చెయ్యాలని చూచాడాయన. ఆయన ఆదర్శం సారళ్యాన్ని, ఉన్నతమైన ఆలోచనను కలపాలని, మానవజీవన సరణిలో పరిశుద్ధ భావాన్ని తీసుకొని రావాలని పాశ్చాత్య, సంగీత మర్మాలను, సాహిత్యాన్ని ఆయన పరిశీలించాడు. తద్వారా తన రచనలలో ఒక మాధుర్యాన్ని తీసుకొని రావడానికి ప్రయత్నించాడు. పంజెకున్న లయ జ్ఞానంవల్ల ఆయన ఏం చేసినా, మాట్లాడినా, రాసినా అందరి మన్ననకు పాత్రమయ్యేది. సాహిత్య పరిషత్తు సమ్మేళనానికి అధ్యక్షుడైన తర్వాత కర్నాటకంలోని ఇతర ప్రాంతాలతో ఆయన సంబంధం పెట్టుకోక తప్పిందికాదు. మద్రాసు, మైసూరు విశ్వవిద్యాలయాలలోని పాఠ్యప్రణాళికా సమితులలో ఆయన సభ్యుడయ్యాడు. ఆయన ఉన్న ప్రాంతంలోనే ఎం. ఎన్. కామత్, గోవిందపై, హట్టియంగాడి నారాయణరావు, అమ్మెంబళ మొ॥ వారు చేసిన సేవ, ఆధునిక కన్నడంలో వారి కొత్త ప్రయోగాలు, ఆధునిక 'దేశి' కి వారి సేవ గమనించదగ్గవి. పంజెతో స్నేహమే కాక ఆయనపై ఒక విధమైన భక్తిభావం కలిగి వుండిన బి ఎం. శ్రీకంఠయ్య, మాస్తి వెంకటేశ అయ్యంగార్, డి. వి. గుండప్ప మొదలైన కన్నడ దిగ్గంతులంతా సెంట్రల్ కాలేజీ (బెంగుళూరు) కర్నాటక సంఘ వార్షికోత్సవానికి పంజె అధ్యక్షత వహించినప్పుడు (1928) ఒక్కచోట చేరారు. ఆ సందర్భం లోనే ముద్దణకవిని గూర్చిన ఒక స్మారక గ్రంథం ప్రచురింపబడింది. అదృష్టం అంతగా వరించని తమ సాహిత్య సోదరులైన నందళికెలాగానే ముద్దణను గురించి మాట్లాడడానికి చాలా సంతోషపడ్డాడు పంజె.

## కన్నడ సాహిత్య సమ్మేళనాధ్యక్షుడు :

అక్కడక్కడా వాళ్ళూ వీళ్ళూ చెప్పుకుంటూ వుండిన పంజె పేరు అందరికీ సుపరిచితమయింది. ఆయన వ్యక్తిత్వంలోని శక్తి సామర్థ్యాలు కన్నడిగులకందరికీ తెలిసి రావడం రాయచూరులో వాళ్ళంతా ఒకచోట కలిసిన సమయంలో (1934). 1929 నుంచి కూడా కన్నడ సాహిత్య పరిషత్తు వారి వార్షిక సమ్మేళనానికి అధ్యక్షత వహించవలసిందిగా ఆయన్ని కోరుతూ వచ్చారు. మంగళూరునుంచి బయటికి వెళ్ళాలంటే ఆయన ఇష్ట పడలేదు. అసలు ఆయన అలాంటి గౌరవాన్ని అంగీకరించడానికి అంతగా ఇచ్చగించలేదు. ఆయన చెప్తుండిన మరొక కారణమేమిటంటే అనా రోగ్యంతో బాధపడుతుండిన భార్య దగ్గర తను వుండాలన్నది. ఎవ్వరూ దీన్ని కాదనలేకపోయారు. కన్నడదేశం ఆయనకు ఇవ్వాలనుకున్న

గౌరవాన్ని ఎట్లయినా కట్టబెట్టాలని స్నేహితులు కొందరు పట్టుబట్టి మంగళూరుకు వెళ్ళి ఆయన్ను అర్థించారు. ఆయన అంగీకరించిన విషయాన్ని మంజేశ్వర్‌లోని గోవిందపై ఇంట్లో తెలియజేయడమైంది. పై గారు, పరిషత్ స్నేహితులందరూ చాలా సంతోషపడ్డారు. పరిషత్సమావేశం జరిగిన రాయచూరు, పాత హైదరాబాదు రాష్ట్రంలో ఒక జిల్లా ప్రధాన కేంద్రం. ఆయన చేసిన అధ్యక్షోపన్యాసం అందరినీ సంతోషపెట్టింది. ఆయనకుండే లోకజ్ఞానానికి అదొక తార్కాణ. దానిలో ఆయన ప్రాచీన, మధ్య యుగీన, ఆధునిక కవితా పద్ధతులూ కవుల సాధనలు మొదలైన వాటినిగూర్చి గొప్పగా వివరించాడు. భవిష్యత్తును గురించిన ఆయన ఆశయాలను అందంగా, శక్తివంతంగా వ్యక్తపర్చాడు. శబ్దశక్తికి, శబ్ద మాధుర్యానికి ఆయన ఎంత ప్రాధాన్యమిచ్చిందీ అందరూ తెలుసుకున్నారు. ధ్వన్యభివ్యక్తికి, లయలో హెచ్చుతగ్గులకు, సార్థకమైన ఉపయోగానికి ఆయన సముచిత స్థానాన్నిచ్చేవాడు. లక్ష్మీశుని సముద్ర వర్ణన గురించి రెండు మూడు వరుసల్ని ఆయన వినిపించాడు. అవి కవిత్వపరంగా నారణప్పకుగాని, రత్నాకరవర్ణికి గాని సాటిరాక పోవచ్చు. అర్థంలో, శబ్దంలో, పదబంధాలలో, ధ్వనిలో ఆయన చదివినవి వాటి కవే సాటి. మన సంప్రదాయంలోని గొప్పదనాన్ని ఆయన చాటాడు. ఆధునికులు ఇటువంటివన్నీ వదలి వేశారన్నది వేరుమాట.[1]

ధార్వాడలో, హైదరాబాదులో, ఇంకా కొన్ని ఇతర ప్రదేశాలలో రచయితల మీద, కొన్ని విషయాలమీద, సందర్భానుసారంగా ఆయన చేత ఉపన్యాసాలిప్పించారు. అన్నిచోట్ల ఆయన ఉపన్యాసాలకు మంచి ఆదరణ లభించేది. [2]రామరావుగారు, శ్రీమతి శాంతా రామేశ్వరరావుగారు చెప్పడాన్ని బట్టి చూస్తే పంజె తమ పిల్లలకు, ఇతరులకు విదేశీ భాషయైన ఇంగ్లీషులో కవిత, నాటకం మొదలైనవి పాఠం చెప్తే అది మరువరాని అనుభవంగా వుండేది. ఇతరుల్ని మాట్లాడవలసిందిగానూ, ఇతర భాషలలోని కొన్ని పాదాలను చెప్పవలసిందిగానూ ఆయన అడిగేవాడు. భాషతోను, రచనలతోను ఈ విధంగా ఆయన సత్త్వయుత సంబంధాన్ని కల్పించేవాడు.

---

[1] ప్రాస మొదలైన వాటిని ఆధునికులు వదలివేశారు. మాత్రా పద్ధతిలో రాయడం మాత్రం అట్లే నిలిచివుంది. లయాత్మక రచనలలో ఇది వుండాల్సిందే. హలంతాలుగా వుండే పదాలు అజంతాలవుతున్నాయి. అలంకారాల ప్రాధాన్యం, సంస్కృతశ్లేషలలో లాగా ద్వ్యర్థాలన్నీ పోవడం మంచిదే అయింది.

[2] 1931 లోనే ధార్వాడకు చెందిన శ్రీమతి కృష్ణాబాయి పణజికర్ అనే పంజె బంధువు ఒకామె ఒక్కనెలలోపల తను కన్నడంకోసం పడిచచ్చేట్లు ఆయన ఎలా చేసిందీ వివరించింది. ఆమె మాతృభాష కొంకణి, సంబంధం పెట్టుకున్నది మరాఠీతో.

చివరి దినాలు :

ఈ వేళకు ఆయన ముగ్గురు కుమారులు పైకి ఎక్కివచ్చారు. ఆయన పెద్దకూతురికి వివాహమయింది. ఆయన ఉపకారవేతనంతో స్వతంత్రంగా బ్రతకాలని నిశ్చయించడంవల్ల చాలా తృప్తి కలిగింది. ఆయన దాచివుంచుకొన్న కొంత ధనం కూడా ఇందుకు వుపకరించింది. ఆయన తన కొడుకులమీద కూడా ఆధారపడనందుకు గర్వపడ్డాడు. ఆయన తన కష్టమేదో తానే పడాలని ఆశించినట్లుగా నాతో ఒక మారన్నాడు. కొడుకులు వెదుక్కుంటూ ఆయన కోసం రావాలిగాని, మరో విధంగా జరగరాదని ఆయన అన్నాడు. ఆయన పెద్దకుమారుడు ఉద్యోగం చేస్తుండిన జంషెడ్‌పూర్‌లోని వాతావరణంగాని, యంత్రాలుగాని ఆయనకు నచ్చలేదు. చిన్నకొడుకు చక్కెరకు సంబంధించిన సాంకేతికాధికారిగా ఉండిన పాట్నా కూడా ఆయనకు విసుగు పుట్టించింది. తనవారికి దూరంగా, అర్థంకాని బాషా ప్రదేశంలో వుండడమంటే ఆయనకు విసుగు వేసింది. మంగళూరికి వెలుపల నివసించడానికి ఇష్టపడకపోయినా చివరికి హైదరాబాదులో రెండవ కొడుకువద్ద ఉండడానికి ఒప్పుకున్నాడాయన. ఎందుకంటే ఆ నగరం అటు కర్నాటకానికి తన పిల్లలుండే ప్రదేశాలకు మధ్యన వుంది. అక్కడ కూడా తన చుట్టూవున్న వారి జీవితాలకు మాధుర్యాన్ని చవిచూపించాడాయన. 25-10-1937 నాడు ఆయనకు అకాల మరణం ఆసన్నమయినప్పుడు అదృష్టవశాత్తు అందరు పిల్లలు, దగ్గర బంధువులు ఆయన దగ్గరే వున్నారు. తాను వ్యవహరించిన మనుష్యులపట్ల విషయాలపట్ల, ఎంతో తృప్తిని వ్యక్తం చేశాడాయన. ఆయన రెండో కొడుకయిన గోపాలరావు, "చిన్నకూతురు శాంతను గురించి ఏమైనా దిగులు పడుతున్నారా?" అని అడిగినప్పుడు ఆయన చిరునవ్వు నవ్వి అటువంటిదేమీ లేదన్నారు. "నేను చింత పడుతున్నట్లుగా కనిపిస్తున్నానా" అన్నట్లుగా వుండింది ఆయన వాలకం. ఆయన తనతో సంబంధం వుండిన అందరు స్నేహితుల్ని, సహాధ్యాయుల్ని బాగా గుర్తుపెట్టుకున్నాడు; అందులోనూ ముఖ్యంగా బాబుపై, రామానాయక్‌లను. శ్రీ మాస్తి వెంకటేశ అయ్యంగారి "హాళూరు" (పాడువూరు) లోని ఒక పద్యాన్ని చివరి దినాలలో మళ్ళీ మళ్ళీ చెప్పుకునేవాడు.

ఇందు ఈ ఊరిగె హగెగళిల్ల
తన్న దిన బంతెందు
కణ్ణుగళ ముచ్చి,
ఇన్నెనగె సాకెందు తణ్ణగాయ్తు.

(ఇంక ఈ వూరికి పగళ్లు లేవు. తన దినం సమీపించిందని కళ్ళుమూసుకొని,
ఇంక నాకు చాలని చల్లబడింది)
ఆయన కోరుకున్నట్లే చివర వుచ్చరించిన పదాలు 'కృష్ణ', 'కన్నడ' అన్నవి.

ఆయన చనిపోవడంతో కన్నడ దేశం కన్నడాన్ని గొప్పగా ప్రేమించే సారస్వత కొంకణీయుణ్ణి కోల్పోయింది. కన్నడ సారస్వతాన్ని తుళు భాషనుంచి, కొంకణి భాషనుంచి సంగ్రహించిన విషయాలతో సంపన్నం చేసిన ఒక విశాలహృదయాణ్ణి కోల్పోయింది. ఆయన అందరికీ స్నేహితుడు, అజాతశత్రువు. ప్రశాంతచిత్తంతో, సర్వకామవర్జితుడై ఆయన స్వర్గాన్నలంకరించాడు. అది 1937లో జరిగింది. ముప్ఫయ్యేడు ఏళ్ళ తర్వాత ఆయనమీది కృతజ్ఞతతో ఇప్పటి తరంవారు ఫిబ్రవరి 1974 లో 8 - 10 తేదీల మధ్య ఆయన శతజయంతిని జరుపుకున్నారు. ఆయన పుట్టిపెరిగిన బంట్వాల్‌లోని ఆయన గృహం వద్ద ఒక స్మారక ఫలకాన్ని ఆవిష్కరించారు. మంగళూరులో గొప్పగా ఉత్సవాలు జరిపారు. యువ, వృద్ధ రచయితలను ఆయన్ను గురించి, ఆయన రచనలను, జీవితాన్ని గురించి ఉపన్యసించ వలసిందిగా కోరారు. ఆయన ఇద్దరు కొడుకులు, పెద్ద అబ్బాయి కూతురు, పంజెగారు రచించిన గీతాలను ఆయన పాడుతుండిన రీతిగా పాడి వినిపించారు. అవి అద్భుతమైన గీతాలు. ఆ సందర్భంగా ఆయన రచనలను నాలుగు సంపుటాలలో ప్రచురించారు. ఒక ప్రత్యేక సంపుటాన్ని 'తెంకణగాళి' (దక్షిణపుగాలి) అనే పేరుతో బంట్వాల్‌లో ప్రచురించారు. కర్నాటంలోని ఇతర ప్రదేశాలలోనూ, ఆయన చివరి రోజుల్లో జీవించి హైదరాబాదులోనూ, కార్యక్రమాలు ఏర్పాటు చేశారు.

## III

ఇప్పుడు మనం పంజె రచనలను సంక్షిప్తంగా సమీక్షించవచ్చు.

చిన్నతనంలో ఆయన అనేక పత్రికలకు వేరువేరుపేర్లతో రచనలు పంపేవారని ఇంతకుముందే చెప్పాను. 'హరటెమల్ల' (వదరుబోతు) పేరుతో ప్రాస్తావికంగా ఆయన వ్రాసిన విమర్శాత్మక, వ్యంగ్యాత్మక, ఉపదేశాత్మక, ప్రశంసాత్మక రచనలు ఈనాడు వ్యర్థాలాపనలుగా కనిపించవచ్చు. కాని వాటిలో కొన్ని మొట్టమొదటి సారిగా రాజకీయ, సాంఘిక, స్థానిక విషయాలను సమకాలీన సంఘటనలను ఆధారంగా చేసుకొని చెప్పేవి. అయితే ప్రభుత్వోద్యోగికాబట్టి అంతకంటె నేరుగా ఆయన చెప్పటానికి వీలులేక పోయింది. అటువంటి రచన అప్పట్లో వినూత్నకూ విశేషమూ అయిన ప్రక్రియ. ఆయన రచనలను చదివినవారు వాటిని ఇష్టంగా ఆస్వాదించారు. రచయిత సొంత గొంతుక అందులో గుర్తించారు. 'సువాసిని' పత్రికకు

బెనెగల్ రామారావు మద్రాసునుంచి సంపాదకత్వం నెరపినా సంపాదకీయ రచనలలోను, ఇతర ముఖ్య రచనలలోను పంజె పాత్ర ముఖ్యంగా వుండేది. కవిగా ఆయన పెట్టుకున్న 'కవిశిష్య' అన్న పేరు కర్నాటక మంతా ప్రసిద్ధమయింది. బాసెల్ మిషన్‌వారి మతప్రచారానికి పంజె ఎక్కువ సహాయం చేయలేదు. కాని వాళ్ళు ఆయన సలహాలను కన్నడభాషకు సంబంధించినంతవరకు చాలా విషయాలలో తీసుకొన్నారు. మార్స్‌డెన్ అనే పేరుతో వచ్చిన అనేక గ్రంథమాలలు ఆయన కలం నుంచి వచ్చినవే. 'కవిశిష్య' పేరుతో వచ్చిన మూడు కవితా సంకలనాలు వారి సహాయంవల్ల ప్రచురింపబడ్డవే.

## విద్వత్పూర్ణ రచనలు :

వదరుబోతు పేరుతో వ్రాసిన సరసోక్తులను, వ్యంగ్యోక్తులను, లౌకిక విమర్శను తీసేస్తే, ఆయన శతజయంతి సందర్భంగా ప్రచురింపబడిన నాలుగవ సంపుటంలో అపూర్వమైన సాహిత్య విమర్శ, ప్రశంసా పూర్వక రచనలు ఉన్నాయి. అవేకాక శాసనాధారంతో ఆయన చేసిన చారిత్రక అధ్యయనాలు కూడా ఉన్నాయి. అవి: (1) మూడ బిదరెలోని కొత్త జనదిని గూర్చిన శాసనం (2) 15, 16 శతాబ్దాలకు చెందినవని ఆయన పేర్కొన్న బిళిగికి సంబంధించినవి. నాలుగు శాసనాలలో మొదటి దానిలో 85 పాదాలున్నాయి. కవి పేరు గాని, చెక్కిన వాని పేరు గాని లేవు. ఆయన తుళునాడుకు సంబంధించిన వాటిని తీసుకున్నారు. మూడబిదరెను మునుపు వేణుపురమని, సురపురమని, గేరుసొప్ప అని పిలిచేవారు. నాగరుల రాజధానిని సంగీతపురమని, భల్లాతకీపురమని పిలిచేవారు. మొదట కొందరు జైన మతాధిపతులుండేవారు. తర్వాత విజయనగర రాజుల ప్రతినిధులు వచ్చారు. ఆ తరువాత ఆ ప్రదేశాన్ని స్వతంత్ర రాజ్యంగా వ్యవహరించారు. కెళది రాజులు ప్రాబల్యం వహించిన కాలంలో అది శక్తిని, ప్రాభవాన్ని కోల్పోయింది. ఈ శాసనంలో వంశవృక్షం కూడా ఇవ్వబడింది. ఐదవశాసనం ఒకదానిలో సాళ్వదేవ రాయుని గురించి, బయ్యరసును గురించివుంది. అందులోనే 'కావ్యసార' రచయిత అయిన వాది విద్యానందుణ్ణి గురించివుంది. ఇతరులు కొందరు తర్వాతి కాలానికి చెందిందని చెప్పిన ఈ శాసనం 15 వ శతాబ్దిదన్నారు పంజె. 'భైర' అనే పేరు 'బయ్య' అనే పేరును సంస్కృతీకరించగా వచ్చిందని ఆయన భావించారు. చివరి భాగంలో తుళు సరదారుల అధికారం క్షీణించిన విధం తెలుపబడింది. ఈ సరదారులు చైత్యాలయాలను, దేవాలయాలను

కట్టించారు. ఏకశిలా విగ్రహాలను, గొమ్మటేశ్వరుని వంటి వానిని చేయించారు. అయితే వాళ్ళ రాజ్యాలకు స్వతంత్రం సంపాదించుకోలేక పోయారు. వాళ్ళ రాజ్యంలో మంచి శాసనాలను అమల్లు పరచి అభివృద్ధి పరచుకోలేక పోయారు. సరదారులు, ప్రజలు కూడా ఒక విధమైన సుఖమయ జీవనానికి అలవాటు పడ్డారు. ఒక ఉల్లేఖనం ప్రకారం రాచరికం అంటే "పట్ట మహిషులతోను, చుట్టూవుండే పెక్కు స్త్రీలతోను సంతోషంగా, సరదాగా జీవితాన్ని గడపడం." ఆ కాలపు కవులు ఇటువంటి వారిని ముఖస్తుతి చేస్తూ తమను తాము మరిచిపోయారు. ఇంతకు ముందు చెప్పిన శాసనంలోని కొన్ని పాదాలను ఇటువంటి వాళ్ళే రాసి వుండాలి. రత్నాకరవర్ణి రాసిన 'భరతేశ వైభవ' వంటి సాంగత్య [1] కావ్యాలు కొత్త శైలి రూపొందడానికి, ఆడంబరం మీది ప్రీతికి, విషయానురక్తికి తార్కాణగా వున్నాయి. సాళ్వ రాసిన అలంకార గ్రంథం 'రసరత్నాకరం', కోటేశ్వరుని 'జీవంధరషట్పది' కూడా ఆనాటి భావసలను తెలుపుతాయి. 1650లో కాక 200 సంవత్సరాలకు ముందే – అంటే 1450లో జీవించిన 'ధన్యకుమార చరితె' రచయిత ఆదియప్పను గూర్చి పంజె చెప్పాడు. ఈకవే బహుశా రెండవ శాసనకవి అని పంజె భావించాడు. భారతాన్ని రచించిన సాళ్వుడే ఐదవ శాసనకర్త అనే అనుమానం వ్యక్తం చేయబడింది. వీటన్నిటి వల్ల పంజె గ్రహించిందేమిటంటే ఆ కాలంలో జనులు సోమరిపోతులుగా, విషయానురక్తులుగా, ఆడంబరం చూపేవారుగా జీవించేవారన్నది. "ఈ కాలంలో రచింపబడిన అనేక గ్రంథాలలో విస్తృతంగా పోషింపబడిన శృంగారం సమకాలీన జీవనంలోని అశ్లీలతనే సూచిస్తున్నది. అయితే సాహిత్యంమీద ఇది చూపిన ప్రభావం వల్ల కూడా కొంత మేలే జరిగింది. ఎందుకంటె దీనివల్ల చంపూ మహాకావ్యాలకు సంబంధించిన ఉక్కుకవచాలు తొలగిపోయాయి. దీనివల్ల అందరికీ అర్థమయ్యే, అందరూ ఆస్వాదింపగల్గే నూత్నశైలి ఏర్పడింది. సాంగత్య ఛందస్సులో దాసకవులు మొదలైన వాళ్ల పాటలను పోలిన రచనలు వెలువడ్డాయి. రామాయణ, భారత, భాగవతాలకు సంబంధించిన యక్షగానాలు వెలువడ్డాయి. సంధ్యాకాల వైభవాన్ని సూచించే ఈ కాలం – గంగావళి, పయస్విని నదులకు మధ్యవుండే తుళు దేశంలో కొందరికి ప్రేరణను కలిగించకపోలేదు. భట్కల్‌కు చెందిన అప్పయ్య, గేరుసొప్పెకు చెందిన సంతయ్య, ములిక (బహుశా ఈనాటి

---

[1] మొదటి పాదంలో నాలుగు, రెండవ పాదంలో మూడు గణాలుండే ఏడు గణాల ద్విపద.

మూల్కి)కి చెందిన వెంకణ్ణకవి, జైన నేమణ్ణ, తరువాతి కాలానికి చెందిన పార్తిసుబ్బ, ఆ తరువాత నందళికె లక్ష్మీనారణప్ప వీళ్ళందరూ యక్ష గానాలు రచించారు. కన్నడ జిల్లాలలో వీళ్ళు తమ సాహిత్యసాధన వల్ల జీవితాన్ని పచ్చపచ్చగా వుండేట్లు చేశారు.''

ఈ వ్యాసం పంజె పండితుడే కాక కవి కూడా అనే విషయాన్ని స్పష్టం చేస్తుంది. అంతేకాక ఆయన ఐతిహాసికమైన దాఖలాల సహాయంతో, శాసనాధారాలతో ఏ విధంగా కవి వాక్పటిమను అనుసంధించిందీ తెలుస్తుంది. వీటి సహాయంతో ఆయన సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక విషయాలను గూర్చి రాశారు. ఆయన వ్యాసం చివర ఉదాహరించిన రెండు సాంగత్య పద్యాలు [1] 'భరతేశవైభవ'లోవి. ఎంతో మధురమైనవి. అవి పంజెగారి కవిత్వాశయానికి తగ్గట్లే ఉన్నాయి. భరతేశుని పేరోలగంలో వినిపిస్తుండిన సంగీత ప్రాశస్త్యాన్ని గురించి చెప్పేటప్పుడు, పంజె లయను గురించి, శబ్దమాధుర్యం యొక్క ప్రాధాన్యాన్ని గురించి విశదీకరించారు.

శాసనాలలోని బిళిగి ఈ నాటి ఉత్తర కన్నడ జిల్లాలోని సిద్దాపూరుకు దగ్గరగా వుంది. దీనిని ఒక అందమైన పేరాలో పరిచయం చేశారు పంజె: ''విజయనగర కర్నాటసామ్రాజ్యం ప్రస్తుతం రక్కసతంగడి యుద్ధంగా వ్యవహరింపబడుతున్న తాళి కోట (1568) యుద్ధంతో పతనమయిందనే విషయం ప్రసిద్ధం'' - అంటూ పరిచయం చేసి, ''కర్నాటకంలోని కోస్తా ప్రాంతంలో చిన్న పెద్ద సరదారులంతా ధీమాగా తలపైకెత్తారు. కొన్నిరోజులు శక్తివంతంగా ఉన్నారు - అ తర్వాత తమలో తాము కలహించుకోసాగారు. తర్వాత కెళది పాలకులకు విధేయులయ్యారు. చివరికి అందరినీ మైసూరుకు చెందిన హైదర్‌అలి లొంగదీసుకున్నాడు. ఈ రాజ్యాలకు రాజధానులు బరకూరు, బస్రూరు, కెరవసె, నందావర పుత్తిగె, ఇవి దక్షిణ కన్నడ జిల్లాలో ఉన్నాయి. బనవసె, స్వాదె, గేరుసొప్పె, హాదవల్లి, బిళిగి ఉత్తర కన్నడజిల్లాలో ఉన్నాయి. ఒకప్పుడు రాజులకు ముఖ్య పట్టణాలుగా వుండి కన్నడ సాహిత్యానికి ఆశ్రయమిచ్చిన ఈ సాంస్కృతిక కేంద్రాలు ప్రాచీనకాలపు లక్షణాలను ఇంకా కలిగి వున్నాయి''.

---

[1] అళెవంతె రాగవ, తుళివంతె జాడ్యవ / హిళివంతె మోహన రసవ తొళెవంతె మనవ సంజీవన దమృతవను / తళివంతె రాగదొరిదరు హబ్బిసువంతె రాగవ స్వర్గలోకకె / ఎబ్బిసువంతె రోమగళ కబ్బినబిల్లు జేవొడెదంతె పాడిద / రొబ్బొబ్బ రింపినింపి నొళు.

హనుమాన్ దేవస్థానంలోని నాలుగు శాసనాలకు తోడు, బిళిగి శాసనానికి సంబంధించిన విషయాలు 1463 సంవత్సరానికి చెందిన ఒక గ్రంథం నుంచి సేకరించబడ్డాయి. దీనిలో తిప్పరసయ్య అనే అతన్ని గురించి వుంది. రెండవది, మూడవది బిళిగిలోని బస్తికి ఎడమవైపు రాతిమీద ఉన్నాయి. వీటిలో ఉల్లేఖింపబడిన కొన్ని పద్యాలు అత్యంత సుందరమైనవి. బిళిగి రాజులకు సంబంధించిన వంశవృక్షం కూడా ఇవ్వబడింది. ఒక శాసనం భట్టాకలంకుని 'శబ్దాను శాసన' మనే ప్రసిద్ధ వ్యాకరణానికి మున్నుడిలాగా వుంది. కవికి ఆశ్రయమిచ్చిన బిళిగికి చెందిన రంగప్ప ఒడెయ (కొందరు విద్వాంసులు భావించినట్లు విజయనగరానికి చెందిన శ్రీరంగ కాడు)ను గురించి కూడా ఇందులో వుంది. భట్టాకలంకుని కాలంలో బ్రాహ్మణులు జైనమతానికి పరివర్తన చెందారని చెప్పబడింది.

* * *

ఊహాత్మకమైన ఇద్దరు మిత్రుల సంభాషణలో చిన్న కన్నడ నిఘంటు వొకటి ఎంత అవసరమో చెప్పబడింది. ఈ శతాబ్ది ప్రారంభపు రోజుల్లోనే రాసిన ఈ సంభాషణలో మూడవవాడు మన రచయితే – వక్త, అనుసంధాన కర్త. చిన్నపుస్తకాన్ని (hand book) ఆ కాలంలో 'కైపిడి' అనేవారు. ఆయన రాసిన మరొకటి వస్తువులో, రచనారీతిలో ఆకాంక్షలో బాలసాహిత్యాన్ని గూర్చినది. ఆయన ఆధునిక కన్నడ సాహిత్యంలో కోరుకున్నది 'హొసదారి' (కొత్తదారి) అనే రచనలో చెప్పబడింది. రాయచూరులో ఆయన చేసిన ఉపన్యాసం ఆయన వ్యక్తిత్వాన్ని, ఊహాశక్తిని, సామర్థ్యాన్ని తెలుపుతుంది. వీటిలో ఆయన అక్కడ సమావేశమైన సాహిత్యవేత్తలనే కాక, తెలుగు సాహిత్యంవల్ల ప్రభావితులైన వారిని, ఉర్దూవల్ల ప్రభావితులైనవారిని (రాయచూరు అప్పుడు నైజాం రాజ్యంలో బాగంగా ఉండేది) ఆకట్టుకున్నారు.

* * *

ప్రారంభదినాల్లో పంజె రాసిన వ్యాసాలు స్వచ్ఛందమైన విశాలమైన మనస్తత్వంతో రచించినవి. వాటిలో చమత్కారాలు, ఎత్తిపొడుపులు ఉన్నాయి. పరిశుద్ధ జీవనం సాగించడానికి, ఆలోచన చెయ్యడానికి, సంస్థల నిర్వహణకు అడ్డుతగిలే లోపాలను తొలగించవలసిన ఆవశ్యకతను గురించి ఆయన రచనలు చెప్తాయి. మౌఖిక రూపంలోను, నృత్యరూపంలోను ఉండే యక్షగానాలను గురించి ఆయన రాసిన వ్యాసాలు చక్కని విషయ సమృద్ధిని కలిగిఉన్నాయి. నారణప్ప 'కన్నడ భారతం', లక్ష్మీశుని 'జైమిని

భారతం' సర్వజ్ఞుని 'ఓనామ' పద్ధతి అనే పేరుతో ఉన్న వయోజన విద్యకు సంబంధించిన విషయాలు, రత్నాకరవర్ణి రచన - వీటిని గురించి పంజె రాసిన ప్రశంసా పూర్వక రచనలు పంజె సామర్ధ్యాన్ని తెలియజేస్తాయి. జైమిని భారతానికి బి. ఎం. శ్రీకంఠయ్యగారితో కలిసి, నారణప్ప భారతానికి డి. ఎన్. నరసింహాచార్‌తో కలిసి ఆయన సంపాదకత్వం వహించాడు. అయితే అవి పూర్తి అయ్యే లోపలనే చనిపోయారు. ఆ పని కోసం ఆయన అప్పుడప్పుడు మైసూరికి వస్తూ ఉండేవారు.

ఈ సందర్భంలో మూడు విషయాలు ముఖ్యమైనవి. కుమారవ్యాస భారతం భామిని షట్పదిలో రచింపబడిన గ్రంథాలలో అత్యుత్తమమైనది. కృష్ణునిమీద వుండే భక్తితో, కవితాపరమైన కల్పనావైభవంతో కవి దీనికి 'కృష్ణరాయన చరిత్రె' అని నామకరణం చేశాడు. మనీషి అయిన కృష్ణుని చరిత్ర ఇది. మధ్య యుగీన సాహిత్యంలో దీనికి సాటి మరొకటి లేదు. పంజె రాసిన వాటిలో మరొకటి నందళికె లక్ష్మీనారణప్పను గూర్చి. దీనిలో అతని జీవితం, వ్యక్తిత్వం సాధనలను గురించి చెప్పబడింది. ఇతనొక విశిష్ట రచయిత. గద్య పద్య సాహిత్యాలకు వేరువేరు పేర్లతో ఆయన చేసిన సేవ గమనార్హమైనది. ముద్దణ పేరుతో అతను రాసిన 'రామాశ్వమేధ' వాటిలో ఒకటి, కుమార విజయము వంటి యక్షగానం ఏ విధంగా కన్నడ వినీలాకాశంలో ప్రకాశవంతమైన ఒక తారను సూచిస్తున్నదో తెలుపుతూ పంజె, నందళికె ఎట్లా గుప్తనామాలతో యక్షగాన, షట్పది, గద్య రచనలను చేసిందీ వివరించారు. ఈ సందర్భంలోనే 'రామాశ్వమేధం' నందళికెదేననే విషయం స్పష్టం చేశారు పంజె. ఆయన వ్యాసం గొప్ప స్నేహ పూర్వకమైన అభినందన మాత్రమే కాక గౌరవ సూచకము. అంతే కాకుండా సాహిత్యపు విలువగల గద్య రచన. అది కొంతవరకు రచయిత వ్యక్తి జీవితాన్ని గూర్చి, కొంతవరకు ఆయన సాహిత్య సృష్టిని గురించి అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నది. సర్వజ్ఞుని "ఓనామపద్ధతి" ని గురించిన వ్యాసం సినలైన బంగారంలాంటి రచన. సర్వజ్ఞుని త్రిపదులు లేక వచనాలు పిన్నలకు, పెద్దలకు ఏ విధంగా విద్యా ప్రబోధకాలో వివరిస్తుంది. ప్రాచీన రచనను దాని ధోరణిని గురించి కొత్త దృక్పథంతో చేసిన వివరణ ఇది. ఒక పాఠశాలాధ్యాపకుడు, కవీ యిద్దరి దృష్టి మేళవించి ఇందులో కనిపిస్తుంది.

* * *

తరువాతి గుంపులో మొత్తం ఐదుభాగాలలోని 2 భాగాలున్నాయి. మొదటిది "పదార్దవేను ?" (పదార్థమంటే ఏమిటి) ఒక సరదా రచన. 'పదార్ధ' ( - వంటకం, వస్తువు, భావం, ఒకపేరు) దక్షిణ కన్నడ జిల్లాలో

వంటవాళ్ళు తయారుచేసే ఒక వంటకమిది. పేర్లు ఏమైనా కావచ్చుగాని చాలా రుచికరమైనదిది. దీనికే వాడుకలో వున్న మరొక పేరు 'మేలోగర' అన్నదాన్ని ఆయన వివరించాడు. ఈ వివరణ 'ఓగర' అన్నపదం అర్థాన్ని వివరించడమేకాక, పాకకళను గురించి తెలుపుతుంది 'పదార్థా' నికి మరొక అర్థం 'మేలోగర' ను తెలిపేది కాదు. ఎందుకంటే 'ఓగర' అంటే అన్నమని అర్థం. పదార్థమంటే అన్నానికి రుచిని, సువాసనను ఇచ్చే వస్తువు (సాదకం లేక ఆదరువు). మూడవది "బీళ్కొడు" (వీడ్కోలు) అన్నదానికి అర్థవివరణ. విదూషక మనస్తత్వంకలవాడు 'అక్టోబర్' అన్నదాన్ని సామ్యతవల్ల 'అక్టంబర్' అంటూ అనునాసికంగా కలిపి ఉచ్చరించడం. ఎందుకంటే ఇది సెప్టెంబరు, నవెంబర్, డిసెంబర్ మొదలైన వాటితో సరిపోతుంది. 'ఎంబర్' 'అంబర్' అవుతుంది - అంతే. ఇటువంటివే కొన్ని తుళు, కొంకణి పదాలను అనునాసికం చేసి పంజె ఉదాహరించారు. ఒక యూరోపియన్ అధికారి తన సహాయకుడిని తమాషా చేయబోయి హాస్యాస్పదుడు కావడం వర్ణించే చిన్న వ్యంగ్యరచన ఒకటి వుంది. ఐదవది కొంత దీర్ఘంగావుంది. కొన్ని పదాలకు, పదబంధాలకు బదులుగా ఇతర శబ్దాలు వాడడం కద్దు. పొగాకుని గురించి ఆయన రాసింది చాలా ఉత్తమరచన. ఒకచోట ఇది మోటు హాస్యంగా తయారైంది. కుమార వ్యాసభారతం నుంచి (ద్రౌపది స్వయంవరానికి అలంకృతకావడాన్ని వర్ణించే ఘట్టంనుంచి) ఒక పద్యం గ్రహించి అందులో మూడు పదాలను మార్చి, దాన్ని అక్బరు సభలో స్త్రీ - పురుషులు పొందిన పొగాకు పొగల తెరల తాలూకు అనుభవాన్ని వర్ణించేందుకు ఉపయోగించడం కొంత అనౌచిత్యంగా కనిపిస్తుంది. కాని దీన్ని చదివి ఆనందించవలసిందే. అక్బరు సభలో కొందరు పొగాకు వాడకాన్ని నిషేధించాలని కోరారట. అప్పుడు విదూషకుడైన బీర్బల్ అన్నాడట "దానికి ఒకటే శిక్ష - పొగాకు ఎప్పుడు కళ్లబడినా దాని తలవైపు అగ్గిముట్టించి అది కాలి, పొగకావడాన్ని మనం చూడాలి, పాదుషా" బీర్బల్ చెప్పిన ఈ తీర్పు విని అక్బరు చాలా సంతోషించాడు. దీనివల్లనే పంజె చెప్పిన 'ధూమ్రమపత్రపు తత్వమసి' ఏర్పడింది.

పాత కన్నడం, కొత్త కన్నడం, తుళు, కొంకణి, మరాఠీలలో అనునాసికాలను గురించి పంజె రాశాడు. ఐదవ విభాగంలో కన్నడ భాషలోని అక్షరాలలక్షణాన్ని[1] గురించి, ప్రాచీనసంప్రదాయానికి చెందిన ఉపాధ్యాయులు ("ఐగళు") నేర్పిస్తుండిన కన్నడ వర్ణమాలను గురించి చెప్పాడు. సంస్కృత వర్ణమాలకు హ్రస్వ 'ఎ', 'ఒ' చేరిస్తే మొత్తం 52 అక్షరాలవుతాయి. పీటికి పాణినిలో లేకున్నా 'ళ' చేర్చబడింది. 'క్ష' అయిన తర్వాత 'రైతి'

[1] అయ్య < అజ్జ < ఆర్య.

(ర + ఇతి) అన్నది కూడా పిల్లలకు నేర్పించేవారని పంజె అన్నారు. పాతకాలపు ఉపాధ్యాయులైతే సంస్కృతం తెలిసినవారు. వారి ప్రభావం క్షీణించిన తర్వాత 'రైతి' అన్నది 'అక్షర + ఇతి' అన్నదాన్ని సూచిస్తుందన్న విషయాన్ని ఉపాధ్యాయులు బహుశః చెప్పేవారు కాదు. పంజె ఈ సందర్భంలో ఆసక్తికరమైన వ్యాఖ్యానం చేశాడు. "పెళ్ళి అయిన తర్వాత కూడా అల్లుడికి సంబంధించిన స్నేహితులు వగైరా మామగారి ఇల్లు వదలనట్లు, తల్లిమేక పొదుగును మేకపిల్ల అందుకోలేక పోయినప్పుడు గడ్డం కింద పొదుగులు వేలాడినట్లు వర్ణమాలను నేర్పించేటప్పుడు 'రైతి' చెప్పడం సాగుతూనే వుంది."[1]

* * *

తరువాతిది స్థలనామాలను గురించిన పరిశీలన. తుళునుంచి ఆయన చాలా విషయాలను సేకరించాడు పదాలకు అర్థవివరణ చేశాడు. పద పుంజాలు రూపొందిన రీతిని ఆసక్తికరంగా వివరించాడు. ఆయనకు తుళు తెలిసి వుండకపోతే ఇందులో సగం కూడా సవ్యంగా చేయగలిగేవాడు కాడు. అయితే కేవలం పదాలను సాధించడం మాత్రమే మన ఆశయమైనట్లయితే ఎట్లయినా చేయవచ్చు. డా. ఎల్. డి. బార్నెట్ చెప్పినట్లు (సంస్కృత నాటకరచనలో భాసుని స్థానం గూర్చిన సమీక్ష) టిబెట్ అనే పదాన్ని 'టాప్ హ్యాట్' నుంచి, ఎవరెస్ట్‌ను 'ఎవర్' అనే పదానికి 'తమ'(ఎస్ట్) ప్రత్యయం (superlative degree) చేర్చి సాధించవచ్చు. పంజెగారి ఈ సాధనలో వస్తువులను గురించి పేర్లు, స్థలాలు, స్థలీయ ఇతిహాసం, ఐతిహ్యాలు, పూజావిధానాలు ఇటువంటి వన్నీ చేరుతాయి. పంజెగారి ఈ కృషి కన్నడంలో పరిచయం లేనిది. తీక్ష్ణబుద్ధి, చురుకుదనం, ధీశక్తి వుంటే పరిశీలన సక్రమంగా సాగుతుంది. తుళు, కొంకణి భాషలలో వుండే సమానపదాలు, సంబంధం వుండే రూపాలు, సమానపదాలలోని భాగాలు మొదలైనవి ఆధారవిషయాలుగా తీసుకోబడ్డాయి. అలాగే తరువాతి రచన ఒకదానిలో 'సాళువ' అనే పదాన్ని మహాభారతంలోని "సాల్వ" "అనుసాల్వ" ల నుంచి సాధించడాన్ని ఆయన వ్యతిరేకించాడు. ద్రావిడ భాషలలో 'స' - 'త' గా 'చ' గా మారే విషయాన్ని ఆయన గ్రహించాడు. స్థలనామాలకు సంబంధించిన కొన్ని కథలను గురించి ఆయన చెప్పాడు. బ్రాహ్మణులు, కూర్గీలు, తుళు జాతులవారు - అందరూ లెక్కలోకి వచ్చారు. ఆయన నిర్ణయాలనన్నిటినీ మనం ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా, అనేక సమస్యలను గురించి కొత్త విషయాలు తెలిశాయన్నది నిజం. ఉదా:

[1] బహుశా "అక్షర + ఇతి" అన్నది సరైన వివరణ కాదు. కన్నడంలో తమిళంలో లాగే అదనంగా రెండు అక్షరాలున్నాయి: "ఱ" - "ೞ" - ఇవి రెండు 'ర' ల్లాగ, రెండు 'ళ' ల్లాగ ఉచ్చరింపబడుతాయి.

సమాసాలలోని రెండు భాగాలలో వుండే ప్రత్యయాలు, పూర్వప్రత్యయాలు మొదలైనవి.

కొన్ని పదాలు జంతు జీవనానికి, వన్యమృగాలకు, భూగోళానికి సంబంధించినవి. వీటిలో కొన్ని ఆయనకు జంతుశాస్త్రంతోను, మానవ శాస్త్రంతోను వుండే పరిచయాన్ని తెలుపుతున్నవి. ఈ రచనలో పూర్తిగా ఆయన హాస్య ప్రవృత్తి, వివేకం వ్యక్తమవుతాయి. పంజె వ్యక్తిత్వంలో, సాధనలో సహజంగా వుండేవే ఇవి. సృజనాత్మకమైన కుతూహలం, గాంభీర్యం వున్నా ఆయన ఆడుతూ పాడుతూ ఇవి రచించాడు.

మైసూరు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంవారు ప్రచురించిన 'కెళది నృప విజయ'ను చాలా స్పష్టమైన రీతిలో ఆయన సమీక్షించాడు. ఈ రచన విషయంలో కూడా ఆయన తమ వాకచక్యం చూపించాడు. ఈ గ్రంథాన్ని కావ్యం అనడంకంటె చరిత్ర అనడం సబబని ఆయన అన్నాడు. అయినా కవిత్వమూ కొంత లేక పోలేదని రాశాడాయన. బిదరె వెంకటప్ప నాయకుని దండయాత్రలు, విజయాలను గురించినదీ కావ్యం. ఆయన, బి. ఎం. శ్రీకంఠయ్యగారు మైసూరులోను, మద్రాసులోను వుండిన అముద్రిత వ్రాతప్రతులను పరిశీలించి, వాటి సాహిత్యపు విలువను గుర్తించి ముద్రణకు యోగ్యములైన వాటిని సిఫారసు చేశాడంటారు. ఇప్పుడిది వింతనిపించవచ్చు. కాని వాళ్ళు చేసిన వ్యాఖ్యానం, వర్ణనాత్మక, విమర్శాత్మక రచన సేకరించి ప్రచురిస్తే అసక్తికరంగా వుంటుంది. ఈసమీక్ష లింగణ్ణమంత్రి రాసిన రాజవంశీయుల చరిత్రను గూర్చినది. ఈ రాజవంశం ఏ విధంగా రూపొందిందీ, అభివృద్ధి చెందిందీ, హైదరాలీ (మైసూరు) కాలంలో ఏవిధంగా పతనమయింది తెలుపుతుంది ఈ కావ్యం. కావ్యాన్ని విమర్శ చేయడంలో పంజె అవలంబించే పద్ధతికి ఈ సమీక్ష మంచి వుదాహరణ.

## 2

పంజెగారి తరువాతి రచనా సముదాయంలో 14 గద్యరచనలు, కథలు వున్నాయి. ఇవి ఎక్కువ సాహిత్యపరమైనవి. మొదటిది, పద్నాలుగవది బహుశః ప్రధానమైనవి, నిజమైన సాహిత్యసేవకు వుదాహరణలుగా చెప్పవచ్చు. భారత పురాణ శ్రవణాన్ని గురించిన మూర్ఖత్వంతో కూడిన, స్వాతిశయాన్ని గురించి ఆయన రాశాడు. భారతాన్ని చదివేటప్పుడు, 'హరి' అనే పదాన్ని వుచ్చరిస్తే కార్యక్రమాన్ని ఏర్పాటుచేసిన దాతలు కొందరు తక్కువ సహాయం చేసినవారిని ఎక్కువగా ప్రశంసించారన్న అపోహపొందడాన్ని ఆయన ఉదాహరించాడు. ఒక చిన్న హోటల్లో (కమలాపూరు) దాని యజమాని పూర్ణస్వామి అయ్యంగారు డబ్బు

చెల్లించని వారితో పడినపాట్లు, దానికి ఆయన కనిపెట్టిన వుపాయం ఏవిధంగా బెడిసి కొట్టిందీ ఆయన చిత్రించాడు. తరువాతి దాంట్లో 'వైద్యుని సాదకం' గురించి చెప్పబడింది. వల్లభాచార్యులనే అమల్దారు (తాలూకా అధికారి) ప్రతి పల్లెకూ తాను వెళ్ళినప్పుడు అందమైన వంటలక్కను ఏర్పాటు చెయ్యాలని ఆశించేవాడు. ఒకానొక పల్లెలో అటువంటి స్త్రీ ఎవ్వరూ దొరకలేదు. అమల్దారుకు వంట చేయడానికి ఆ వూరి మునిసిఫ్ ఒక వైద్యుణ్ణి ఏర్పాటు చేశాడు కసి కొద్దీ ఆ వైద్యుడు ఒక మందును ప్రయోగించాడు. దానివల్ల ఏర్పడిన వికారాన్ని ఆ వైద్యుడే పోగొట్టవలసి వచ్చింది. 'హమ్ నహిమ్ గద్దా' అనే రచన మోటు హాస్యానికి (horseplay) మచ్చుతునక. ఒక ఇంగ్లీషు అధికారి కొండమీద వుండే పెద్ద అధికారులకు తీసుకువెళ్ళినట్లే, తనకూ వుతికిన బట్టలు గాడిదమీద వేసి తీసుకుని రావాలని కోరాడు. చాకలివానితో హిందీలో మాట్లాడుదామని అతని వుబలాటం. కాని తనకు తానే ఒక గాడిదయ్యాడని ఎరుగడు. ఇది 'గుర్రం-హాస్యం' కాదు. గాడిద హాస్యం అనవచ్చు.

అరవదీ, తొమ్మిదవదీ వైయక్తిక సంబంధాలను గురించి చెప్తాయి. రెండో మూడో కథకుని మేనత్త మేనమామలను గురించీ, మేనమామ వీలునామా తెచ్చిన రకరకాల పరిస్థితులను గురించి. తొమ్మిదవది భార్యను గురించింది. భార్యను అదుపులో పెట్టడానికి, ఆమె రాత్రిళ్లు మెలకువగా ఉంటానని గొప్పలు చెప్పడాన్ని పరీక్షించడానికి భర్త ఒక తమాషా చేస్తాడు. దొంగలాగా తనే నటించి, పోలీసులకు పట్టుబడ్తాడు. భార్య మరునటి రోజు ప్రొద్దున్నే వెళ్ళి కటకటాల నుంచి విడిపించవలసి వస్తుంది.

పదవ దానినుంచి పదమూడవ దానివరకు సాహస కార్యాలను గురించి, కన్నడంలోని 'ఆర్యకీర్తి' (వంగభాషలో రజనీకాంతగుప్త రాసిన దానిని ఆధారం చేసుకుని వచ్చినది) తర్వాత చాలా సాహసులైన నలుగురు స్త్రీలను గురించి వీటిలో వుంది.

ప్రథుల (సంస్కృతం : పృథుల) విజయనగర కాలానికి చెందిన ఒక సన్నివేశాన్ని గూర్చినది. ఒక స్త్రీ తన ప్రియుణ్ణి రాజు అంతరంగికుడు మోసంతో చంపివేయగా, అతన్ని చంపి తానూ చనిపోయింది. ఆమె చివరి క్షణాల్లో, రాజు ఆమెకు సమీపంగా కూర్చోవాలని ప్రయత్నించగా, భరించరాని బాధలోను దూరంగా జరిగి ఆయన్ను శపించింది. ఆయన కూతురు ముసల్మానుల చేతుల్లో చిక్కుతుందన్నది. పతివ్రతా స్త్రీల భర్తలను నాశంచేసి, వాళ్ళను పొందాలనుకుంటున్న పురుగువంటి రాజు నామరూపాలు లేకుండా పోతాడన్నది.

'శైలిని' ఔరంగజేబు కాలంనాటి కథ. రాజసింహుని కూతురైన

శైలినిని చక్రవర్తి కుమారునికి ఇద్దామనుకున్నారు. అయితే ఆమె తిరస్కరించింది. నిజానికామె శివాజీని ప్రేమించింది. అతను ఖైదు చేయబడి అద్భుతంగా తప్పించుకున్నాడు. అసలు శివాజీ తప్పించుకోగా, మరొకర్ని శివాజీగా భ్రమించిందామె. రాజసింహుడు, ఆమె - ఇద్దరూ మరునటిరోజు ఒక బావిలో పడి చనిపోయారు. ఈ విషయాన్ని విన్న ఔరంగజేబు చాలా వ్యాకులం చెందాడు, ఆశాభంగం చెందాడు.

'దుర్గావతి' అన్నది కూడా ఒక రాజకుమారి కథ. ఆమె మొహబ్బా (ఆధునిక మధ్యప్రదేశ్) రాజయిన ఛందల్ కుమార్తె. రాజ్యాన్ని కాపాడడంలో ప్రాణాలను కోల్పోయిన ప్రజానాయకురాలి సాహసాన్ని, ఆత్మ విశ్వాసాన్ని తెల్పుతుందీ కథ.

దేవగిరికి సంబంధించింది 'వీరమతి' కథ. ఒక రాకుమారి, ఆమె ప్రేమికుడు ఇందులోని పాత్రలు. ప్రేమికుడు రాజుకు ద్రోహంచేసి, కోటను శత్రువుల వశం చేశాడని తెలుసుకున్న రాకుమారి ప్రియుణ్నే చంపి, తనూ ఆత్మహత్య చేసుకుంది. కృష్ణ అన్నది యువ ప్రేమికుని పేరు. ఈ పని ఆమె మీద ప్రేమతో చేసినట్లుగా అతను చెప్పాడు. అల్లావుద్దీన్ ఖిల్జీ కాలంలో కోటను వశం చేసుకోడానికి పంపబడిన మాలిక్‌కాఫర్‌ను గురించి చెప్పేదీ కథ.

సాహసం, ప్రేమ, అచంచలమైన ఆత్మత్యాగం వీటిని - గురించిన ఈ కథలో, ప్రతిదానిలోను మాతృభూమి కోసం, ఆత్మగౌరవం కోసం మృత్యువు నెదుర్కోవడం గమనించదగ్గది. అన్నింటా సేవాప్రవృత్తి ప్రధానం. సేవనే అత్యంత ప్రధానంగా ఎంచి, భూమికోసం, దాని సౌభాగ్యం కోసం, చివరిదాకా ఎడతెగని భక్తి శ్రద్ధలతో విశ్వాసంతో జీవించే సందర్భాలు దేశభక్తిగా గొప్పతనంలో ఏమాత్రం తీసిపోవు.*

ఇవన్నీ సాహసమయ ఇతి వృత్తాలు. వర్ణరంజితాలు. పోయిన శతాబ్ది చివరి భాగంలోను, ఈశతాబ్ది మొదటి రెండు దశాబ్దాలలోను జనం మెచ్చిన శైలిలో ఇవి రచించబడ్డాయి. వాటిలో జాతికి, నీతికి సంబంధించిన ఆత్మగౌరవం వుంది. పంజె తమ వూహాశక్తితో, సామర్థ్యంతో వాటిని చిత్రించగలిగారు. అవి మన రచయిత శైలీ వికాసాన్ని నిరూపిస్తున్నాయి. వర్ణనల్లో సహజత్వం, నిండుదనం వాస్తవికత వున్నాయి.

ఈ సందర్భంలోనే - బహుశా 'దేవి చౌధురాణి'ని గూర్చినదేమో - పంజె ప్రారంభించి ఒక అధ్యాయం రాసిన ఒక నవలను గురించి చెప్పవచ్చు. "చండికా రహస్యసమాజ" మనే పేరుతో 1901 లో ప్రారంభించిన ఈ రచనలో మార్మిక వృత్తాంతాలు, దారికొట్టే దొంగలు, క్రౌర్యం మొదలైన

* కృష్ణ కథకు హరివంశంలోని వికద్రు సన్నివేశ సందర్భంలో పోలిక చూడవచ్చు.

వన్నీ వున్నాయి. ఇది 'సువాసిని'లో ప్రచురించబడింది. విషయ స్పష్టతకు ప్రథమోదాహరణమైన పంజె కలంనుంచి రాత్రిపూట కళ్ళు కనబడకపోవడమనే విషయం గురించి ఒక రచన వెలువడింది. పడవలను గురించి, చేపల కోసం వలలు విసిరే పడవవాళ్ళను గురించిన వర్ణన ఇది: కొంత దూరం నుంచి చూస్తే నక్షత్రకాంతిలో పడవవాళ్ళు అప్పుడప్పుడు కనిపిస్తూ, అప్పుడప్పుడూ చీకట్లో కనుమరుగవుతున్నారు. అది కూడా పడవలమీద పడిన కాంతిని టెంకాయ మట్టల మధ్యనుంచి చూడగలగడం చేత సాధ్యమయింది. సర్వీచెట్లు పొందిగ్గా వూగుతున్నాయి. అన్నివైపులకు అవి ఒక విధమైన బుసబుస ధ్వనులను చేస్తూ గాలివాన వస్తుందనడాన్ని సూచిస్తున్నాయి."

* * *

ఇప్పుడు ఈ సంపుటంలోని రెండు ముఖ్యరచనల గురించి చెప్తాను:

అబద్ధపు దినచర్య:

మొదటిది "పాత సబ్ అసిస్టెంట్ పాఠశాల పర్యవేక్షణాధికారి అబద్ధపు దినచర్య" అనేది.

పంజె ఉద్యోగం ప్రారంభమయింది (1906 వరకు, 11 సంవత్సరాలు ఆయన పనిచేయడానికై) మంగళూరులోని ప్రభుత్వకళాశాలలో ఉపన్యాసకుడుగా ఆయన చేరినప్పుడు. ఆ తర్వాత ఆయన ఎలిమెంటరీ పాఠశాలలకు పర్యవేక్షణాధికారి అయ్యారు. దానితో ప్రాథమిక పాఠశాలో పాధ్యాయులతో ఆయన తిరగ వలసి వచ్చేది. వాళ్ళ పరిపాలనా వ్యవస్థలో అప్పుడప్పుడే మార్పు వచ్చింది. డెప్యూటి ఇన్‌స్పెక్టర్‌ను సబ్ - అసిస్టెంట్ ఇన్‌స్పెక్టరుగా చేశారు. ఇలాంటి అధికారులను పూలమాలలతో, కొమ్ములు, శంఖాలు వూదుతూ, ఢంకాలు బజాయిస్తూ, బహుమానాలిస్తూ ఆహ్వానించే సంప్రదాయాలు మరుగున పడ్డాయి. అధికారిని 'స్వామి' అని 'దేవుడా' అని పిలవడం తగ్గిపోయింది. అధ్యాపకులు 'అవును సార్' అనో 'కాదు సార్' అనో చెప్పడం ప్రారంభించారు. పల్లె ప్రజలు పోలీసు అధికారులలాగానో, రెవిన్యూ అధికారులలాగానో స్కూళ్ల అధికారులను గుర్తించేవారు కారు. అసలు బళ్ళు మొత్తంమీద పాలిపోయి, ప్రాముఖ్యతను కోల్పోయాయి. ఉపాధ్యాయులు, విద్యార్థులు ఇష్టమైనప్పుడు వచ్చేవాళ్ళు; పనిలో ఏ మాత్రం వుత్సాహం చూపేవాళ్ళు కారు. ఒక పర్యవేక్షణాధికారికి, ఉపాధ్యాయుడికి మధ్యజరిగిన సంభాషణ దివ్యంగా వర్ణించబడింది. ఒక ఉపాధ్యాయుడు పర్యవేక్షణాధికారులను వాళ్ళ పొట్టమీద పాకులాడే పాములతో పోల్చాడు. సివిల్ ఆఫీసర్లు కొండచిలువలు, పోలీసుశాఖవాళ్ళు నాగుబాములు, పన్నుల

అధికారులు కట్లపాములు, తపాలావాళ్ళు పసిరికపాములు. "అయితే నీళ్ళ పాములు ఎవరు" అన్నదానికి ఆ ఉపాధ్యాయుడు "రెవిన్యూ ఇన్‌స్పెక్టరు" అని జవాబు చెప్పాడు. "మేము ఎటువంటి పాకుడు జంతువులం?" (స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్లు) అని అడిగినందుకు "మీ జాతివారు అపాయం లేనివారు సార్" - 'ఒళ్ళె' జాతి ఒక చిన్నవిషం లేని పాముపేరు. దాని అర్థం 'మంచి' అనికూడా. అధికారానికి తగ్గట్లుగా గ్రామీణులు ఏవిధమైన ప్రవర్తన వ్యక్తం చేస్తారో తమాషాగా చెప్పాడు పంజె. సాష్టాంగ ప్రణామం ఆచరించడం, మోకరిల్లడం, చేతులకదలికలు అధికారి దుస్తులను బట్టి, హెూదా, జీతం, విభాగం ప్రాముఖ్యత, సాంఘికమైన అంతస్తు అన్నిటికంటె ఎక్కువగా కీడుచేయడానికి ఆ అదికారికుండే శక్తి - వీటిని బట్టి మారుతూ వుండేవి. అప్యాయత అన్నది సమయ సందర్భాలనను సరించి ఉండేది. గ్రామీణ పాఠశాలలలోని స్థితికరుణాజనకంగా, నీచంగా వుండేది. ఉపాధ్యాయుల నిస్సహాయస్థితి, వారిపైన చూపే నిరసన భావాన్ని గురించి వాళ్ళు విన్నవిస్తూండేవారు. ఇట్టి పరిస్థితి వల్ల వాళ్ళ పనికీ ఆఘాతం కలుగుతుండేది. ఉపాధ్యాయులమీద కొన్ని ఆరోపణలు చేయబడుతుండేవి. అయినా వాళ్ళ మీద సానుభూతి కలిగేది గాని, చర్యతీసుకోవాలనిపించేదికాదు.

తిమ్మప్ప మాష్టారును గురించింది ఒక ఆహ్లాదకరమైన సంఘటన. జీవితాన్ని గురించి, వ్యక్తిత్వాన్ని గురించి, వివిధ సందర్భాలను గురించి తెలుసుకొని అనుభవించాలంటే దీన్ని చదివితీరాలి. నల్లబల్ల, చాక్‌పీసు లేక పోయినా, వున్నా అదొక వేడుక, తమాషా. తిమ్మప్ప అనే పేరును వుచ్చరించడం చేతకాక ఒక ఇంగ్లీష్ పర్యవేక్షణాధికారి ఆయన్ను 'టి మఫ్' (ఇంగ్లీషులో 'ది మఫ్' అంటే మూర్ఖుడని) అని పిలిచాడు. మిగిలిన ముగ్గురు ఉపాధ్యాయులను కూడా వాళ్ళ పేర్లు పెట్టి పిలవక చిక్కప్, కుక్కప్ అంటూ (కప్ప అంటే కన్నడంలో నలుపని) వాళ్ళను నల్ల వాళ్ళను చేసేశాడు. విద్యార్థులను కూడా రంగును బట్టి, తరగతిని బట్టి పిలిచాడు కాని తిమ్మప్పమాష్టారి గొప్ప గుణాల విషయం మరోవిధం.

ఆ బడికి ఈ అధికారి ఏ విధంగా ధనసహాయాన్ని ఎక్కువగా మంజూరు చేయించిందీ ఒకసందర్భంలో వర్ణించబడింది. ఉపాధ్యాయుణ్ని మెచ్చుకుంటూ ఆయన ఇలా వ్రాశాడు "టి మఫ్ (తిమ్మప్ప) కన్నడ జిల్లాలోని ఒక గ్రామీణ పాఠశాలలో ఉపాధ్యాయుడు. ఆయన విశాలహృద యుడు. ఆయన బ్రాహ్మణుడైనా తానేదో అగ్రజాతి వాడిననే భావం ఉన్నవాడు కాదు. ఆ పల్లెలోని నల్లజాతి (ఆ కాలంలో హరిజనుల్ని అట్లనేవాళ్ళు) వాళ్ళు విద్యలో వెనకబడి వుండేవాళ్ళు కాబట్టి వాళ్ళను ముందుకు తీసుకు

రావాలనుకున్నారాయన. ఆయన సహాయకులూ నల్లవాళ్ళే. బడిలో చాలామంది విద్యార్థులూ నల్లవాళ్ళే. నేను ఇదంతా నా కళ్ళారా చూచి ధనసహాయం ఎక్కువ చేస్తున్నాను."

తిమ్మప్ప బడిలో శిక్షణ కోసమే పూర్తిగా పాటుపడ్డాడా అన్నది ఈ విషయంలో పరిగణింప బడలేదు. ఎక్కువయిన ధనంతో తిమ్మప్ప బీటలు వారిన స్కూలు భవనాన్ని బాగుచేయించలేదు. విద్యా బోధనకు పనికివచ్చే పరికరాలు కొనలేదు, ఆయన సహాయకులకు పంచనూలేదు. ఒక ఉపాధ్యాయుడు ఆయన్ను అడిగినట్లున్నాడు "పల్లెలోని చెరువు మరమత్తుకు మీరు డబ్బు ఇచ్చారు. ధనసహాయాన్ని ఈ విధంగా ఎందుకు వెచ్చించారు" అని. తిమ్మప్ప పంతులు ఇచ్చిన సమాధానం పురందరదాసు కీర్తనలోని ఒక పల్లవి :

చెరువు నీటిని చెరువులోనే చల్లు
("కెరెయ నీరను కెరెగె చెల్లిరో")

ఈ చిన్న పుస్తకంలో పంజె గ్రామీణ పాఠశాలల్లో జీవితాన్ని గురించి, మాష్టార్లను గురించి, గ్రామీణవిద్య తాలూకు పాలనావ్యవస్థను గురించి అనక్తికరంగా రాశాడు.[1]

* * *

## కోటి – చెన్నయ్య

పుస్తకంలోని చివరి రచన "కోటి–చెన్నయ్య" అన్నది. వీళ్ళిద్దరు పుట్టుకతోనే తల్లిదండ్రులను పోగొట్టుకున్న కవలపిల్లలు. తుళు దేశంలో ప్రచారంలో వుండే ఒక జానపద పురాణానికి సంబంధించిన కథ ఇది. డా. మోగ్లింగ్‌గారి "పాడ్దానెగళు" (జనప్రియ జానపద గీతాలు) నుంచేకాక ఈ కథను ఏ విధంగా అనేక మూలాలనుంచి సేకరించిందీ ముున్నుడిలో వివరించాడు పంజె. దక్షిణ కన్నడ జిల్లాలోని మూడు ప్రాంతాలను విజయనగర ప్రభువులకు పరోక్షంగా సంబంధంగల బల్లాళులు, తుళు నాయకులు, భూస్వామ్యవర్గం వాళ్ళు పాలిస్తుండేవాళ్ళు. కొన్ని సమయాలలో మధ్యవర్తులైన నాయకులు కొందరుండే వాళ్ళు కోటి, చెన్నయ్య ఏ విధంగా గొప్ప వాళ్ళుగా, ధైర్య సాహసాలు కలవాళ్ళుగా అయిందీ, ఏ విధంగా పరాక్రమము చూపిందీ, వాళ్ళ వలని భయం ఎలా ఈర్ష్యను రేకెత్తించిందీ వర్ణించబడింది. వాళ్ళ అందం, శౌర్యం చూసి ఈర్ష్య చెందిన వాళ్ళు ద్రోహం

[1] ఇలాంటి అనుభవాలను కన్నడంలో రాసిన వారిలో మరొక పాఠశాల పర్యవేక్షణాధికారి మాత్రం వున్నాడు. ఎం. ఆర్. శ్రీనివాసమూర్తి తన "రంగణ్ణన కనసిన దినగళు" (రంగణ్ణ కలల రోజులు) అనే పుస్తకంలో ఇలాంటివి వివరించాడు

చేసి కటకటాల వెనుక శోయించడం, వాళ్ళు తప్పుకోడం, చివరివరకు పోరాడి చనిపోవడం - ఇవన్నీ స్వచ్ఛమణుల వంటివి. ఆధునిక కన్నడ భాషలోగాని, ప్రాచీన కన్నడ భాషలోగాని చక్కదనంలో, అర్థగాంభీర్యంలో, కథా కథన శిల్పంలో, జిగిబిగిలో దీనికి దీటైన మరొక కథ లేదు. ఒక్క పదం వ్యర్థంగా లేదు, అనవసరమైన విశేషణాలు లేవు, కథనం మనల్ని వూపిరాడనివ్వకుండా చదివిస్తుంది. ఇందులోని మూడు అధ్యాయాలు మూడు స్థలాలను సూచిస్తాయి. అవి : పడుమలె, పంజ, ఎణ్మూర్. క్రింది చతుర సంభాషణ ఒక ఉదాహరణ :

(1) కోటి, చెన్నయ్య పడుమలె బల్లాళుని సభకు వెళ్ళి సాష్టాంగపడ్డారు. వాళ్ళు చేసిన హత్యలగురించి బల్లాళుడు కోపంతో ఉన్నాడు. బల్లాళుడికి ఎవరో దుర్బోధ చేశారు. కోటి, చెన్నయ్య ఎలుకల్లాగా పుట్టి, పులుల్లాగా తయారయ్యారని రాజు విని వున్నాడు.

బల్లాళ : ఏమి చెయ్యకూడదో అది మీరు చేశారు.

ఏది జరగకూడదో అది జరగనేకూడదు.

బల్లాళుని జీవితాన్ని కాపాడిన వైద్యురాలైన తన తల్లి చెవిలో చెప్పిన మాట జ్ఞాపకం చేసుకున్నాడు కోటి.

“దేవా ! మా తల్లికి మీరిచ్చిన మాట మర్చిపోయారా ?”

బల్లాళ : నేను మాటిచ్చానా ?

కోటి : నేనిప్పుడు మీకు సమర్పిస్తున్న అభరణాలన్నీ మీవే – మీరు చెప్పారట – ఏది మిగిలితే అదంతా నీ పిల్లలకు ఇస్తాను అని. ఇలాంటి మాట మీరు ఇచ్చారా లేదా ?

బల్లాళ : కోటి, నేను మీ తల్లికిచ్చిన మాటకు, నీవు ఇప్పుడు చేసిన దురాగతాలకు సంబంధంలేదు.

కోటి : ఒకర్ని హత్య చేసినందుకు అనుభవించవల్సిన శిక్షను మేము అనుభవిస్తాము. ముందు మీరిచ్చిన మాట నిలబెట్టుకోండి.

చెన్నయ్య : మేము చనిపోయిన తర్వాత మిమ్మల్ని అడిగేవాళ్ళెవరు ?

బల్లాళ : మీ కోరిక ఏమిటి ? అడగండి, వెంటనే దాన్ని తీరుస్తాను.

కోటి : శిబిరాల ముందుండే మాగాణి భూమి.

బల్లాళ : అది వీలుకాదు.

కోటి : నిరంతరంగా పాలిచ్చే గేదె నివ్వండి.

బల్లాళ : మాకది కావాలి.

కోటి : ఏడాదంతా పళ్ళిచ్చే పనసచెట్టు ?

బల్లాళ : ఇంకేదయినా అడుగు.

చెన్నయ్య : మీ ఇద్దరు రాణులకు చెందిన పూలతోట.

బల్లాళ : ఏమన్నావ్ ?

చెన్నయ్య : మీ కరవాలం.

బల్లాళుడు కోపంతో ఎరుపెక్కాడు. "మా రాజధానిలో పాలుతాగి పెరిగిన మీరు నా రాణుల పూదోటను అడుగుతున్నారు. నా కరవాలాన్ని కోరుతున్నారు. మీరు ఏమడుగుతారు, తర్వాత ఏం చేస్తారు అన్నదే తెలియదు. మీ ఇష్టం వచ్చినట్లు మిమ్మల్ని వదలిపెట్టడానికి వీలులేదు."

కోటి, చెన్నయ్య అన్నారు : "మీరు అన్నమాట నిలబెట్టుకునేందుకు ఆరేళ్ళ వ్యవధి ఇస్తున్నాం" అని వాళ్ళిద్దరూ బయట పడ్డారు.

* * *

(2) పడుమలె నుంచి బయటపడి పంజ ప్రదేశంలో ఒక యింటిదగ్గర మంచి నీళ్ళు అడిగారీ సోదరులు. ఆ ఇంట్లోని స్త్రీ సరైన దుస్తులు లేనిదే బయటికి కనిపించకూడదనుకుంది. ఆమె లోపలికి వెళ్ళి, బిందెడు నీళ్ళు చేది ముంగిట్లో పెట్టి "నీళ్ళు అక్కడ వుంచాను" అన్నది.

కోటి : నీ చేతి నీళ్ళు తాగాలంటే నీ జన్మను గురించి చెప్పాలి. నీ కులమేదో తెలియాలి.

ఆమె : దానికేమీ అడ్డులేదు. అయితే చెప్పాల్సిన కథ చాలా పెద్దది, మీరు వినదల్చుకుంటే. ఇంతలో నా భర్త కూడా రావచ్చు.

అంతలో ఆమె భర్త ఒక కల్లుకుండ తీసుకొని వెనక వైపునుంచి రానే వచ్చాడు. ఆ స్త్రీకి ఈ విషయం తెలియదు. పరపురుషులతో మాట్లాడుతున్నందుకు అతను అనుమానించాడు. ఒకచోట దాక్కొని వీళ్ళ సంభాషణను విన్నాడు.

చెన్నయ్య : కథ చెప్పు విందాం.

ఆమె : మా అమ్మమ్మ బ్రాహ్మణ స్త్రీ అనుకుంటాను. ఆమె పెళ్ళికి ముందే సమర్త అయింది. ఆమె తలిదండ్రులు కులాచారాన్ని అతిక్రమించ లేక పోయారు. ఆమె కళ్ళకు గంతలు కట్టి అడవిలో వదిలేశారు.

కోటి : ఆ తర్వాత ?

ఆమె : తాటిచెట్టెక్కిన ఒక మనిషి ఆమెను చూచాడు. నాయకుని దగ్గరికి వెళ్ళి ఈ విషయం విన్నవించాడు. అతని ఇంటికి తీసుకొని వెళ్ళాడు. ఆమెను పెంచి పెద్దచేసి బిర్మణ బైద్యకు ఇచ్చి పెళ్ళిచేశాడు.

కోటి : కుర్గోల్‌తోటకు చెందిన బిర్మణ బైద్యానా ?

ఆమె : అవునవును. కుర్గోలు. భగవంతుడా, నేనాపేరు మర్చిపోయాను. మా అమ్మ ఆ విషయం ఒక్కసారి చెప్పింది. ఇప్పుడు గుర్తొచ్చింది.

కోటి : మీ తల్లి ఎవరు ?

ఆమె : బిర్మణ వైద్యుని కూతురు

కోటి : పేరు ?

ఆమె : దేయి.

కోటి : తండ్రి పేరు ?

ఆమె : కాంతణ్ణ.

కోటి : పుట్టినచోటు ?

ఆమె : బ్రహ్మర అని కెమ్మలజెకు చెందిన ప్రదేశం అని విన్నాను నేను చూడలేదు.

కోటి : మీ అమ్మకు మీరు ఎంతమంది పిల్లలు ?

ఆమె : నేనే మొదటిదాన్ని. నా తర్వాత మా అమ్మకు సేనాపతి శిబిరం దగ్గర ఇద్దరు కవలలు కలిగారని విన్నాను.

కోటి : కుర్గోల్ తోటకు సంబంధించిన వాళ్ళు సేనాపతిశిబిరం దగ్గర ప్రసవించడం ఎలా సాధ్యం ?

ఆమె : దాన్నిగురించి చెప్తాను. మీరు పడుమలెకు చెందిన పెరుమాళ్ బల్లాళ్‌ను గురించి వినేవుంటారు. ఒకమారు అతను వేటకు వెళ్ళాడు. ఆతని కాలికి ముల్లు గుచ్చుకుంది. అతను బతుకుతాడా, చనిపోతాడా అన్నట్లు వుండింది. నా తల్లి అప్పుడు పూర్ణగర్భవతి. రాజును ఔషధులతో బాగుచెయ్యగలామె అమె ఒక్కటే అనే ఉద్దేశంతో సైనిక శిబిరం దగ్గరికి తీసుకువచ్చారు. అమె పూర్ణగర్భవతి అయినాకూడా అందుకు సిద్ధపడింది. ఆమె ఒక పసరు పిండింది, ఆయన దేహానికి లేపించింది. రాజు బాధను పూర్తిగా మాన్పింది. కొద్దిసేపటికే అమెకు ప్రసవమయింది. అప్పుడామెకు కవలలు పుట్టారు.

కోటి : ఆ తర్వాత ఏమయింది ?

ఆమె : పిల్లలు పుట్టిన తర్వాత మా అమ్మ మూడు నెలలకు చనిపోయిందట.

కోటి : చివరి క్షణాలలో ఆమె దగ్గర ఎవ్వరూ లేరా ?

ఆమె : నాకు ఏడు సంవత్సరాలప్పుడు ఇక్కడికి తీసుకొనివచ్చి పెళ్లి చేశారు. అప్పటినుంచి నేను బయట కాలు పెట్టలేదు. అందువల్ల మా అమ్మ ప్రసవించిన సంతోష వార్తగాని, అమె చనిపోయిన దుఃఖ వార్తగాని నాకు తెలియదు. చెవులు ఆ వార్తల్ని విన్నాయి, కళ్ళు చూడలేక పోయాయి.

కోటి, చెన్నయ్య మానసికంగా అతీతానందాన్ని పొందారు. తత్తర పాటంతా అణగిన తర్వాత నిశ్శబ్దంగా ఒకరినొకరు చూచుకుంటూ నిలుచున్నారు. కొంత సేపయిన తర్వాత కోటి "ఆ పిల్లల్ని ఎవరు పెంచారు ?" అని అడిగాడు.

ఆమె: ఆ తర్వాత ఏమి జరిగిందన్నది నాకు తెలియదు. ఏదైనా పొలంవుంటే దానికొక కంచె వుండాలి. ఆడపిల్లకు పుట్టింట తల్లి వుండాలి. నా తల్లి చనిపోయినప్పుడు నేను పుట్టింటికీ వెళ్ళలేదు, మా అమ్మనూ చూడలేదు. నా తమ్ముళ్ళనూ చూడటానికి పడలేదు. పట్టణవాసులు వాళ్ళ ధైర్య సాహసాలను గురించి చెప్పారు. వాళ్ళ శౌర్యం నీటినుంచి వెలువడ్డ నిప్పువంటిది, భూమినుంచి వచ్చిన పిడుగులాంటిది.

చెన్నయ్య: అక్కా, నీపేరు ?

ఆమె : కిన్నిదారు.

సోదరులు లేచి నిలిచారు; "నీవు మా అక్కవు. నీ సోదరులు నీ ఎదుటే వున్నారు." వాళ్లిద్దరూ ఆమె పాదాలమీద పడి తమ గౌరవాన్ని సూచించారు. ఆమె భర్త చాటునుంచి వచ్చి, వాళ్ళను లోపలి కాహ్వానించి సంతోషంగా వాళ్ళతో అన్నాడు: "లేవండి, లేవండి." ఇలా అని వాళ్ళను పైకి లేపి వరండాలో వున్న ఉయ్యాలమీద కూర్చోబెట్టాడు. కిన్నిదారు సంతోషానికి మేరలేదు. అప్పటికప్పుడు పాలు పిండి, వాళ్ళకు కాచి ఇచ్చింది. ఆమె తయారుచేసి ఇచ్చిన పదార్థాలను ఎవరు వర్ణించగలరు ? తెల్లని సన్నబియ్యపు అన్నం, బెల్లంకలిపి తియ్యగా చేసినగంజి, పనసతొనల పిండివంట, నేతివంటకం, పెరుగు, వెన్న, వడియాలు, అప్పడాలు చేసిపెట్టింది. ఒక్క మాటలో చెప్పాలంటే వంటకాలతీరు, వాటిని పెట్టిన విధం చూడగా కడుపునిండిన వాళ్ళకు కూడా మళ్లీ ఆకలి అయ్యేట్లుగా వుండింది.

* * *

చురుకైన చివరిదృశ్యం చెప్పి నేను దీన్ని పూర్తి చెయ్యాలనుకుంటున్నాను.

పడుమలె బల్లాళుడు తన అధికారులను మనుష్యులను ఈ ఇద్దరూ చంపివేశారని విని వాళ్ళను పట్టుకుంటే బహుమానాన్ని ప్రకటించాడు. వాళ్ళను బతికుండగానో, చంపో పట్టుకోవలసిందిగా పంజకు వర్తమానం అందింది. వీళ్లిద్దరు వాసం చేస్తుండిన పంజలో ఈర్ష్యాపరుడు, క్రూరచిత్తం కలవాడు అయిన చెందుగిడి అనే అతను మోసంతో సేనాపతి దగ్గరకు వీళ్ళిద్దరిని తీసుకొని వెళ్ళి, వాళ్ళను కారాగారంలో తోయించాడు. వీళ్ళిద్దరూ తప్పించుకొన్న కథ అద్భుతంగా వుంది. చిన్నవాడు పెద్దవాడి భుజాలమీద నిలుచున్నాడు. వాళ్ళగదిలో వున్న ఒకే ఒక కిటికీకి వుండే వూచల్ని పెరికి వేశాడు. వాళ్ళు వేసుకుని వుండిన గుడ్డల సహాయంతో, వాటిని తాడులాగా చేసుకొని ఇద్దరూ తప్పించుకున్నారు. వీళ్ళిద్దరూ ఎణ్మూరికి వెళ్ళారు.

అక్కడి సేనాపతి పడుమలె సేనానాయకుడి పైన పగ పెంచుకొని, ఏమీ చేయడానికి పాలు పోకుండా వున్నాడు. కోటి - చెన్నయ్య అక్కడికి వచ్చి అతనికి బాసటగా నిలిచారు. పడుమలె సైనికులకూ, ఎణ్మూరు రక్షకులకూ హోరాహోరి పోరాటం జరిగింది. విజయం సాధిస్తున్న తరుణంలో కోటికి ఒక బాణం వచ్చి గుచ్చుకున్నది. దురాలోచనగల చెందుగిడి చెన్నయ్యను వెన్నుపోటు పొడిచి తానూ బలిఅయ్యాడు. పడుమలె బల్లాళునికి ఖేదం కలిగింది. ఎణ్మూరు నాయకుడైన దేవబల్లాళుడు సోదరుల దగ్గరకు వచ్చి కైమోడ్చి "నాకు విజయం చేకూర్చిన యుద్ధవీరులు మీరే, మీ రక్షణ నాకు ఎల్లవేళలా కావాలి. ఒకవేళ నా తలను ఖండించి మీకు దక్షిణగా ఇచ్చినాకూడా నేను కృతజ్ఞత చూపినట్లుకాదు. యుద్ధరంగంనుంచి వెలువడివచ్చి, పల్లకీలలో నగరంలో వూరేగి ఈ రాజ్యాన్ని మీసొంత రాజ్యంలాగా ఒక్కసారి వీక్షించండి."

అప్పటికి పెరుమాళ్ బల్లాళుడు దుఃఖంతో నెత్తిని చేతితో, మొత్తుకుంటూ ముందుకు వచ్చాడు. బలమైన దెబ్బతగిలి చనిపోయే స్థితిలో వున్న కోటిని చూచి "నేను పాపిని. నా చేతులతో పెంచిన వాళ్ళనే మట్టు బెట్టాను. ఇలాంటి పాపకార్యానికి తగిన శిక్ష నాకు లభిస్తుంది" అన్నాడు. ఈ విధంగా అని కత్తితీసుకొని తన డొక్కల్లో పొడుచుకోబోయాడు.

కోటి సైగచేశాడు: "అలా చెయ్యవద్దు మహారాజా, వూరుకోండి."

చెన్నయ్యలేచి పెరుమాళ్ బల్లాళుని చేతినుంచి బాకునిలాగి వేశాడు తనకు కాలం సమీపించిందని తెలిసిన కోటి తనను శివాలయం ద్వారం. దగ్గరకు తీసుకొని వెళ్ళమని సోదరునితో చెప్పాడు. ఆకాశం వంక చూస్తూ- "సుబ్రహ్మణ్యలో ఈరోజు పవిత్రదినం. తేరుమీద శివుడు వూరేగుతాడు. నేను దేవాలయం తేరుమీద గుండ్రంగా తిరిగే గరుడ పక్షిలాగా ఎగురుతూ కైలాసానికి పోవాలని వుంది. నా హృదయం దానికోసం అలమటిస్తూ వుంది. దేవాలయంలో పూజలు జరగనీ" అన్నాడు.

సూర్యుడు అస్తమించాడు. దేవాలయంలో గంటలు గణగణ మ్రోగాయి; పూజలు మొదలయ్యాయి. అవి అయిన తర్వాత పురోహితుడు కర్పూరహారతి తీసుకొనివచ్చాడు. దాన్ని కోటి ముందుంచి, అతనికి తీర్థం ఇచ్చాడు. కోటి భక్తితో దాన్ని సేవించాడు. దేవబల్లాళునితో ఇలా అన్నాడు - "మహారాజా, పడుమలెలో యాత్రికులకు మంచినీళ్ళను సరఫరాచేసిన బ్రాహ్మణుడు, అతని వంశం ఇప్పటినుంచి వెయ్యేండ్లు మహాలింగేశ్వరుని పూజ చేసేట్లుగా ఏర్పాటు చెయ్యండి. కొంత పవిత్ర తీర్థాన్ని నా గొంతులో పొయ్యండి." దేవబల్లాళుడు, పెరుమాళ్ బల్లాళుడు కోటికి రెండువైపులా కూర్చొన్నారు. అతని గొంతులో లేతకొబ్బరి నీళ్ళను కూడా పోశారు. కోటి ఇద్దరు బల్లాళుల

చేతులనూ పట్టుకొని; "ఇప్పటినుంచి మీరు చెయ్యదగింది మీ చేతుల్ని స్నేహితుల్లాగా కలపడమే" అన్నాడు. అతని కళ్ళుమూసుకున్నాయి; మళ్ళీ తెరిపిడిపడలేదు.

చెన్నయ్య ఇది చూచాడు: "సోదరా!" అని పిలిచాడు. "నీవు లేకుండా నేను వుండలేను. మనమిద్దరం ఒక్కటిగా పుట్టాము. మనం ఒక్కటిగా చనిపోవాలి. నేనూ నీతోనే వస్తాను." ఇలా అని అతను నేరుగా దేవాలయం బావిముందుండే బండదగ్గరికి వెళ్ళి దానికేసి తల బాదుకున్నాడు. చెందుగిడి అతన్ని వెన్నుపోటు పొడిచినప్పుడు అతని దేహంనుంచి రక్తం కారింది. ఇప్పుడు అతని కపాలంనుంచి మెదడుకు సంబంధించిన తెల్లనిసారం వచ్చింది. అది చెన్నయ్య పడినచోట హోమగుండంమీద మల్లెమాలలాగా ఒప్పుతున్నది. ఉన్నట్టుండి శివాలయంలోని దీపాలన్నీ వాటంతటవే ఆరిపోయాయి. ఒక ఉరుము ఉరిమింది; మెరుపు మెరిసింది; కొంతసేపు కుంభవృష్టి కురిసింది. అంతలోనే వెలిసింది. సోదరుల శవాలను పల్లకీల మీద వూరేగించారు. ఉత్తరక్రియలకు నగరంలోని పద్దెనిమిది విభాగాలకు చెందిన నాయకులంతా ఒక్కటై వచ్చి జరిపించారు

* * *

పడుమలెకు, ఎణ్మూరికి సంబంధించిన ఇతర వివరాలున్నాయి. ఈ దురవస్థంతా ఎందుకు ఏర్పడింది అనే విషయాన్ని గురించిన చిన్న వివరణ వుంది. పంజలోని చెందుగిడి అనే దుష్ట అంతరంగికుడు, కెమర బల్లాళుడనే వాడు కలిసి మోసంతో కోటి – చెన్నయ్యలను కారాగారంలో తోయించారు. ఈ సోదరులు తెలివిగా తప్పించుకొనే వుపాయాన్ని పన్నారు. ఎణ్మూరులోని ప్రజలు వీరిమీద అభిమానం కలవారంటారు. ఎణ్మూరు అధిపతి పడుమలె, పంజలలోని తన రాజ్యభాగాన్ని సంపాదించాలని ప్రయత్నిస్తున్నాడు. ఒక బల్లాళుడు కిన్నిదారును ఆమె భర్తను హింసించాడు. మరొకడు సాయిన బైద్యను ఇడుమలకు లోనుచేశాడు. వాళ్ళ ఉగ్రత ఇంకా శమించలేదు. కోటి – చెన్నయ్యలు కనిపిస్తే పట్టుకొని చంపవలసిందని ఆజ్ఞాపించారు. ఎణ్మూరికి గూఢచారులను పంపారు. సోదరుల్ని చంపడానికి విషపు పాలు ఇచ్చి వాళ్ళను అయిపులేకుండా చెయ్యాలని చూచారు. అయితే ఈ వుపాయం పారలేదు. కెమరుని అంతరంగికుడైన ఒకని ద్వేషం ఎలాంటిదని ఒక సందర్భం సూచిస్తుంది. కోటి – చెన్నయ్య కెమరుని దూషించిన విషయాన్ని అతను ఇలా నివేదించాడు: "వాళ్ళు ఇది ఒక దరిద్రగొట్టు ప్రదేశమన్నారు. నీవొక బీద బల్లాళుడివట. ఈ వీరులు మీ జన్మను గురించి అనేక నీచవాక్యాలను పలుకుతున్నారు." బల్లాళుడు తెలివిగలవాడు. పై అపవాదులోని

సత్యాసత్యాలను కనుక్కోడానికి సోదరుల్ని రప్పించాడు. ఇరుపక్షాలను హాజరుపరిచాడు. చెన్నయ్య ఇలా అన్నాడు: "దేవా, నా సోదరుడికి దీన్ని గురించి ఏమీ తెలీదు. మాట్లాడిన వాణ్ణి నేను. నేను మీ జన్మను గురించి గాని, మీ వంశాన్ని గురించి గాని ఏమీ అనలేదు. మీకు సత్యాన్ని విన్నవిస్తాను. మీరు గనుక వింటానంటే ఆ వాక్యాల్ని నేనే విన్నవిస్తాను. ఆ రోజు రాజభవనానికి చెందిన ఏనుగు చెలరేగగా దాన్ని పట్టుకొని కట్టుకొయ్యకు కట్టేశాము. ఆ దినం మాకు చాలా సంతోషం కలిగింది. మాకప్పుడు పరమానందమయింది. మేము ఈ రాజ్యానికి వచ్చి రెండు మూడు ఏళ్ళయింది. అయితే రాజసభ మా శౌర్యప్రదర్శనను అంతవరకు విలోకించలేదు. అడవిపంది వెంట్రుకకాని, పులిగోరుగాని, ఏనుగు దంతంగాని, కానుకగా తెచ్చి మీకు సమర్పించలేదు. తుప్పేకల్ అడవిలో ప్రవేశించడానికి మాకు అనుమతి లభించలేదు. మేము యుద్ధం చేయడానికిగాని, మీ శత్రువులను చంపడానికిగాని, వాళ్ళ శిరస్సులను తెచ్చి మీకు సమర్పించడానికిగాని అనుమతి ఇవ్వలేదు. అందువల్ల మేము అనుకున్నదేమిటంటే మేము తిన్న అన్నం అపవిత్రమైందని ; మేము త్రాగిన నీరు మా కడుపును ఉబ్బించిందని; వేసుకున్న దుస్తులు నలగను గూడా లేదని; మా చేతుల్లోని ఖడ్గం కాంతిని కోల్పోయిందని. ఈ మాటలు గనుక దూషణ అని, అభాండాలని అనుకునేట్లయితే, ఇదిగో, ఈ ఖడ్గం తీసుకుని నా కంఠం ఉత్తరించండి" ఇలా అని తన కత్తిని బల్లాళుని ముందుంచి తల వంచాడతను. చెన్నయ్య పలుకులను దేవ బల్లాళుడు విన్నాడు. "నిజమే, ఒక వినోదం లేదు, వేడుక లేదు, యజ్ఞయాగాదులులేవు. అలాంటివన్నీ వుంటే మన ప్రజలు దైహికంగా బలవంతులయ్యేవారు. సామూహిక బలం పెంపొందేది. అయినా, చూడు — మనం తుప్పేకల్ అడవిలో వేటాడితే దానివల్ల పంజ ప్రజలను యుద్ధానికి ప్రేరేపించి నట్లవుతుంది. అందువల్లనే అటువంటి దాన్ని అనుమతించడానికి నేను ఒకటికి రెండుసార్లు ఆలోచించవలసి వచ్చింది."

చెన్నయ్య అన్నాడు : "ప్రభూ, క్రూరజంతువుల నుంచి మన ప్రజలను రక్షించాల్సిన బాధ్యత మనమీద లేదా ? మీ ఆశయాన్ని నెరవేర్చుకోడానికై అలాంటిదాన్ని అంగీకరిస్తారా ?"

"అట్లాయితే, తుప్పేకల్ అడవిలో వేటాడండి" - అని ఆజ్ఞ ఇచ్చాడు బల్లాళుడు. "చెన్నయ్య, అపనింద వేసిన ఈ దుర్మార్గుడికి సరియైన శిక్ష ఏమిటి ?" అని అడిగాడు.

చెన్నయ్య : "ప్రభూ, నా కత్తిని తడపగలిస రక్తమూ అతని దేహంలో లేదు. ఎవరూ తినగల్గినంత కండకూడా అతని శరీరంలో లేదు. అతను స్వతంత్రుడుగా వుండనివ్వండి."

ఈ అనుమతివల్ల అడవిలో ఒక అడవిపందిని చంపి ఎణ్మూరికి లాక్కొని వచ్చారు. అది పంజ ప్రజలకు, ఎణ్మూరు ప్రజలకు మధ్య తగవు తెచ్చింది. పడుమలె సైనికులు, పంజ సైనికులలో చేరారు. తరువాత జరిగినయుద్ధంలో నిహతులయ్యారు. తరువాత ఏమైందీ ఇంతకు ముందే వర్ణించ బడింది.

## 3

ప్రకీర్ణములు :

ఇప్పుడు పంజె రాసిన మరికొన్ని పుస్తకాలను గురించి చెప్పవచ్చు. పంజె కొన్ని అక్షరాభ్యాస పుస్తకాలను, కథలను, రేఖాచిత్రాలను మొదలైన వాటిని పాశ్చాత్యుల శిశుసాహిత్యంలాగా రాసి ప్రచురించాడు. [1]వీటిలో కొన్ని కన్నడ గీతాలను, కథలను పోలినవి. కొన్నిటిని బాలసాహిత్య మండలి వాళ్ళు, మరికొన్నిటిని మాక్మిలన్స్, బాసెల్ మిషన్ వాళ్ళు ప్రచురించారు. బాసెల్ మిషన్ వారి వేదాంత పాఠశాల (మంగుళూరు) కు చెందిన క్రిస్తాను జవత్స్ కూర్చిన ఆంగ్ల - కన్నడ లఘు నిఘంటువును పరిష్కరించి, విస్తరించి ప్రచురించాడాయన. ఇది చాలా విలువైన గ్రంథం. ముగ్గురు స్నేహితులు వాహ్యాళి వెళ్ళినపుడు మాట్లాడుతూ అనుకున్నట్లుగా పంజె వ్రాసిన ఒక సంభాషణకు తగ్గట్లుగా ఈ గ్రంథాన్ని తయారు చేశాడు పంజె. దీనినుంచి వచ్చిన ఆదాయంతో పంజె మంగుళూరులోని గణపతి పాఠశాలలో జిల్లా స్థాయి శిశు సమ్మేళనాన్ని ఏర్పాటు చేశాడు. ఆ ప్రాంతంలో ఇలాంటివాటిలో ఇదే మొదటిది. ఇది కాక "కిట్టెల్ కూర్చిన ప్రసిద్ధ కన్నడ – ఇంగ్లీషు నిఘంటువును పరిష్కరించి, విస్తరించవలసిందని ఆయన కిచ్చారు. అప్పుడప్పుడూ తమ జీవితాంతమూ దాన్ని ఆయన చూస్తూనే వున్నాడు. దురదృష్టవశాత్తు సుమారు వెయ్యి పదాలకంటె ఎక్కువగా ఆయన కలపలేకపోయాడు .." "శబ్దమణి దర్పణ" కు ఆయన చేసిన పరిష్కరణ పాత కన్నడ వ్యాకరణాలకు (13 శతా.) సంబంధించి నంతవరకు అత్యుత్తమమైంది. ముఖ్యసూత్రాలకు ఆయన ఇచ్చిన ఇంగ్లీషు వివరణ భాషేతరులకు చాలా ఉపయోగకరం. తులనాత్మక వ్యాకరణం అధ్యయనం చేసేవాళ్ళకు, భాషా శాస్త్రంలో అభినివేశం వున్నవాళ్ళకు సహాయం చేస్తుంది. ఆంగ్లంలో ఆ కాలంలో వెలువడిన ఇటువంటి గంధ్రాలకు (ఉదా : కిట్టెల్ వ్యాకరణం) ఇది ఒక సేతువు లాంటిది. కాల్డ్వెల్ రాసిన 'ద్రావిడ భాషల

---

[1] ఇటువంటి వాటిలో ఒకటి "ఫోక్ టేల్స్ ఫర్ లిటిల్ ఫోక్" (జానపద బాలల జానపద కథలు) అన్నది.

తులనాత్మక వ్యాకరణం'లోని కొన్ని విషయాలను పరిశీలించడానికి పంజె గ్రంథం తోడ్పడుతుంది. ఏమైనా కాల్డ్వెల్‌కు తమిళభాషా పరిజ్ఞానం వున్నంతగా కన్నడ భాషాజ్ఞానం లేదుకదా!

ఉపాధ్యాయుడుగా, పాఠశాలల ఇన్స్పెక్టర్‌గా వున్నకాలంలో పంజె విద్యాసంబంధమైన ఒక పత్రిక నడిపాడు. ఉపాధ్యాయులకు విద్యాబోధనను గురించి, సామాన్యజనులకు పాఠశాలలలో విద్యాబోధన ఎలా జరిగేది ఇత్యాది విషయాలను తెలుపుతూ వుండేది ఈ పత్రిక. మొదటి సంచికలోనే "బోధన అంటే ఏమిటి?" అనే విషయాన్ని గూర్చివుంది. దీన్ని దక్షిణ కన్నడ జిల్లా ప్రాథమిక పాఠశాల తరఫున ప్రచురించారు. పంజె "శిక్షణ" అనే పదం కన్నా "బోధన" అన్న పదం మేలని భావించాడు. "బోధ్" అన్నది విశాలార్థం కలది. "శిక్ష" అంటే విద్యాశిక్షణ కాక శిక్ష అనే అర్థం కూడా వస్తుంది. పిల్లలను శిక్షించడమంటే మొదటినుంచి పంజెకు బాధాకరంగా వుండేది. పిల్లల విద్యను మెరుగుపరచడానికి, తప్పులు దిద్దడానికి బెత్తం వుపయోగించడం వంటి క్రూర విధానాలను గర్హించి పంజె వాటిపై యుద్ధమే ప్రకటించాడు. పిల్లలకు బుద్ధివికాసం కలగాలంటే నాటకాల ద్వారా, కథలు చెప్పడం ద్వారా, పాటల ద్వారా, నృత్యం ద్వారా జరగాలని, వాళ్ళ వుత్సుకతను రేకెత్తించాలని ఆయన భావించాడు. మొండి పిల్లలైనా సరే బెత్తం వుపయోగించాలంటే ఆయన ఇష్టపడేవాడు కాదు. పలక, రూళ్ళకర్ర వుపయోగించడం, ఇతర క్రూర పద్ధతుల్ని గర్హించేవాడు. 'కర్ర అవతలబెట్టితే పిల్లలు పాడవుతారు' అనే మాటలో నమ్మకముండే వుపాధ్యాయుల్ని చూస్తే ఆయనకు నచ్చేదికాదు. చాలా కోపం, విసుగు కలిగినపుడు, ఇంట్లో అయినా సరే పంజె బెత్తం వుపయోగించే వాడు కాదట. మహా అయితే రెండు టెంకాయ పుల్లలను తీసుకొని బెదిరించేవాడట; వాటితో కూడా దెబ్బవేసేవాడు కాదు.

## 4

### కవిత్వం

తర్వాతి విభాగంలో పంజె కవిత్వ రచనలను గురించి చెప్పాలి. జీవితంలో, రచనల్లో మొదట, చివర కూడా ఆయన కవే. ఆయన రాసిన పిల్లల పాటలు చాలా ఆకర్షణీయమైనవి. బాలగీతాలను రాసేటప్పుడు ఆయన తుళునాడులోని మరాఠీలోని జానపద ఛందస్సులను వాడుకొన్నాడు. "సంజెయ హాడు" (సంధ్యాగీతం) అనే పాటలో నాల్గు పాదాలలోని ప్రతి రెండు పాదాలలో పల్లవి వుంటుంది. కొన్ని పాదాల మొదట శబ్దాలంకార యుతంగా "ఇరబేకై" (ఉండాలి), "బరబేకై" (రావాలి), "హొరబేకై"

(మొయ్యాలి), "కొడబేకై" (ఇవ్వాలి), "ఉడబేకై" (ధరించాలి), "బిడబేకై" (వదలాలి) అని రాశాడు. మరారీ గీతాలలో నేను విన్న లయ, వరస, శయ్య లాంటిది ఆయన పాడుతుండిన ఈ గేయాలలో వుంది. ఈ పిల్లల పాటలు అందరి దృష్టిని ఆకర్షించడమే కాక, పిల్లలు గుర్తుపెట్టుకోడానికి, వాళ్ళలో సంతోషాన్ని, ఉత్సాహాన్ని పెంపొందించడానికి తోడ్పడేవి. కొన్ని మాత్రమే నీతి పద్యాలు. పంజె పిల్లల పాటల్లో ఎల్ల వేళలా నీతి వుండాలనే భావన వున్నవాడు కాదు. వాటి ప్రత్యేకత ఏమిటంటే సరళసుందరమైన భాష, రీతి, సహజమైన సంబోధన, ఉపమలు, మంచి కల్పనలు.

"నాగణ్ణన కన్నడక" (నాగన్న కంటి అద్దాలు) అనేది బ్రహ్మాండమైన కథ. ఇందులో ఒక అమాయకుడు కంటి అద్దాల అంగడికి వెళ్తాడు. అతను అవిద్యావంతుడు. అన్ని రకాల అద్దాలనూ చూస్తాడు. చివరికి రాయను, చదవనురాని వాడు అద్దాలు పెట్టుకొని ఏం చదవాలి అనే విషయాన్ని తెలుసుకుంటాడు.

"దొంబరచెన్నె" కథ (దొమ్మరి చెన్ని) నాటకీయంగానూ, ఆకర్షణీయంగాను వుంది. ఇందులో ఒక ప్రేక్షకమహాశయుడు ఏ విధంగా దొమ్మరిపడుచు ప్రేమలో పడిందీ వివరించబడింది. అతడినుంచి తప్పించు కోడానికి తండ్రి, కూతురు ఒక నదిలో దూకారు; అయితే రక్షించబడ్డారు. చివరికి తెలిసిందేమిటంటే ఆ చిన్నది మరెవరో కాదు. అమెను ప్రేమించిన అధికారికి అత్త కూతురే. కొంతకాలం క్రిందట ఆ అమ్మాయి కోటనుంచి దొమ్మరి వానితో పారిపోయింది. ఇది చాలా విశిష్టమైన కథనం, వర్ణనలు వుండే రచన. దొమ్మరి వాళ్ళు చాలా చాలా ఆశ్చర్యపోతారు.

"కడెకంజి" అనే రచనలో ఒకనాయకుడు చూపిన దయాదాక్షిణ్యాలను గురించి వర్ణించబడింది. ఒకడు జీవితంలో అన్ని విధాల ఓటమి పొందగా చివరికి ఒక్క దూడ మాత్రం అతనికి మిగిలింది. నాయకుడు అతనికి భూమిని, జీవనాధారాన్ని ఇచ్చాడు. ఐశ్వర్యవంతుడై ముందుకు వచ్చిన ఆ మనిషి ఎన్నో గోవులను, ధనాన్ని సంపాదించి చివరికి తాగుబోతుగా మారి దరిద్రుడయ్యాడు. అయితే చివర దూడ మిగిలేసరికి అతనిలో పరివర్తన వచ్చి తను చేసిన పనికి పశ్చాత్తాపపడ్డాడు. బల్లాళుడు ఈ స్థితిలో అతన్ని చూచాడు; నొచ్చుకున్నాడు; సహాయం చేశాడు. ఆ మనిషి ఆయనతో అన్నాడు:

"బడవనాదరు బేడలొల్లెను, హడెద మక్కళ మారెను
కడవ పరరిం, ఒడవె హెరరిం పడెయె పడెయెన్ ఎందిగూ"
(బీదనైనా భిక్షమడగను; కన్నెపిల్లల నమ్మను
అప్పు అడగను సొమ్ములడగను; పరుల నుండి ఎప్పుడూ)

దీనికి బల్లాళుడు ప్రత్యుత్తరమిచ్చాడు :

"బిద్దుదిల్లవు గద్దిగెయ మేలిద్ద నమ్మా కివియలి
గద్దె ఉళువర ఉద్దగోలిన సద్దీ తనకవు."

"నీ కథ రాతి హృదయాన్ని కూడా కరిగేల్లు చేస్తుంది. మేము గద్దె మీద కూర్చొని మీ వృత్తాంతాన్ని వినలేక పోయాము. భూమి దున్నే రైతుల కష్టాలను ఇప్పటివరకు వినలేదు. నీకేం కావాలో అడుగు. తూర్పు పొలాన్ని నీ కిస్తాను. నేను చంద్రనాథుడనే నాయకుణ్ణి. ఈ భూమికి స్వంతదారుణ్ణి. అందువల్ల నీకు సులభంగా దానమివ్వగలను."

నాగుబాము ప్రమాదకరమైన సరీసృపం. భయంకరమైన అందం అది పడగవిప్పినప్పుడు కనిపిస్తుంది. పాములవాడు బుర్ర ఊదుతాడు పంజె కాసరగోడులో వున్నపుడు దీన్ని గురించిన పాటను ఎలా రాసిందీ పిల్లలు వర్ణిస్తారు. మనకు పరవశత్వాన్ని కలిగించే విషయమేమిటంటే నాల్గవపాదం అయిన తర్వాత దీర్ఘాక్షరాలను మార్చి మార్చి వాడారు. "బా" అన్నదాని $2 \times 4 \times 2$ గుర్వక్షరాలుగా వాడారు —

బా బా - బా బా బా బా - బా బా[1]

— దీని అర్థం 'రా' అని. తరువాతిది 'నీ' అన్నది పై దానిలాగే వాడబడింది. దాని అర్థం 'నీవు' అని. మూడవది 'తే' అని అర్థం ఇచ్చే 'తా' అన్నది. నాల్గవది 'హో' అన్నది. పామును పిలిచి వెళ్ళిపో, ఎవ్వరికీ హాని చెయ్యకు అని చెప్పడమన్నమాట.

"తెంకణగాళియాట" (దక్షిణవుగాలి ఆట) అనే దానితో శైలిలోను, అభివ్యక్తిలోను పోలిక చెప్పగలిగే మరొక రచన వుందో లేదో నాకు తెలియదు. ఇది మరే గీతాన్నయినా ఆధారం చేసుకొని వెలువడిందేమో తెలియదు. గాలి ఏమి చేయలేదు? ఎవరు దాన్ని అడ్డుకోగలరు? శాసించ గలరు? దాని విజృంభణనాపగలరు? అడ్డు, ఆటంకం లేనప్పుడు గాలి ఆడుతుంటే ఆ దృశ్యం మనోహరంగా వుంటుంది. గంతులేస్తూ సాగిన గీతం చివర నృత్యానికి తగ్గట్లే "తై" అనే శబ్దం వాడబడింది —

తెంకణ గాళియు కొంకణనాడిగె
బంతై, బంతై, బంతై ....

మృదుత్వంలో, లయాత్మకతలో, భావుకతలో ఇది సాటిలేనిది. శబ్దమూ భావాలూ పొందికగా కుదిరి దీన్ని ఒక శుద్ధ భావగీతంగా చేస్తున్నాయి. ఇది గంతులేస్తూ మంత్రంలాగా లయాత్మకంగా నడుస్తుంది. ఆయన ఒక మంత్ర గానిలాగా ఈ మంత్రాన్ని అల్లగల్గాడు.

---

[1] గురువన్నంత మాత్రాన ఎల్లవేళలా ఒకటే విధమైన దీర్ఘత వుండవలసిన అవసరం లేదు. ఉదా॥ 'నారాయణ' లో మొదటి రెండక్షరాలలో భేదముంది.

పంజె గీతరచనలలో కొన్ని ఇంగ్లీషు నుంచి, ఇతర విదేశీ భాషల నుంచి అనువాదాలు, అనుసరణలు ఉన్నాయి. అయితే ఏవిగాని మూలానికి ప్రతి పదానువాదాలు కావు. "నది" అనే పేరుగల రచన సంవాదరూపంలోను, వర్ణనాత్మక శైలిలోను ఉంది. నది పుట్టుక, ప్రవహించడం, జలపాతాలు, మలుపులు, లాభాలు మొదలైన వాటిని గురించి ఇది చెప్తుంది.[1] పక్కింటి నుంచి (హొటల్) బావికి నీళ్ళ కోసం వచ్చిన పిల్లవాడికి ముందు దీన్ని చెప్పారంటారు శ్రీమతి అనసూయారావ్. ఈ పాటను గూర్చి చెప్పే ఇతరుల మాటలు కూడా వున్నాయి.

* * *

గీతాలలో నాలుగవ జట్టులో రెండు మూడు విశిష్టమైనవి ఉన్నాయి. "హొలెయర హాడు" (మాలవారి పాట - అప్పట్లో ఇలా అనేవారు, ఇప్పుడు హరిజన్ అంటున్నారు). ఇందులో పల్లవి —

ఉళ్ళయ్యా —[2] దయె - గొళ్ళయ్యా

(ఉన్నయ్యా — దయ — గొనుమయ్యా)

దీని తర్వాత ఉపయోగించిన పదాలు తక్కువతనాన్ని, పీడనను, ద్వేషాన్ని, అనంగీకారాన్ని తెలుపుతాయి :

దట్టిదిక్క ! మారి, ముండ, ముండాల !

హుట్టు హొలెయ ! హొల ! చండ చండాల !

బొట్టె ! బొగ్గరె[3]

పై పదాలు ఆనాటి పీడిత జనాళి స్థితిని, వాళ్ళు పడుతుండిన బాధలను, వాళ్ళకుండిన నిషేధాలను గురించి తెలుపుతాయి. ఇలాగే సాగుతుందీ పాట-

---

[1] దీనికి అత్యంత సుందరంగా సంగీతం కూర్చబడింది. ఫిడేలు సహాయంతో బెంగుళూరు ఆకాశవాణి కోసం శ్రీ కె. ఎస్. కారంత కూర్చారిది. అ టేపుల నేమైనా చెరిపివేసి వుంటే అది నిజంగా చింతనీయమే. ఇలాగే మనం వెస్టరన్ మార్స్ వంటి వాద్యాలపై భారతీయ రాగాలను పలికించగలుగుతున్నాం.

[2] దీన్ని 'ఉల' — 'అయ' అనికూడా వుచ్చరించడం కద్దు. పూర్తిపదం డబ్బుగల మహారాజులను గూర్చింది.

[3] దట్టి దిక్క - గుడిసెలో వుండేవాడా అని అర్థం :
మారి, ముండ, ముండాల — జాతులు ;
హుట్టు హొలెయ - పుట్టుమాల వాడా ;
హొల (తుళు) — 'హో' 'హోరాముండు' అని ;
చండ, చండాల - సంబోధన
బొట్టె, బొగ్గరె — వ్యక్తుల పేర్లు ; బొగ్గరె అంటే కుక్క అనీ అర్థం.

"మీరు మమ్మల్ని అలాంటి పేర్లతో పిలుస్తారు -

– ఎందు హెసరెత్తి కూగి

ముట్టలంజుతె నిల్వె దూరక్కె హొాగి !

– మీరు మమ్మల్ని తాకాలంటేనే భయపడతారు. పొండి దూరంగా. మీకిప్పుడు అన్నీ వున్నాయి: అంతస్తు, గౌరవం, స్వాతంత్ర్యం అన్నీ వున్నాయి. మాకు ఇవేవీ లేవు. మీరే గనుక మమ్మల్ని మరింత దయతో చూస్తే, మమ్మల్ని మనుష్యులలాగా, మానవీయతతో చూస్తే, మీకు యుద్ధాలలో, స్వాతంత్ర్య సంపాదనలో బాసటగా నిలుస్తాము. మీతో సమానంగా భాగస్వాములుగా మమ్మల్ని తీసుకోండి –

నీడణ్ణ ! దమ్మయ్య ! కొడు సరిసాలు !
బేడిదాగలె బిట్టుకొడువుదె మేలు !
బేడ నాం సెళెదు కొంబెవు నమ్మ పాలు !

మాకు ఏది రావాలో అది ఇవ్వండి. మేము మిమ్మల్ని వేడుకున్నప్పుడే మీరు ఇవ్వడం మేలు. లేకుంటే మేము మీ చేతుల్నుంచి బలవంతంగా లాక్కుంటాం. మా జాతిపై వుండే విద్వేషాగ్నిని చల్లార్చుకుంటే మంచిది. మా చేతుల్ని స్నేహ భావంతో గట్టిగా పట్టుకోండి. మా ప్రేమను పొందండి. మిమ్మల్ని మీరు సర్ది చెప్పుకోండి; [1] మా వైపొక చిరునవ్వు చూపండి. హిందువుల దేవత ధరించే అందెను మాకూ సంతోషంగా అందియ్యండి."

అనేక శతాబ్దాల నుంచి పీడితులై వుండిన వారిపై ఆదరణతో రాసిందిది. మరొకటి చాలా కాలం అనామధేయంగా ప్రచారం చేయబడింది. పంజె ప్రభుత్వసేవకుడు కదా ! దానిలో తన తోటి స్త్రీ పురుషులందరికీ నిద్ర లేవవలసిందని, మత్తు వదిలించు కోవలసిందని, బద్ధకం వలదని చెప్తుందిది : –

కిత్తు బిడు సందేహ, ఇట్టు బిడు ధనదేహ
మాతృభూమియ పదార్చనెగె బలవందు ;
"సందేహం వదలు ; వదలివెయి ధనం, దేహం
మాతృభూమి పదార్చనకు నడుం కట్టు."
సత్తితె సాహసవు ? బత్తితె ధృతిరసవు
మత్తె మడిద కర్ణన బెన్న హిందు ?
ఎత్త హొదుదు పరశురామన తోళ్వరిసు ?
నెత్తరొళ గిల్లవె విక్రమద బిందు ?

---

[1] ఒకనాటి అంబేద్కర్, గాంధి మాటలనవచ్చు.

"నీ సాహసం చచ్చిందా? ధైర్యం ఇంకిందా? కర్ణ, పరశురాములను మరచితివా? నీ నెత్తురులో లేదా విక్రమ బిందువు? నీ వేదాంతమంతా నిద్రపుచ్చే ఆట. లే, ఉత్సాహం చూపు. మీరు భారతదేశం కన్నబిడ్డలు. తూర్యరవాన్నివిని కదలండి కదనరంగానికి - నాయకులు విజృంభిస్తారు. భారతానికి అదృష్టకాలం వస్తుంది."

ఇది కేవలం దేశభక్తి గేయం మాత్రమే కాదు; ఇది ప్రబోధం.

దేశాభివృద్ధిని, స్త్రీ పురుషులను, కొడగు జీవితాన్ని గూర్చి రాసిన ఒక పద్యాన్ని గూర్చి చెప్పి దీన్ని ముగించవచ్చు. అన్ని మంచి కవిత్వాలలాగే, "దక్షిణపు గాలి" వంటిదే "హుత్తరి హాడు." దీన్ని మరొక భాషకు అనువాదం చెయ్యడానికే వీలుకాదు. మూడు పాదాలలో భావం, చివరి పాదంలో మకుటం వుంటాయి. ఇది రాగయుక్తంగా పాడదగింది. ఇది 'ఓడ్' లాంటి కీర్తన. ఇది ఎటువంటి గద్య పద్య రచనకూ తీసిపోదు. దీని నాదత, యతి ప్రాసలు, ఇవన్నీ తెలుసుకుంటే గాని అసలర్థం బోధ పడదు. 'హుత్తరి' అన్నది పంటకు సంబంధించిన పండుగకు సంబంధించిందనిపిస్తుంది. స్త్రీ పురుషులు ఒక చోట చేరి పాడుతూ, ఆడుతూ గడుపుతారు ఆదిమ జనులు రంగు రంగుల దుస్తులు ధరిస్తారు. ప్రత్యేకమైన తలపాగా ధరిస్తారు. ఈ ఆటపాటలప్పుడు అందమైన స్త్రీలు, రంగులదుస్తులు ధరించిన సాహసవంతులైన పురుషులు, స్త్రీలు పాల్గొంటారు. ఈ పాట సౌందర్యాన్ని, ప్రగతిని సూచిస్తారు. దీన్ని చదివినవారెవరైనా ఆనందపరవశులు కాక తప్పదు. చివరి మూడు పాదాలలో వుండే భరతవాక్యం అందరికీ నచ్చేది -

"శాంతి సౌఖ్యాలతో
తల్లి ఒడిలో విశ్రాంతి తీసుకో;
మన కొడగు చిరకాలం యశస్కరమై వుండనీ."

ఇంకా ఇలాంటివి మరికొన్ని వున్నాయి. ఇవి ఐతిహాసిక, పౌరాణిక నాయకులను గురించి, కవులు, కావ్యాలను గురించి, కన్నడిగుల సౌభాగ్యం, సాధనాలను గురించి తెలుపుతాయి. ఈనాటికీ వీరు భారతదేశ పటంలో ప్రత్యేకతను సంపాదించుకోలేక రాజ్యాంగ బద్ధమైన గుర్తింపు వున్నా. బహుశా వాళ్ళు ముందడుగు వేసి వెళ్ళరు. వాళ్ళ నెవ్వరూ ప్రమాదకరమైన వాళ్ళుగా భావించరు. అందువల్ల కన్నడిగులంటే ఒక విధమైన ఉదాసీన భావం ఉంది. పంజెకు ఈ విషయాలు తెలుసు. అందువల్ల శతాబ్దాలుగా శాంతి కాముకులూ, సామరస్యాన్ని కోరేవాళ్ళేకాని దురభిమానం లేని వాళ్ళయిన కన్నడిగులను గురించి చెప్పారు. అయితే అక్కడక్కడ తప్పులు లేకపోలేదు. మనుష్యులు మనుష్యులే కదా. సీత చెప్పినట్లు: 'న కశ్చిత్ న అపరాధ్యతి.

## IV

# పంజె వ్యక్తిత్వం - ఆయన కుటుంబం

పంజె వ్యక్తిత్వం, గుణగణాలు తెలియజేయడానికి ఇంట్లో ఆయన భార్యతో, పిల్లలతో వర్తించిన తీరును గురించి ఇక్కడ చెప్తాను. ఆయన స్నేహితులు, అభిమానులు చెప్పిన ఆయన అలవాట్లు, వ్యక్తిత్వం గురించిన రేఖాచిత్రాలను ఇవ్వవచ్చు. పంజె అంత పొట్టిగాకుండా, పొడుగూగాకుండా, మంచి ఛాయతో అందంగా వుండేవాడు. ఆయన మాట్లాడుతున్నా, తిరుగుతున్నా వుత్సాహం నిండి వుండేది. విశాలమైన నుదురు, వెండివంటి మీసాలు ఆకర్షణీయంగా వుండేవి. ఎప్పుడైనా ఆయన ఏదైనా ఒక ముఖ్యవిషయం చెప్పాలనుకున్నా, ఏదైనా సంతోషాన్ని వ్యక్తం చేయాలనుకున్నా మీసాలను చప్పరిస్తూ పెట్టే భంగిమ మరువరానిది. ఎవరైనా స్నేహితులను చూచి ఆయన చేస్తున్న పనులను గురించి, భావి ఆలోచనలను గురించి చెప్పాలని వుబలాటపడేవారు. అలా వ్యక్తులను కలుసుకోడమంటే బాలా ఇష్టమాయనకు. ఆయన ఎప్పుడోగాని కోటు వేసుకునేవారు కారు. బయటికి వచ్చినప్పుడు నిల్లువంగీ ఒకటి ధరించేవారు. ఇంట్లో వున్నప్పుడు బనియన్ వేసుకునేవారు; లేకుంటే వక్షస్థలంమీద ఏమీ కప్పుకోకుండా వూరికే వుండేవారు. వరండాలో మామూలుగా కూర్చునేవారు కాదు. పొగపీలుస్తూనో, లేకుండానో అటూ ఇటూ పచార్లు చేస్తుండేవారు. ఆయన అభిమానం, ఆతిథ్యం అడ్డుకోలేనివి. నేనొకమారు అతిథిగా వెళ్ళినప్పుడు ఆయన కొడుకులలో ఒకరుకూడా ఇంట్లో ఉన్నారు. భోజనం అయిన తర్వాత కుమారునితో ఆయన భార్యతో గూడా వెళ్ళి మామగారింట్లో వుండవలసిందిగా చెప్పారు. ఎందుకంటే నా కోసం గది ఖాళీ చేయడానికి! 'మంగళూరులో మేము మంచి రొట్టెలు తయారుచేస్తాము' అని నేను ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు ఒకసారి ఆయన ఒక డబ్బానిండా రొట్టెలు, మంచితేనె, మంచి విలువైన జాం ఇచ్చి పంపించారు. ఆయన పిల్లలతో, ఇతర కుటుంబ సభ్యులతో, మరెవరితో మాట్లాడినా సరే నేరుగా, సరళంగా, ఛలోక్తులతో, మాట్లాడేవారు. అంటే మౌనంగా వుండరని కాదు. ఆయన పద్యసంపుటాన్ని ఒకదాన్ని గురించి నన్ను మాట్లాడనివ్వలేదని చెప్పానొకసారి. ఆయన కుమార్తె అలా ఏమైనా ఆయనకు సన్మానాదులు చేయదలచుకొని వుంటే తన తండ్రి పారిపోయి వుండేవారని

చెప్పింది. అయితే ఎవరికీ తెలియని ఒకవ్యక్తి రాసిన కవిత ఒకటి బాగుంటే, దానికోసం నిలబడి, ఆయన దాన్ని ప్రశంసించే తీరును చూస్తే ఆశ్చర్యం కలిగేది. రాయచూరులో మన్విగారి కవితకు ఇట్టి ప్రశంసే లభించింది. మొదట ఆయన తన అసమ్మతిని తెలుపుతున్నారని అందరూ అనుకునేవారు. కాని ఆ అసమ్మతి దాన్ని ప్రశంసించలేని వాళ్ళను గురించి. త్వరలోనే అందరూ అసలు విషయం తెలిసి నవ్వుకునేవారు. ఆయన్ను గురించి బాగా తెలియని వాళ్ళు ఇదేదో తుంటరిచేష్ట అనుకునేవారు. అయితే ఆయన హృదయ పూర్వకంగా, గౌరవాన్వితంగా ప్రశంసించేవారు. ఆయన్ను అడ్డుకోడం ఎవ్వరితరమూ అయ్యేది కాదు. ప్రతిస్పందన అన్నది వుండాలి గాని ఆయన ఎవరి హృదయాన్నయినా ఇట్టే గెలుచుకునేవారు.

ఇంటా బయటా చెప్పేదేమిటంటే ఆయన ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడంలో బద్దకించేవారని. అందువల్ల ఆయనకు వచ్చే ఉత్తరాలుగాని, ఆయన్నుంచి వెళ్ళేవి గాని తక్కువగా వుండేవి. ఆయన అరుదుగా జాబులు రాసేవారు, అదీ చాలా జరూరైన ఇంటి వ్యవహారమైతే. ఎక్కువగా పోస్టు కార్డులో రాసేవారు. * ఆయన కొడుకు గోపాలరావు హైదరాబాదులో ప్లీడరుగా స్థిరపడతానని రాసినందుకు (1930) పంజె రాసిన ప్రత్యుత్తరమిది:

"మొదట నీ ఆరోగ్యం బాగా చూచుకో. డబ్బు దగ్గర చూడవద్దు. రెండవది, నీకేసులను బాగా పరిశీలించి చూచుకో. కోర్టులో తప్ప మరెక్కడా వాటిని గూర్చి మాట్లాడవద్దు. నీక్లయింటుకు ఎప్పుడూ సమీపంగా వర్తించు, అతన్ని గురించిన తత్తర బిత్తర పనికిరాదు. అతని కథను పూర్తిగా విను. అతని ప్రశంసను పొందడానికి ఎప్పుడూ ప్రయత్నించు. లంచాలిచ్చి కేసులు గెలవడానికి ప్రయత్నించవద్దు. దుర్బోధలు చేసి సాక్షులను పెట్టవద్దు. అన్యాయానికి పాల్పడవద్దు. మొదట నీవు చేయవలసింది ప్రామాణికతతో మెలగడం, పేరు పొందడం. నీకే మాత్రం ఒకగంట వీలు దొరికినా చట్ట సంబంధమైన పుస్తకాలను తిరగేస్తూ వుండు. ఈ విధంగా చేస్తే నీవు మరో మూడు సంవత్సరాలలో గొప్ప వాడివవుతావనడంలో నాకు సందేహం లేదు. నీ భార్య నీతో వుండాలనుకుంటే పిలుచుకు వెళ్ళు. మీ అమ్మను కూడా కొంతకాలం నీదగ్గర వుంచుకో. నా పెన్షన్‌తో నీ ఇల్లు గడుపుకోవచ్చు".

కోడలు శ్రీమతి మీరాగోపాలరావుకు ఆయన ఈ క్రింది విధంగా వ్రాశారు:

"…. ఆ వేళకు మీరిద్దరూ సంగీతంలో ఎంత అభివృద్ధిని సాగించగలరు? తరచుగా అధ్యాపకుడు రాకపోవడంవల్ల ఈమధ్య మీ అభ్యాసం

* అప్పట్లో మైసూరునుంచి రాసిన కొన్ని ఉత్తరాలు ఉన్నవి.

కుంటుబడింది. అభివృద్ధి తక్కువయింది. మీకు రెండు 'తాళా' లైనా తెలిసాయని తెలిస్తే, మీరు సరిగ్గా పాడగలరని, ఏకకాలంలో గొంతు కలప గలరని తెలిస్తే సంతోషిస్తాను. నీవు, శాంత పాట నేర్చుకోడం నీభర్తకు తృప్తికరంగావుందా? చిత్రకళా తరగతిని గురించి నీవు రాసిన సంగతుల్ని గమనించాను. నీవు ఆ పాఠాలను ఇంకా సాగిస్తూవుంటే నాకు సంతోషమే. లేకుంటే దాన్ని వచ్చే జూలైవరకు వాయిదావెయ్యి. అప్పుడు నీకు బాగా విరామం దొరుకుతుంది. త్వరగా నేర్చుకోవచ్చు. నేను ఎవరైనా చిత్ర కళోపాధ్యాయుడు దొరుకుతాడేమో, ఆయన చెప్పేవిషయాలు నీకు వుప యోగిస్తాయేమోనని చూస్తూవున్నాను. అయితే ఎవరూ దొరకలేదు ....."

"నీభర్త కారు కొనేలోపల నీవు నడపడం నేర్చుకోవాలన్నదే నా అభిప్రాయంకూడా. నేను చేసిన వుపాయం ఇది. ఎందుకంటే నీవు ఇన్ని పనుల మధ్య ఎలాగూ కారు నడపడం నేర్చుకోలేవు. నాడబ్బు నాదగ్గరే వుంటుంది. నీభర్త దగ్గరకు చేరదు. నీపనులు ఎన్నో: వంటచేయడం, పనివాళ్ళను అజమాయిషీ చేయడం, కూరగాయలు తేవడం, తార, శాంతలను చూచు కోవడం, గోపాల్ విషయాలను గమనించడం, లెక్కలు చూచుకోడం, ఉత్తరాలకు ప్రత్యుత్తరాలివ్వడం, అతిథులను ఆహ్వానించడం, ఇంకా ఎన్నెన్నో. నీవు ఇంక ఎప్పుడు ఇంగ్లీషు భాషాజ్ఞానాన్ని ఎక్కువ చేసుకోడం, సంగీతం నేర్చుకోడం, టైప్‌రైటింగ్ ప్రాక్టీస్ చేయడం, కన్నడం చదవ డాన్ని బాగా నేర్చుకోడం, చిత్రకళ తెలుసుకోడం. షెర్లాక్‌హోమ్స్‌వి ఎన్నికథలు నీవు మళ్ళీ చదివావు? కొత్తవి ఎన్ని చదివావు?"

1918 లో ఆయన పెద్దకూతురు చనిపోయింది. మంగళూరునుంచి కె.ఎన్. ఉపాధ్యాయ అనే ఆయన వ్రాసిన సంతాపలేఖకు జవాబుగా ఈ క్రింది జాబువ్రాశారాయన: (ఈ వుత్తరం కన్నడంలోవుంది. దాని అనువాదం కొంత ఇక్కడ ఇవ్వబడింది) —

"..... అకాల మరణంవల్ల నాకు కలిగిన దుఃఖాన్ని ఎంతోమంది స్నేహితులు రాసిన వుత్తరాలవల్ల తగ్గించుకోగలిగాను. జీవనమూ, మర ణమూ మనిషికి సహజమైనవే. చెట్టునుంచి పళ్ళు క్రిందికి రాల్తాయి, ఇది ప్రకృతి న్యాయం. ఎవరైనా పండు కాకముందే తుంచివేస్తే ఆబాధ చెట్టుకే తెలుస్తుంది. ఇతరులు దాన్ని అర్థంచేసుకోలేరు . . . అన్నిశాస్త్రాలూ పుట్టిన వాళ్ళు గిట్టకతప్పదని చెప్తాయి. ఒకసారి చనిపోయినవారు మళ్ళీ జన్మిస్తారా లేదా అన్నదాన్ని గురించి వాదోపవాదాలున్నాయి.

"చావు వస్తుందని మనుష్యులు తమ తమ కర్తవ్యాలను మరిచి పోకూడదు. తమ జుట్టును చావు చేతికి అందివ్వకూడదు. దానికి ముందే దేశానికి, సమాజానికి చేయగలిగిన సేవ చెయ్యాలి. బోధకులు ఈవిషయాలను

చెప్పడం తమ కర్తవ్యంగా భావించి తమ జీవితాలను కర్తవ్య నిర్వహణకు ధారబోసేట్లయితే చావు ఇంత భయంకరంగా కనిపించదు, ఇంత దుఃఖాన్ని కలిగించదు . . . . ."

*　　　*　　　*

ఆయన ముగ్గురు కుమారులలో ఇద్దరు ఇప్పుడు లేరు. రెండవ కుమారుడైన గోపాలరావు లీగల్ ప్రాక్టిషనర్‌గా, జిల్లా న్యాయాధీశులుగా హైదరాబాదులో పనిచేసి, బహుశా లీగల్ రిమంబ్రెన్సర్‌గా హైదరాబాదు ప్రభుత్వంలో పనిచేశారనుకుంటాను. ఆయన అన్నివిధాలా కళాకారులని పించుకున్నారు. పంజె పిల్లలందరిలాగే మంచి రసహృదయులు. ఒకసారి తమ తండ్రిగారి పాటలెత్తుకున్నారంటే ఒళ్ళు మరుస్తారు. మూడవ కుమారులు శతజయంతి ఉత్సవానికి కొంత ముందుగా క్రూరమైన బస్సు ప్రమాదంలో చిక్కుకొని మరణించారు. ఆయన తమ తండ్రిగారి అన్ని రచనలను, ఓరియంట్ లాంగ్‌మన్స్‌వారు ప్రచురించిన నాలుగు సంపుటా లలో సేకరించారు. అవి బృహత్సంపుటాలు కాకున్నా పంజె విలువను, వైవిధ్యాన్ని తెలిపేవి. ఈ కుమారుడు రామారావు పంజె. ఆయన చక్కెరకు సంబంధించిన రసాయన శాస్త్ర సాంకేతిక నిపుణులుగా వుండేవారు. ఇన్‌స్టి ట్యూట్ ఆఫ్ షుగర్ టెక్నాలజీకి డైరెక్టరుగా కూడా పని చేశారు. పాశ్చాత్య సంగీతపు మెళకువలు తెలుసుకున్న వారాయన. మొదటి కుమారులైన ముకుందరావును నేను ఒకటి రెండుసార్లు కలిసాను. శతజయంతి వుత్సవంలో ఆయన కూతురితోబాటు వేదికనెక్కి తమ్ముడైన గోపాలరావుకు తమ తండ్రిగారి పాటలను పాడడంలో సహాయంచేస్తూ తండ్రిని తలచుకొని విలపించారు. ఉక్కు కర్మాగారంలో ఇంజనీరుగావున్న ముకుందరావుగారికి తండ్రిమీద ఎంత అభిమానమున్నదీ వ్యక్తమయింది. ఆయన వద్దనుంచి, బొంబాయిలో వున్న పంజె కుమార్తె శ్రీమతి అనసూయ ఆర్. రావు వద్ద నుంచి, శ్రీమతి శాంత రామేశ్వరరావు (సికిందరాబాదు) వద్దనుంచి సేక రించిన సమాచారంతో పంజె అలవాట్లు కొన్నిటిని, గుణగణాలను తెలుసు కోడానికి వీలయింది.

## గుణగణాలు :

ఎప్పుడూ ప్రేమతో, హాస్య ప్రవృత్తితో మెలగుతుండిన పంజె మరణం వల్ల ఎటువంటి నిధిని కోల్పోయిందీ ఆయన పిల్లలకు తెలుసు. జీవితంలోని దౌర్భాగ్యం ఏమిటంటే ఒకవస్తువు విలువను మనం అది లేనప్పుడు గాని, దాన్ని పోగొట్టుకున్నప్పుడు గాని తెలుసుకోలేము.

పంజెకు వుండిన మానవీయ దృక్పథం, విశాలహృదయం గురించి మనకు తెలుసు. ఏదైనా ఒకపనిని పూర్తిచేయడంలో ఆయన శ్రద్ధ, పిల్లల విద్యను గురించిన శ్రద్ధ, ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుల జీవితాన్ని మెరుగు పరచడానికి చేసిన కృషి, విద్యారంగాన్ని, సృజనాత్మక సాహిత్యాన్నీ పెంపొందించడానికి పడిన శ్రమ మనకు తెలుసు. సామాజిక సేవలో మునిగిన ఏ మనిషైనా సరే తన స్వంత కుటుంబ విషయాలను పట్టించు కోవడం కష్టమవుతుంది. కన్నడంలో ఒక నానుడివుంది. "వీరసెట్టి పట్టణాన్ని గురించి చాలా పట్టించుకుని బీదవాడయ్యాడు" అని. నిజానికిది ప్రశంసనీయ మైన పనే. 'గొల్లవారి పిల్లలకు పాలులేవు' అంటారు. ఆయన ఇంట్లో వున్నప్పుడు ఎప్పుడైనా సరే పిల్లలకు చాలా సంబరంగా వుండేది. ఆ కుటుంబంలో పెద్దదిక్కయిన ఆయన భార్య నెమ్మదైనది, సేవాభావం కలది. కుటుంబమంటే ఆదరణ, అభిమానాలుకలది. భార్యగా, తల్లిగా ఎలావుండాలో అలా మెలిగేదామె. ఇల్లు చూచి ఇల్లాలిని చూడమన్నారు. ఆమె ఇంటికి వచ్చిన అతిథినిగాని, అతిథుల్నిగాని ఎంత ఆప్యాయతతో చూసేదో ఆమె ఇంటికి వెళ్ళిన ప్రతి ఒక్కరికీ తెలుసు. అతిథి మర్యాద ఆమె ఎలా జరిపేదని తర్వాత చెప్తాను. పురోహితుల ఇంట్లో పుట్టినా కూడా పంజె ఆలోచనాపరుడు, వివేచన కలవాడు కావడంచేత సామాజిక, మతసంబంధ విషయాలలోని బలాన్నీ, బలహీనతల్నీ కూడా చక్కగా అవగాహన చేసుకున్నాడు. 'వాళ్ళ జాతిలో ఇతరులలో అన్నివర్గాల వాళ్ళలో లోటుపాట్లను తెలుసుకున్నాడాయన' సామాజిక సమస్యలనబడేవి చాలావరకు బ్రాహ్మణజాతికి సంబంధించినవి. ఎప్పుడూ చురుకుగా వుండే ఆయన మనస్సు అనేక మతాచరణాల, అలవాట్ల వెనుకవున్న సామంజస్యాన్ని గురించి యోచించేది. ఇంగ్లీషు సాహిత్యంతో ఆయనకున్న పరిచయం, మొత్తంమీద విద్యా విషయాలతో ఆయనకున్న సంబంధం, బోర్న్ ఏట్స్, లిటిల్ హైల్స్, బాసెల్ మిషన్‌లో క్రిష్టియన్ మిషనరీలు మొదలైన వాళ్ళతో వున్న సంబంధం ఆయన బుద్ధిని నిశితం చేశాయి. మత, సామాజిక, సాంస్కృతిక విషయాలలో కొత్త ఆలోచనలను రేకెత్తించాయి. రూపం కంటె సారమూ, మాటకంటె దాని అంతరార్థం ఎప్పుడూ ఆయనను ఆకర్షించేవి. అలానే ఆయన పగలు, రాత్రి గడిపారు, మనుషుల మధ్య మెదిలారు. ఆయన తమకుమారునికి ఎలా ఉపనయనం చేసిందీ శ్రీముకుంద రావుగారే స్వయంగా ఇలా వివరించారు :

"కాసరగోడులో ఉన్నప్పుడు ఒకనాటి సాయంకాలం మా తల్లిగారికి మాకు మరునాటి పొద్దున్నే స్నానం చెయ్యవలసిందని, ఫలహారం ఏమీ సేవించవద్దని ఆయన చెప్పారు. ఈ మార్మికమైన ఆజ్ఞలు ఎందుకు

చేస్తున్నారా అని మాకు అర్థం కాలేదు. నా కప్పుడు తొమ్మిది ఏళ్ళు. అది బహుశా 1911 వ సంవత్సరం. మా అమ్మకూ ఏ విషయమూ తెలీదు.

మరునాటి వుదయమే దేవాలయం పురోహితుడు తన వస్తువులన్నీ తీసుకొని వచ్చాడు. అమ్మ, నాన్న పురోహితుడితో బాటు పీటలమీద కూర్చొన్నారు. నన్నొక పట్టువస్త్రం కట్టుకొని కూర్చోమన్నారు. నాకు వాళ్ళు పవిత్ర దండమూ, యజ్ఞోపవీతమూ ఇచ్చారు. నాన్న గాయత్రీమంత్రాన్ని ఉపదేశించారు. వేదమంత్రార్థాన్ని సరళభాషలో వివరించారు. పురోహితుడు ఈ సరళతను చూచి ఆశ్చర్యపోయాడు. ఎలాగో మొత్తానికి ముగించాడు. ఏవిధమైన లాగుడు బేరంగాని, ఖర్చుగాని, ఆడంబరంగాని లేదు. అయితే చక్కని అంతరార్థం మాత్రం వుండింది. ఉపనయనం సరళంగా, త్వరగా, ఖర్చు లేకుండా, సులభంగా జరిగింది. ఇంతే సరళంగా ముకుందరావుకు ఉళ్ళాల్ మంగేశరావుగారి ముద్దుకుమార్తెతో వివాహం చేశారు. ఉళ్ళాల్ పంజెతో కలిసి ఉన్నత ప్రాథమిక పాఠశాలలో పని చేశారు. బాలసాహిత్య మండలిని స్థాపించడంలో సహాయం చేశారు. "ఉళ్ళాల్ మంగేశరావు తమ్ముడి కూతురు నాభార్య. నాకోసం ఆమెను నాతండ్రి మాట్లాడారు. నా ఉపనయనంలాగే కట్నంలేదు, తగూలు, తంటాలు, ఆడంబరాలు ఏమీ లేవు. సరళమైన వివాహం, ఇలాంటి సంస్కరణలను గురించి నాన్న చాలాకాలం క్రితమే ఆలోచించారు. 50 సంవత్సరాల తర్వాత ఇప్పుడు శాసనాలను ప్రవేశపెడుతున్నారు...."

ఇంట్లోపూజ, వ్రతాలు వగైరా శ్రీమతి పంజె అదుపులో వుండేవి. ఆమెను, ఆమె పూజలను చూడవలసిందేగాని, అవి వినవచ్చేవి కాదు. అయినా శ్రీమతి అనసూయ ఆర్. రావ్ ఉత్తరంలోని భాగాలు ఆయన భక్తి సరళమైనదయినా ఎంత ప్రాథమికమైనది, సంపూర్ణమైనది అన్నదాన్ని తెలుపుతాయి :

"ఆయనకు దేవునిపై నమ్మకమున్నది. అయితే కర్మాచరణలో కాదు. ఇంట్లో మూఢనమ్మకాలు చోటు చేసుకునేవి కాదు. ఇంట్లో ఆయన పూజ అన్నది చాలా విరళంగా చేసేవారు. అదంతా మా అమ్మ విభాగం. ఆయన ఎప్పుడూ శ్రావ్యంగా పాటలు పాడుకొనేవారు. ముఖ్యంగా పురందరదాసకీర్తన ("కణ్ణివ్యాతకో" – 'ఈ కళ్ళెందుకో ?' – ఆయన కిష్టమైంది), భగవద్గీత, లేక కొన్ని వేదమంత్రాలు, లేక 'భజగోవిందం' పఠించేవారు. దేవుడిని

[1] ఇబ్సెన్ రాసిన "ఎనిమి ఆఫ్ ది ప్యూపిల్", "డాల్స్‌హౌస్" అనే రచనల అనువాదకులుగా, "పర్సన్", "ఫుల్‌ఫిల్‌మెంట్" అనే కైలాసం రచనల అనువాదకులుగా నేను ఉళ్ళాల్‌ను ఎరుగుదును. ఆయన తనదే అయిన రీతిలో ఒక సాహిత్యవేత్త అనే విషయంలో సందేహంలేదు. ఇద్దరూ కవలల్లా జీవితం గడిపారు. నేను ఆయన్ను ప్రశ్నించాను.

గురించిన ఆయన భావన, జీవనయాత్రను గురించి అభిప్రాయం 'నంజెయ హాడు' (సంధ్యాగీతం) అన్నదాంట్లో 'ఎంటు బేడరు' (ఎనిమిది నిషేధాలు) అనే వాటిల్లో వ్యక్తమయింది. ఆయనకు ప్రీతికరమైంది మరొకటి 'అణురేణుతృణ కాష్ఠదలి చరిసుతిహెను, కణ్ణుగళను తెరెదవర్గె గోచరిసుతిహెను....' - అణురేణుతృణకాష్ఠములలో చరిస్తాను, కళ్ళు తెరిచిన వారికి కనిపిస్తాను....).

## భార్యతో, పిల్లలతో

ఆయన ఉనికి ఇంటిని మాధుర్యంతో, కాంతితో నింపేది. ఇల్లు కళ కళలాడుతూ, ఉత్సాహంగా ఉండేది. ఆయన ఎక్కడవున్నా, తిరిగినా నృత్యం, పాట, మాట, ఆట, చిన్నకథలు నిండి వుండేవి. ఎంతో మత విశ్వాసం వున్నవారిలాగా మాట్లాడేవారు, అయితే విశ్వాసాన్ని గురించి స్పష్టమైన ప్రకటన చేసేవారు కారు. ఆయన సోదరుడు చనిపోవడం కొంత కాలం ఆయన్ని మనస్థైర్యం కోల్పోయేట్లు చేసింది. పంజె తన పెద్ద కుమార్తెను, ఒక కొడుకును పోగొట్టుకునేసరికి హృదయానికి బలమైన దెబ్బ తగిలింది. లాలిపాటలు, సంతోషగీతాలు మొదలైనవి అనేకం చాలా వుత్సాహకరంగా వుండేవని, కథలు ఆసక్తికరంగా వుండేవని పిల్లలు అనేవారు. 'నది' అనే పాటను ఆయన ఏ విధంగా రచించిందీ చెప్పే రెండు వివరణలున్నాయి. అది ఏవిధంగా రూపమెత్తినా, ఆ పాట చాలా సహజమైనదని, అందరినీ ఆకట్టుకొనేదనీ మాత్రం చెప్పవచ్చు. అది ఎలా వుట్టిందని చెప్పే రెండు వివరణలూ ఆసక్తికరమైనవే. అయినా అవి మనకు అక్కరలేదు. రామారావుగారి రచనవల్ల నాగుబాము‌ను గురించిన పాటను కాసరగోడులో ఇంట్లో రచించినట్లు తెలుస్తున్నది. దొమ్మరివాళ్ళు, జానపద వృత్తులవాళ్ళు, గాయకులు అన్నిరకాల మనుషులనూ ఆయన ఆహ్వానించే వారు. ఆయన అన్నివిధాల రచనల సృష్టిలోను ఆసక్తి ఉన్నవారు కావడం చేత ఇలా చేసేవారు. పాఠశాలల పర్యవేక్షణాధికారిగా ఆయన తమ కర్తవ్యాన్ని దృఢంగా నిర్వహించేవారు. కేంద్రీయ ఉన్నత పాఠశాల (మడికేరి) ప్రధానోపాధ్యాయుడుగా అందరితో మంచిగా మెలిగారు. ఆ గౌరవాన్ని నిలబెట్టారాయన. ప్రత్యక్ష విద్యావిధానాన్ని ప్రచారం చెయ్యడానికి, జిల్లా స్థాయి విద్యావిధాన వాతావరణాన్ని బాగుచెయ్యడానికి ఆయన చాలా కృషిచేశారు. వ్యక్తిగా ఆయన అందరికీ అందుబాటులో ఉండేవారు. కనికరంతో, సహాయకులై వుండేవారు. 'అందరికోసం చిరునవ్వు, అందరికొక ఆశాకిరణం' కలిగి వుండేవారు. ఆయన పిల్లలకు కూడా ఇటువంటివే పంజె జ్ఞాపకాలున్నాయి; ఆయన వారితో చిన్నప్పుడు

గడిపిన క్షణాలు కొద్దిగానే వున్నా. ఆయన ఇద్దరు కూతుళ్ళు ఇంట్లో పంజె వర్తనను గురించి చెప్పిన వృత్తాంతం ఇలా వుంది :

"ఆయన ఇంట్లో ఎప్పుడోకాని కనిపించేవారు కారు. అయితే ఉన్నప్పుడంతా మాతో చక్కగా కలిసి మెలిసి వుండేవారు. హృదయ పూర్వకంగా ఛలోక్తులు విసిరేవారు. మేము ఆడుతుండిన దాగుడుమూతల్లో, సమస్యల్లో, పొడుపుకథల్లో, సామెతల్లో పాల్గొనేవారు. ఆయన ఇంటికి రాగానే పాటలు, తమాషాప్రారంభమయ్యేవి. మామూలుగా జరుగుతుండిన దైనికవ్యవహారాలే ఈ విధంగా కొన్ని పాటలకు స్ఫూర్తినిచ్చాయి. ఉదా. "ఎల్లింద బరుతీయె, నీరన్ను తరుతీయె' అన్నదాన్ని పక్కనే వున్న ఒక హెూటలు పిల్లవాడు మా ఇంటి బావిలో నీళ్ళుతోడడానికి వచ్చేసరికి చెప్పింది. 'అంగళ – డుగ్గు' అన్నది ఒక ముసలి పనిమనిషి (పేరు డుగ్గు) ని గూర్చినది. ఆమె కూడా హెూటలు నుంచి వచ్చి పాత్రలు కడుగుతుండేది. ఆమె చాలా తమాషా మనిషి. 'కోటి – చెన్నయ' ను గూర్చి ఆమె కొత్త వృత్తాంతాన్ని చెప్పింది .... ."

"మేము ఆయనతో మాట్లాడేటప్పుడు పూర్తి స్వాతంత్ర్యం వహించేవాళ్ళం. ఆయన్ను విమర్శించే వాళ్ళం కూడా. మేము చెప్పిందే నిజమైతే ఆయన తప్పు ఒప్పుకొనేవారు. అంతేకాక చిన్నదైన శాంతను కూడా మన్నించ మనేవాడు. అలానే మేము కూడా ఆయనకు చాలా గౌరవాన్ని ఇచ్చేవాళ్ళం, ఆయనంటే భయపడేవాళ్ళం. అప్రామాణికతను ఆయన సహించేవారుకారు. అసత్యం, కపటవర్తనం, ఆడంబరం, ప్రదర్శన ఆయనకు గిట్టేవికాదు. మమ్మల్ని అమ్మ ఆభరణాలతో, బంగారంతో, విలువైన దుస్తులతో అలంకరిస్తే అంగీకరించేవారు కాదు. ఆయన ఏమని వాదించేవారంటే 'ఇలాంటివన్నీ లేని అభాగ్యులైన పిల్లలు వీటిని చూచి ఎంత బాధ పడతారో నీకు తెలీదు' అని. అలాగే, పనివాళ్ళను శాసించడమంటే ఆయనకు నచ్చేది కాదు. మేము 'మాడు' (చెయ్యి) అని చెప్పకూడదు. 'మాడ్తీయా ?' (చేస్తావా) అని చెప్పాలనేవారు. మేము అన్నం తినేటప్పుడు ఇదనీ అదనీ చెప్పడం, తప్పుపట్టడం చేయకూడదు." (శ్రీమతి అనసూయా రావు)

* * *

"ఆయన (మానాన్న)ను గురించిన మొదటి జ్ఞాపకాలు పాటలకు, నృత్యాలకు, కథలకు, కళలకు సంబంధించినవి. ప్రతిదానికీ ఒక్కొక్క పాట వుండేది. ప్రతి దానిలోను సంతోషం వుండేది. నన్ను త్వరగా రమ్మని పిలుస్తూ పాడింది జ్ఞాపకం వుంది – "మగు, ఇల్లిబా, బేగబా" (అమ్మ,

ఇలారా, త్వరగారా), నేనూ పరుగెత్తూ వెళ్ళి ఏం కావాలో అడిగేదాన్ని. ఆయన ఒక పూలరేకుమీద మంచు బిందువును చూపేవారు. మరొకసారి మబ్బు ఆకారాన్ని, ఇంకోసారి నీడను.... ఆయన గొంతులోని ఆ వేగం, జీవంతమైన ఉత్సాహం ఇవన్నీ ఆయన్ను ప్రత్యేక వ్యక్తిగా నిలబెట్టేవి. చాలామంది అసలు బాగా గమనించరు. గమనించినా ఏదిగాని చాలా జరూరుగా జరగాలని, ముఖ్యమైనవని అనుకోరు. . . . . ."

"ఆయన పాఠాలు ప్రత్యేకమైనవి. ఆయనొక సృజనాత్మక ఉపాధ్యాయుడు. ఎప్పుడూ ఆయన బోధనలో జీవం తొణికిసలాడుతుండేది. జామెంట్రి చెప్పినా, ఇంగ్లీషు వ్యాకరణ నియమాలు చెప్పినా, మరేది చెప్పినా అంతే. పాఠశాల ఉపాధ్యాయులు నేను లెక్కలలో మొద్దునని చెప్పినా, ఆయన నాకు దాన్ని బాగా బోధించారు. ఆయన బోధించడం ఎక్కడ నేర్చుకున్నారు?"

"ఆయన సృజనాత్మక శక్తి, అసాధారణమైన తెలివి, విషయంపై ఆయన ఆసక్తి, పిల్లలపై ప్రేమ, మానవీయత - ఇవన్నీ చేరి ఒక గొప్ప ఉపాధ్యాయుణ్ణిగా తయారుచేశాయి. మేము కలిసి బోలెడంత చదివాము - నేను ఇంగ్లీషు బిగ్గరగా చదివేదాన్ని. ఆయన వరండాలో తిరుగుతూ మంచి కన్నడంలోకి అనువదించేవారు, మా అమ్మ వింటూ వుండేది. అవన్నీ సుందరమైన దినాలు. మేము కలసి ఎన్నో పాడేవాళ్ళం. నేను చాలా కృతజ్ఞతతో బాగా జ్ఞాపకం పెట్టుకున్నది ఆయన అర్ధరాత్రి తర్వాత లేపి 'దశావతారం' బయలాటకు ఎక్కడికో తీసుకొని వెళ్ళడం. నేను నిద్రమత్తుతో నడవలేకపోతే ఒక్కొక్కసారి నన్ను ఎత్తుకొని తీసుకొని వెళ్ళేవారు. ఆయన నాటకీయమైన చిత్తవృత్తి కలవారు. మేము అక్కడినుంచి వచ్చిన మరునటి దినం చూచినదంతా మళ్ళీ అభినయించే వాళ్ళం. ఇప్పటివరకు కూడా ప్రదర్శన కళలమీద నాకు అభిమానం మాసిపోలేదు. నన్ను హరికథలకు, బయలాటలకు, కొన్నిసార్లు సినిమాలకు కూడా తీసుకొనిపోతుండిన నాన్నగారికి నేను ఎంతో కృతజ్ఞురాలిని. ఆసక్తికరమైన అనేకవర్గాల జనులు ఆయనతో మాట్లాడడానికి వచ్చేవారు. ఎప్పుడూ వాళ్ళు మాట్లాడుతుండే సమయంలో నన్ను పిలిపించేవారు నాన్నగారు. ఒక్కొక్కసారి నాకు పెద్దగా ఆసక్తి లేకున్నా నన్ను వుండమనే వారు. మా యింటికి వచ్చేవాళ్ళు, ఆయన చేత ఆదరంగా ఆహ్వానింపబడేవాళ్ళు ఎప్పుడూ పెద్ద సంఖ్యలో వుండేవాళ్ళు. మీవంటివాళ్ళు, బి. ఎం. శ్రీ కంఠయ్య, శ్రీ మాస్తి వెంకటేశ అయ్యంగార్, ఇద్దరు శంకరభట్టులు వచ్చేవాళ్ళలో వున్నారు. అలాగే చాలా తక్కువమందికి తెలిసిన పాఠశాల ఉపాధ్యాయులు, ఈనాడు మనం హరిజనులని పిలిచే కొంతమంది, ప్రొటెస్టంటు క్రైస్తవులు అందరూ వచ్చేవారు. వాళ్ళ అంతస్తును

బట్టి, జాతినిబట్టి మా నాన్నగారు వేరువేరుగా చూచేవారు కాదు" – (శ్రీమతి శాంత రామేశ్వరరావు)

ఇతర వుత్తరాల భాగాలు, క్రింద ఇచ్చినవి, ఈ వరుసలో ఉన్నాయి:
1. శ్రీ ముకుందరావు – ఆయన పెద్ద కుమారుడు.
2. శ్రీ రామారావు పంజె – తండ్రిని గురించి జీవిత కథనం రాసినవారు.
3. శ్రీమతి శాంత రామేశ్వరరావు – బ్రతికుండే చివరి కుమార్తె.
4. శ్రీమతి అనసూయ అర్. రావ్ – బ్రతికుండే వాళ్ళలో పెద్ద కుమార్తె.

## 1

"ఆయన ఇతర కార్యకలాపాలను గురించి చెప్పాలంటే, ఆయన మంచి ఈతగాడు, నటుడు, వక్త, గాయకుడు. ఆయన సమాజ సంస్కర్త, దేశభక్తుడు. యక్షగానాలలో, రంగస్థలంమీద ఆయన అభినయించేవారు. కన్నడ పండితులైనా ఆయన ఇంగ్లీషు, కన్నడ రంగస్థల నటులకు శిక్షణ ఇచ్చేవారు. తాళమద్దళె (యక్షగానం) మీద ఆయన చేసిన ఆశు వుపన్యాసం వినడానికి మైళ్ళకొద్దీ నడిచి వెళ్ళినా వృథాకాదు. చంద్రహాసలో దుష్టబుద్ధిగా ఆయన వేషం వేస్తే దాన్ని మించిన వారులేరు. మంగుళూరులో అద్వితీయ నటులైన శ్రీ హెచ్. దేవరావును, ఇతరుల్ని ఆయన తయారుచేశారు."

"ఆయనకు దగ్గరి స్నేహితులైన శ్రీ కుదమల్ రంగారావు అస్పృశ్యతా నివారణకు చాలా కృషిచేశారు. బహిష్కరణకు కూడా భయపడలేదాయన. 'ఉళ్ళయ్య దయగొళ్ళయ్య' అనే నాన్నగారి పాట 1918 - 20 ప్రాంతంలోనే నాన్నగారు కలిగివుండిన అభిప్రాయాలను తెలుపుతుంది. 'తూకడికెయను కళెయదె ఏకె మలగిహె గెళెయ' (నిదుర వదిలించుకొనక ఎందుకు పడుకున్నావు మిత్రమా) అన్నది ఆయన దేశభక్తిని తెలుపుతుంది. 1925లో ఒక కాస్మోపాలిటన్ క్లబులోకి ప్రవేశిస్తూ పోలీసులు చెదరగొడ్తున్న కాంగ్రెసు ఊరేగింపును చూచారాయన. ఒక ఇరవైయేళ్ళ యువకుణ్ని పోలీసులు లాఠీలతో కొట్టగా అతను మూలుగుతూ దొర్లుతున్నాడు. ఆ దృశ్యం చూచి చీదరించుకున్నారు పంజె. ఏ మాత్రం వెనుదీయక ఆ యువకుని దగ్గరకు వెళ్ళి 'ఇక ఆపండ'ని పోలీసులమీద కేకలేశారు పంజె. సన్నగా బలహీనంగా వుండే ఈ పెద్దాయన మాటలను ఆజ్ఞగా భావించి పోలీసులు శిరసావహించారు. తర్వాత ఆ అబ్బాయిని లేవనెత్తి, ఒక గుర్రపుబగ్గీ మాట్లాడి, కాలు విరిగిన అతన్ని పోలీసులు, మిగిలిన వాళ్ళందరి ముందే ఇంటికి తీసుకువెళ్ళారు. అంతా ఊరుకున్నారు.

"ఎం. రామరావు అనే పేరుగల ఆ అబ్బాయికి స్నానం చేయించి, పడుకోబెట్టి, గాయాలకు మందువేసి 'పోలీసులు వద్దంటున్నా వినకుండా

పూరేగింపులో ఎందుకు పాల్గొన్నావు' అని నాన్నగారు అడిగారు. 'ఇది దేశంకోసం నా బాధ్యత' అన్నాడు రామరావు. నాన్నగారు చేసిన పనివల్ల జిల్లా అధికారులకు వివరణ ఇచ్చుకోవలసి వచ్చింది."

"ఆయన రచనలు చాలావరకు ఈ తొలిరోజుల్లోనే చేయబడ్డాయి. ఆయన అత్యంత సుందరంగా రాసిన 'నాగరహావు' (నాగుబాము) 1910-12 లో కాసరగోడులో రాయబడింది. ఒక పాములవాడు, అతని భార్య, కొడుకు వాళ్ళ పాములను మాముందు ఆడించగా మానాన్నగారికి ఈ భావన కలిగింది. అది ప్రేరణో లేక ఏ ధోరణో ఏడెనిమిది రోజులు ఏకాగ్రతతో పనిచేశారు ఆయన. వరండాలో ఇటూ అటూ తిరగడం, సాధ్యమైనంత వరకు మంచి పదాలను ఏరుకోడం, పాడుకోడం, తమలో తాము మాట్లాడుకోడం చేస్తుండినారు. రచన పూర్తికాగానే బిగువు సడలి ముఖం తేటపడింది. నవ్వుతూ చప్పట్లుకొట్టి ఆయన తమ సంతోషాన్ని తెలియపరిచారు. సరైన నేపథ్యం ఏర్పరచుకునే వరకు పాటను మాత్రం ఆయన బయటపెట్టలేదు.

"ఆ రహస్య రచనను వినడానికి మేమొక నెలరోజులు వేచివుండవలసి వచ్చింది. పాములవాడు తన వాద్యాలతో, బుట్టనిండా సామానుతో వచ్చి నిలిచినప్పుడు పాట వెలువడింది: "బరి మైె తణ్ణగె, మనదలి బిసిహగె, ఎరడెలెనాలగె, ఇద్దరు సుమ్మగె, ఎరగువె" (చల్లని దేహం, మనసున బుసబుస, చీలిన నాలిక, వున్నా గప్‌చిప్, నీకోదణ్ణం) పాములవాడుకూడా ఈ పాటవిని ఆశ్చర్యంచెంది ఏమీ కానుకగాని, బియ్యంగాని, గుడ్డలుగాని తీసుకోకుండా వెళ్ళాడు!"

"చాలామంది ఆయనకు సన్నిహితంగా మెలిగేవారు. వారిలో శ్రీకారంత్ ఒకరు. అయన్ను వారు తమ "మేధావంత వారసుని" గా చెప్పేవారు. ఆయన చుట్టూ ఎప్పుడూ మనుష్యులు గుమిగూడి వుండేవారు. అయన కుటుంబ సభ్యులమైన మేము, అందరు గొప్పవాళ్ళ పిల్లలలాగే, ఆయనతో కలసి వుండడానికి వీలయ్యేది కాదు. భోజన సమయంలో మాత్రం ఆయన దగ్గర పాఠాలు చెప్పించుకోడానికి వీలయ్యేది. ఆ విధంగా ఇంగ్లీషు, కన్నడం, గణితం, భూగోళం, చరిత్ర చెప్పించుకొనేవాళ్ళం. ఆ పాఠాలు మాకు, మా అమ్మకు, ఆ తరువాత కోడలికి, అంటే నా భార్యకు కూడా చెప్పినవి. నేను బాసెల్ మిషన్ పుస్తకాల అంగడికి వెళ్ళి నాకు కావలసిన పుస్తకం తీసుకొనేవాడిని. పాఠం దానితో మొదలయ్యేది. మా పెద్దఅక్క అంబ చదివేది, నేను కన్నడంలోకి అనువాదం చేసేవాణ్ణి, అందరూ వినేవాళ్ళు. మాకు అవసరమైనప్పుడు మాత్రం నాన్నగారు సహాయం చేసేవారు...."

## 2

"చిన్నపిల్లవాడుగా వున్నప్పుడు కూడ మానాన్న అప్పుడప్పుడు లయాత్మక పదబంధాలను ఒక్కొక్కసారి కన్నడంలో, ఒక్కొక్కసారి కొంకణిలో కల్పించి వాళ్ళ అమ్మ దగ్గరికి పరుగెత్తి తమ సాధనను గురించి చెప్పేవారట. ఇంటిపనులలో సతమతమవుతూ కూడా ఆమె ఒక చిరునవ్వు నవ్వి అతని సంతోషంలో భాగం పంచుకునేదట. కూర్చిన పదాలు తమాషాగా వుండి, పదాల అర్థం బోధపడకపోయినప్పుడు ఒక్కనవ్వు నవ్వి సంతోషపడేదట. లయ పోకుండా ఒక్కొక్కసారి మంచి అర్థమిచ్చే పదాలను అందిస్తుండేదట. ఈవిధంగా పదాలకోసం వేట, ద్విపదలు కూర్చటం, కథలు చెప్పటం, కన్నడ కవిత్వం చదవటం సోదరులైన శివ, శంకరులకు కూడా ఒక అలవాటయిపోయింది. ఆటలు వగైరాలేని మధ్యాహ్న భోజన మప్పుడో, రాత్రి భోజనమప్పుడో పదాలను కూర్చడానికి ఆ సమయాన్ని ఉపయోగించేవారు. ముక్తపదగ్రస్తాలను ఆటగా ఆడుకొనేవారు. పొడుపు కథల వంటివి చెప్పుకొని అమ్మను, నాయనమ్మను సంతోషపెట్టేవారు. వాళ్ళ చిన్నపిల్లల ఆటపాటలను చూచి సంతోషించడమే కాకుండా నాన్న గారిలో ఉబికి వస్తుండిన కవితాధారకు ఆనందించేవారు."

"చదరంగంమీద చిన్నప్పుడు ఆయనకు చాలా ఇష్టముండేది. ఆయన నేర్చుకోగానే సోదరుడైన రాఘవేంద్రకూ ఆసక్తి కలిగేట్లు చేశారు. ఇద్దరూ కూర్చొని గంటలకొద్దీ ఆడేవారు. ఇద్దరి ఎత్తులవల్ల బుద్ధి కుశలత కలగడానికి దోహదం చేసింది. నేననుకున్నదే నిజమైతే ఈ సోదరుడు చనిపోయిన తర్వాత చదరంగాన్ని నాన్నగారు వదిలిపెట్టేశారు."

"నాన్నగారికి 'అగంద్' సోదరుడు మాత్రమే కాదు – సంరక్షకుడు, విద్యార్థి, స్నేహితుడు, ఆత్మబంధువుకూడా. ఆయన మంచివాడు, ప్రీతి పాత్రుడు. ఆయన మంచి తెలివిగలవాడు, శ్రమజీవి, వినయవంతుడు, నిగర్వి, స్వతంత్రబుద్ధి కలవాడు. ఈవిధంగా నాన్నగారు తమ జీవితంలో ఏమేమి మంచిగుణాలు కావాలనుకున్నారో అవన్నీ కలవాడు..... మా నాన్న గారు తమ ప్రీతిని, సంతోషాన్ని, దుఃఖాన్ని, ఆట పాటలను, భావనలను, క్రియలను, భావుకతను ఆయనతో పంచుకున్నారు...."

"ఆయన పుస్తకంలోని రెండు జోలపాటలలో ఒకటైన 'సంజెయ హాడు' (సంధ్యాగీతం)ను 1902 ప్రాంతంలో రాసి (మంగళూరులో) పెద్ద కొడుక్కు చదివి వినిపించారు. రెండవదాన్ని 'జోగుళ' (జోల) అనే పేరుతో రాసి 1910 లో చిన్న కొడుక్కు వినిపించారు. తర్వాత ఇంకా అనేక గీతాలు, 'హావిన హాడు' మొదలైనవి వెలువడ్డాయి...."

"కోటి - చెన్నయ్య అనే పుస్తకాన్ని మడికేరిలో వుండగా రాశారు. అక్కడే 'హుత్తరి హాడు' అనే దాన్నికూడా రాశారు. కొడగులో ఆయన ఎప్పుడు ఉత్తమమైనవన్నీ గమనిస్తుండేవారు. అక్కడి జనులు, వాళ్ళ సంప్రదాయాలు మొదలైనవన్నీ చూచి ఇంత అద్భుతమైన గీతాన్ని ఆయన రాయగలిగారు.

"నేను ఒక్కవిషయాన్ని మాత్రం గట్టిగా చెప్పగలను. ఆయనకు పెద్దతనంలో ఎవ్వరూ శత్రువులులేరన్న విషయం, ఎవ్వరూ తమను అసహ్యంగా, ద్వేషంగా చూడలేదన్న విషయం చాలా సంతోషాన్ని, జీవితంలో సార్థక్యాన్ని ఇచ్చింది. ఈ సందర్భంలో ఒక విషయం చెప్పడం అవసరమో కాదో తెలీదు. అయితే మాస్తిగారి 'హాళూరు'[1]లోని మూడు వరుసల్ని ఎప్పుడూ నాన్నగారు చదువుకుంటూ, గొణుక్కుంటూ వుండేవారు.

'ఇందు ఈ ఊరిగె హగెగళిల్ల
తన్నదిన బంతెందు
కణ్ణుగళ ముచ్చి
ఇన్ను సాకెనగెందు - తణ్ణగాయ్తు....'

ఈ పాదాలు ఆయన్ను చాలా ఆకర్షించాయి.

"మేము అక్కడ వున్నప్పుడు మంగళూరులోని విద్యార్థులు కన్నడాన్ని పెద్దగా పట్టించుకునే వారు కాదనే చెప్పాలి. అయితే నాన్నగారు ఏదైనా వుపన్యాసం ఇస్తారన్నా, ఏదైనా సంఘ సంస్థల సభలలో మాట్లాడతారన్నా ఆసక్తి ఎక్కువగా వుండేది. పెద్ద ఉపోద్ఘాతం లేకుండానే ఏదో కన్నడ మహాకావ్యం గురించి మాట్లాడ నారంభించేవారు నాన్నగారు. మొదట కొన్ని నిముషాలు ఆయన ఏం చెప్తున్నారని తెలుసుకోడానికి పిల్లలు ప్రయత్నించే వారు. అటు తర్వాత అసలు బయట ప్రపంచాన్నే మరచిపోయేవారు. అలాగే మరి కొంతసేపు వింటూ వుండేవారు. వినగా వినగా వున్నట్లుండి చెప్పీ చెయ్యకుండానే సభలోని వారంతా గొల్లుమని నవ్వేవారు. నవ్వుల అలలింకా అణిగిపోకముందే ఇంకా పెద్దగా నవ్వుల జడివాన కురిసేది. ఒక సంఘటన నుంచి మరొక సంఘటన వైపుకు, ఒక పాదం నుంచి మరొక పాదం వైపుకు, ఒక వివరణ నుంచి మరొక వివరణ వైపుకు సభలోనివారు సాగి పోతూవుంటే అంతా నిశ్శబ్దంగా వినేవారు. నాన్నగారిది సంపూర్ణమైన సత్వపూర్ణమైన కంఠం. రెప్పలార్పకుండా, బల్లలకు భుజాలానించి, మెల్లగా చేతులను గడ్డం కింద పెట్టుకొని కూర్చొని శ్రద్ధగా నాన్నగారు చెప్పింది వినేవారు. వాళ్ళ గడియారాల ముళ్ళు మెల్లగా తిరుగుతుండేవి. సభలోని వారు కేవలం పౌరాణిక వాతావరణంలో వుండేవారు కారు. వారి దైనందిన అనుభవాలు, ఆవేశాలు, భావనలలో మునుగుతూ తేలుతూ వుండేవారు.

[1] రామరావుగారు దీనిలోని ఉల్లేఖనం నాదని పొరపాటుగా అనుకున్నారు.

నాన్నగారు చాలా సమయం తీసుకున్నందుకు క్షమించమని కోరేవారు. చప్పట్లు మారు మ్రోగేవి, అయితే అవి ఆయన్ను ఆపమని చెప్పడానికి మాత్రం కాదు. కార్యదర్శి చాలా తత్తరపాటుతో ప్రేక్షకుల అభిప్రాయాన్ని తెలియబరిచేవారు. అధ్యక్షులు ప్రార్థనా పూర్వకంగా ఉపన్యాసాన్ని సాగించవలసిందిగా కోరేవారు. నాన్నగారు తాము చెప్తున్న గ్రంథ ప్రాశస్త్యాన్ని ఇంకా గొప్పగా వివరించేవారు, పాడేవారు, ఇతర కావ్యాలతో, ఇంగ్లీషు కావ్యాలతో పోల్చి చెప్పేవారు. కవి పద్యాలతో, పదాలతో అందరికీ పరిచయముండే కొంకణి పద పుంజాలతో, తుళు పద చిత్రాలతో పోల్చి చెప్పేవారు. ప్రేక్షకులు తాము చూడని మహాకావ్యాల అందాన్ని చవి చూచేవారు. తాము తెలుసుకోలేని భాషలో సొగసును తెలుసుకునేవారు. అప్పటి వరకు తెలియని తమ దేశ సౌందర్యాన్ని గురించి తెలుసుకునేవారు. వాళ్ళ సంప్రదాయ సౌభాగ్యాన్ని గురించి, ఆచారాలను గురించి, అలవాట్లను గురించి, సాంస్కృతిక పరంపరను గురించి తెలుసుకునేవారు. ఇవన్నీ కూడా ఆయనదే అయిన ప్రత్యేక శైలిలో వివరించేవారు. ఉపన్యాసం పూర్తి అయ్యే వేళకు శ్రోతలందరూ నెమ్మదిగా వాళ్ల మామూలు భావనలు, అనుభవాలలోకి దిగి వచ్చేట్లుగా చేసేవారు. ఉపదేశాలుగాని, నీతిబోధలు గాని, మామూలుగా చెప్పే ధన్యవాదాలు కూడా ఉట్టంకించ లేకుండా తమ ఉపన్యాసాన్ని ముగించేవారు. తర్వాత ఆ శ్రోతలు కన్నడంలో ఒక్క ముక్కచదివినా చదవకపోయినా ఆయన ఉపన్యాసాన్ని మాత్రం జీవితాంతం గుర్తుంచుకునేవారు. కన్నడ సాహిత్యాన్ని గురించి వాళ్ళకున్న అభిప్రాయమే ఆనాటితో మారిపోయేది. "

"మధురమైన కన్నడ భాషను ఆయన అమితంగా ప్రేమించేవారు. జీవితంలో అన్నిటికంటె ఎక్కువగా కన్నడాన్ని ప్రేమించిన మా నాన్నగారు ఇంకా నేర్చుకోవాలనే మనస్తత్వం కలవారు. లయ విన్యాసమంటే ఆయనకు చాలా యిష్టం. క్రమబద్ధమైన పదాల కూర్పు హృదయ సంచలనాన్ని కలిగిస్తుందని ఆయన నమ్మేవారు. అలాగే ఆ అందాన్ని ఇతరులకు చవి చూపినప్పుడు వాళ్ళు కూడా ఆకర్షితులవుతున్నారనే విషయాన్ని ఆయన కనిపెట్టారు. ఆయనలో వున్న కవి, ద్రష్ట, భావకుడు, ఆయనలోని ఉపాధ్యాయుడు జీవితంలోని సౌందర్యాన్ని, భావావేశంలో జాలిగుండెలో వుండే సారాన్ని అందరికీ పంచిపెట్టాడు...."

## 3

"కవియైనవాడు తమకు అత్యంత సమీపంలో వుండే అదృష్టం, సౌభాగ్యం, గౌరవం కొంతమంది పిల్లలకు మాత్రమే వుంటుంది. నేను

'కవి' అన్నప్పుడు కేవలం కవిత్వం రాసేవాడని అర్థంతో కాక హృదయంలో, మనస్సులో, చూపులో కవిత్వం నిండినవాడనే భావంతో వాడుతున్నాను. నేను ఈ విషయాన్ని ఇటీవలి వరకు గమనించలేదు."

"నాన్నగారు ఏది చేసినా అత్యంత సహజంగా, అప్పటికప్పుడు అప్రయత్నంగా వుండడం వల్ల నేను ఆయన అందరి వంటివాడే అని అభిప్రాయపడ్డాను. అయితే ఒకటి – ఆయన తాము ఏం చేయదల్చుకున్నారో అదే చేశారు. ఆయన ప్రత్యేకత, సమగ్రత్వం అందులోనే ఉంది."

"ప్రప్రథమంగా ఆయనలో చెప్పవలసిన గుణాలు ఆయన కళా ప్రియత, కావ్యధార, సృజనాత్మకశక్తి. ఆయన మానవత్వం, జాలిగుణం చెప్పకతప్పదు."

"నాన్నగారిని గురించి నేను చెప్పగలిగిన వాటిలో చాలా ముఖ్యమైంది ఆయన మానవత్వం. ఆయన హాస్యప్రియత్వం, తమాషా, చిలిపితనం పేర్కొనదగ్గవి. నేను కోరుకున్నవరం తీర్చే తమాషా ఆడుతుండేవారు నాన్న. నేను అనుకున్నదానికంటే ఎక్కువగా నా నమ్మకాన్ని సఫలంచేసి ఆశ్చర్యంగా మార్చేవారాయన. ఉదాహరణకు ఆయన తలనుంచి కొన్ని పేలు తీయాలని నేను అనుకుంటే, నాకు నమ్మకం కలిగేట్లు చేసేవారాయన. అలాంటి సందర్భాలెన్నో! ఒకసారి తపాలాబంట్రోతు తోట వైపురావడం చూచారాయన. నేను బీజగణితం – అంకగణితాలలో మునిగి వున్నాను. "సరే, నీవు ఈలెక్క పూర్తిచేసేసరికి నీకు చాలా ఇష్టమయింది ఏమిటో చెప్పు మీకు ఇస్తాను" అన్నారు నాన్నగారు. "ఒక పెద్దబొమ్మ కావాలి" అన్నాను. "నీకు ఇస్తాను చూడిప్పుడు" అన్నారు నాన్నగారు. నేను లెక్కపూర్తిచేసేసరికి తపాలాబంట్రోతు పార్శెలు నాన్నగారికి అందిచ్చాడు. అది నేను కోరుకున్న బొమ్మే. నాన్నగారిలో ఏదో మంత్రశక్తి వుందని అప్పుడు అనుకున్నాను నేను. ఇప్పటికీ అలాగే అనుకుంటున్నాను. నిజంగా ఆయనకు మంత్రశక్తి వుంది."

"నాకోసం అన్ని తలుపులు తెరిచి వుంచారాయన. పుస్తకాలు, పాటలు, నాటకాలు, సంగీతం, షికార్లు, మంతనాలు, వచ్చేపోయేవాళ్ళు, ప్రయాణాలు చివరికి ఆహారం విషయంలో కూడా నాతో చనువుగా వ్యవహరించారు. అన్ని విషయాలలోను ఏదో ఒక అద్భుతవిషయం దాగి వుండేది. ఆయన నాకు ఈ రహస్యాలెన్నిటినో చూపించారు."

## 4

"నాన్నగారు విద్యార్థులను, వాళ్ళు హరిజనులైనా సరే, 'మాస్టారూ' అని 'మీరు' అని సంబోధించేవారు....."

"అర్ధరాత్రిపూట భూతాలు తిరుగుతున్నవని భయపడే ఒక వీధిగుండా ఒంటరిగా నడిచి వచ్చేవారాయన. మామూలుగా జనం మధ్యాహ్నం పన్నెండు గంటలప్పుడుకూడా ఈ దారిగుండా రావడానికి వెరిచేవారు. ఆయన ఎప్పుడైనా సరే మంగళూరులో శవాన్ని శ్మశానానికి చేర్చవలసి వస్తే తయారయేవారు. 1934లో మంగళూరును వదిలి పెట్టేవరకు ఆయన నాలుగవ మనిషిగా వుండడానికి ఎప్పుడూ సిద్ధమయ్యేవారు. పగలైనా రాత్రయినా ఆయన వెనుదీసేవారు కారు. తమ ఉద్యోగం పోవచ్చునని తెలిసి కూడా, బీదతనంలో, భార్యను నలుగురు పిల్లల్ని పోషించవలసి వుండి కూడా కొందరు గ్రామీణ పాఠశాలోపాధ్యాయుల్ని గురించి పోరాడారు మా నాన్నగారు.

"పిరికితనంలేని ధీరులై వుండినా ఆయనెప్పుడూ మొరటుగా ప్రవర్తించేవారు కారు, వినయంగా వుండేవారు. తమ పిల్లలకు కూడా మానవత్వాన్ని గురించి ఎప్పుడూ తెలియచెప్తూ వుండేవారు."

"మామూలు విషయాల్లో ఆయన అంత పనిమంతులుకారు. చివరికి తలపాగా చుట్టుకోడానికి కూడా ఆయనకు చేతనయ్యేదికాదు. కొన్నిసార్లు ఇన్‌స్పెక్టర్ రాకసమయాల్లో ఉళ్ళాల మంగేశరావుగారో, హరిషనాయ్ (మడికేరి)గారో ఆయనకు సహాయం చేసేవారు. బెంగుళూరులోగాని, మద్రాసులోగాని ఏదైనా సభలో పాల్గొనవలసి వస్తే కొద్దిగా బట్టలు సర్దుకోడానికి కూడా గాభరాపడిపోయేవారు. మా అమ్మ చాలా సరళము, సాత్వికమైన చిత్తవృత్తికలదైనా ఇటువంటి విషయాలను చాలా సామర్థ్యంతో నిర్వహించేది. ఆయన సబ్ అసిస్టెంట్ ఇన్‌స్పెక్టర్‌గా వుండేటప్పుడు కూడా ఇలాగే జవాను రామయ్యనాయక్ మీద, వంటమనిషి బబ్బుమీద ఆధారపడి వుండేవారనిపిస్తుంది. ఆయన వస్తువులేవైనా పెట్టెలో పెట్టి తాళం వేసేస్తే చాలా అశాంతితో శోకం మూర్తీభవించినట్లుండేవారు. తాళంతో అవస్థ పడడమే కాకుండా, తాళంచెవి పోగొట్టుకుంటానని భయపడేవారు. ఒకమారు ఆయన మద్రాసుకు వెళ్తూ వుంటే మా అమ్మ పెట్టెలో వస్తువులన్నీ ఎక్కడ పోగొట్టుకుంటారో అని ఒక తాళం తగిలించింది. తాళం చూడగానే ఆయన ముఖంలో ఆవేదన ప్రస్ఫుటంగా కనిపించింది. ఆయన గొణిగిందల్లా "తిని తిని ఫంతా" అని. దీనివల్ల ఆయన చెప్పదలుచుకున్నది ఏమిటంటే "నేను ఈ పెళ్ళానికి నా వస్తువులకు తాళం వెయ్యవద్దని ఎన్నోసార్లు చెప్పాను. అయితే వినదు" అని. ఆయన ఎంతగా బాధపడ్డాడంటే పాపం ఆమె చెప్తున్న మాటలుకూడా వినిపించుకోలేదు. అప్పుడు మేము ఒక్కనవ్వు నవ్వి అసలు విషయం చెప్పాము. మా సోదరుడు ఈ తాళానికి తాళంచెవి ఏ విధంగా అక్కరలేదో చెప్పి, తాళం అవసరాన్నికూడా ఒత్తిచెప్పాడు."

"పొద్దునే మామిడిపళ్ళతో బాటు రెండు కప్పుల మంచికాఫీ తప్పక కావలసి వుండేది. అవి లేకున్నా, వాటి నాణ్యం బాగులేకున్నా రోజంతా ఆయన అదోరకంగా వుండేవారు."

"హైదరాబాదులో ఆయన తుదిరోజు జ్ఞాపకం వుంచుకో దగ్గది. మధ్యాహ్నానికి ఆయన స్థితి దిగజారి పోయింది. ఈ వార్త వ్యాపించి కన్నడిగులు, సారస్వతులు మా సోదరుడి ఇంటిలో గుమిగూడసాగారు. ప్రతి ఒక్కరిదగ్గరా సెలవుపుచ్చుకున్నారాయన. కాలం గడిచేకొద్దీ నాడి దొరకడమే కష్టమయింది. ఒళ్ళునీలంరంగుకు తిరిగింది, చల్లబడింది. అయితే అద్భుతమైన ఆయన మెదడు మాత్రం చివరివరకు చురుగ్గానే పనిచేస్తూనే వుండింది. ఒక్కొక్కటిగా ఆయన స్నేహితులని, బంధువులని, సహోధ్యాయులని, విద్యార్థులని, పాత పాఠశాలోపాధ్యాయులని, ఆయన జవాను, వంటవాడి పేర్లుకూడా చెప్పి అందరికీ తమను జ్ఞాపకం చేయవలసిందిగా చెప్పారు. వాళ్ళందరినీ గుర్తుంచుకోడం నిజంగా ఆశ్చర్యం. రాత్రి ఏడుగంటలవుతుండగా మా సోదరుడు ఆయనేమైనా భార్యను గురించి, చిన్నఅమ్మాయిని గురించి బాధపడుతున్నారేమోనని శాంతను తీసుకెళ్ళి ఆయన ఒళ్ళోకూర్చోబెట్టి 'నాన్నగారూ, మీరు దేన్ని గురించయినా బాధపడుతున్నారా?" అని అడిగాడు. "లేదు నాయనా, నన్ను చూస్తే బాధపడ్తున్నట్లున్నానా?" అన్నారు.

"రాత్రి పదిగంటలప్పుడు ఆయన ప్రశాంతంగా వెళ్ళిపోయారు. కృష్ణా' అనీ 'కన్నడ' అని ఉచ్చరిస్తూ ఎటువంటి దుఃఖాలూ లేకుండా ఆయన వెళ్ళిపోయారు.

## స్నేహితుల దృష్టిలో

స్నేహితులు, అభిమానులు సహవ్రతులు చెప్పిన కొన్ని సంఘటనలు ఆయన విశిష్టగుణాలను గురించి తెలుసుకోడానికి ఉపయోగిస్తాయి. నవ్యత, మానవత్వం, హాస్యప్రియత్వం పంజెగారినొక విశిష్టవ్యక్తిగా నిలబెడ్తాయి. ఆయనతో వున్నవారికి ఎప్పుడూ వుల్లాసాన్ని కలిగించేవాడాయన. చిన్న పెద్ద రచయితలకు హృదయ పూర్వకమైన ప్రశంసను అందించేవాడాయన. వాళ్ళు ఈ ప్రేరణతో సాహిత్యానికి, సంస్కృతికి, విద్యారంగానికి మరింత సేవచేశారు.

మన ప్రముఖులలో ఒకరైన డి. వి. గుండప్పగారు ఒకసారి రైటానరబుల్ శ్రీనివాస శాస్త్రితో మంగుళూరికి వచ్చారట. పంజె, ఆయన అంతకుముందే కలుసుకొని వున్నారు. ఇద్దరూ వుపాధ్యాయులుగా పనిచేసిన వారే, సాహిత్యాన్ని కళలను ప్రేమించినవారే. ఇద్దరూ తమ స్నేహితుల్ని, పాత విద్యార్థుల్ని తలచుకున్నారు. పంజె వెళ్ళిన తర్వాత శాస్త్రిగారు

తమిళంలో ఇలా అన్నారట : "గుండప్పగారూ ! ప్రభుత్వం వారు ఇటువంటి సాహిత్యప్రేమికుల్ని అన్ని పనులమీద ఇక్కడకీ అక్కడకీ తిప్పుతుంది చూడండి. అటువంటి వాళ్ళను ఏదైనా ట్రైనింగ్ కళాశాలలో సాహిత్యాచార్యులుగా నియమిస్తే వందలమంది ఉపాధ్యాయులు సాహిత్య వివేచనలో ఉత్తమ సంప్రదాయల్నీ, పద్ధతుల్నీ గురించి తెలుసుకొని సాహిత్యాభిమానులు కాగలుగుతారు. ఇటువంటి ఉపాధ్యాయులే కదా సాహిత్యాన్ని జీవం తొణికిసలాడే అనుభవంగా చేయగలిగేది ?"

"పంజె రాయచూరులో సాహిత్య సమ్మేళనానికి అధ్యక్షులుగా వున్నారు. ఆయన బావమరిది బెనగల్ రామరావు కూడా మాతోవున్నారు.... నేను ఆయనతో ఆలస్యమవుతున్నదని, ఇంకా దుస్తులు వేసుకోలేదని గుర్తుచేశాను. రామారావుగారివంక చూస్తూ పంజె ఇలా సమాధానం చెప్పారు : "అదేం పెద్ద కష్టంకాదు. అన్నీ సిద్ధంగా వున్నాయి. నా దేహాన్ని దుస్తులతో అలంకరింపజేయడానికి సరైన మనిషినే ఏర్పాటు చేశాను. ఒక్క నిముషంలో తయారు కాగలను." దానికి నేను అనుకున్న అర్థం సరైనదేనా కాదా అని నాకు తెలీలేదు. ఎవరు ? ఎక్కడ ? "మీరు అక్కడ కూర్చున్న పెద్దమనిషిని చూశారు కదా! ఆయన చెల్లెల్ని ఇటువంటి పనులు చూడటానికి నాతో ఉంచారు." రామారావుగారు ఇబ్బందిగా కదిలారు. ఇలాంటి మాటలు మోటుగా తోచే ప్రమాదం ఉన్నది.

"మరోసారి మేము మైసూరులో జిల్లా కార్యాలయం దగ్గర వుండే పార్కులో కూర్చొని వున్నాము. మాతో ఒక స్నేహితుడు కూడా వచ్చి కూర్చున్నాడు. యోగక్షేమాల తర్వాత కొత్తగా వచ్చినతను పంజెను అడిగాడు :

"మైసూరులో ఏదైనా సభగాని, సమావేశంగాని వుందా ?

పంజె : అటువంటిదేమీలేదు. స్వంతపని మీద వచ్చాను.

స్నేహి : అంటే మార్పుకోసం వచ్చారా ?

పంజె : అవును. రెండురోజులు స్నేహితుల్తో గడుపుదామని వచ్చాను.

స్నేహి : కుటుంబంతో గూడా వచ్చారా ?

పంజె : మార్పుకోసం వచ్చానని చెప్పలేదా మీకు ? *

— అదీ పంజె జవాబు !"

శ్రీమాస్తి వెంకటేశ అయ్యంగారికి ఆయన్ను గురించిన జ్ఞాపకాలున్నాయి. పంజెను కలుసుకున్న కొన్ని సందర్భాలగురించి ఆయన వివరించారు.

---

* అప్పట్నుంచి మార్పుకోసం రావడమనేది మైసూరులో, సారస్వతుల్లో ఒక ఛలోక్తిగా మారిందంటారు ప్రొ॥ పి. రామానంద్.

మద్రాసు విశ్వవిద్యాలయంలో కర్నాటక సంస్కృతిని గురించి నాలుగు ఉపన్యాసాలివ్వడానికి మాస్తి ఒప్పుకున్నారు. ఒక పెళ్ళి సందర్భంగా ఇంట్లోనే వుండిపోయి మొదటిరోజు వుపన్యాసానికి బెనెగల్ రాలేకపోయారు. అయితే పంజె వచ్చారు. "ప్రేక్షకులు చాలా తక్కువగా వున్నారు. కొన్ని నిముషాలు నేను వుపన్యాసం ఇవ్వనావద్దా అని ఆలోచిస్తూ కూర్చున్నాను. పంజెను అడిగాను. నావంటి యువకుడు అలా ప్రశ్నించడం అహంకారానికి గుర్తని నాకు ఇప్పుడు అనిపిస్తున్నది. అయితే అప్పుడు నాకలా తోచలేదు. స్వాభిమానం కారణంగా పంజె అన్నారు: "అది మంచిదికాదు, విశ్వవిద్యాలయం వారు కన్నడంమీద ప్రేమతో ఈ వుపన్యాసములను ఏర్పరిచారు. ఆ గౌరవాన్ని పొందడానికి మిమ్మల్ని ప్రతినిధిగా ఎన్నుకున్నారు. ఆ గౌరవాన్ని అంగీకరించండి."

మాస్తి చిక్కమంగళూరులో డెప్యూటి కమీషనర్‌గా (కలెక్టర్) వున్నప్పుడు పంజె ఒకటి రెండుసార్లు వెళ్ళి అయన దగ్గర కొన్ని దినాలున్నారు. "అయన మాతో వున్నప్పుడు" అంటూ మాస్తి ఇలా చెప్తారు. "అయన ఎక్కువకాలం పిల్లలతో గడిపేవారు. ఒక చిన్న పిల్ల సరిగమలు నేర్చుకుంటూ వుంది. అంతకంటె పెద్ద పిల్లలు తర్వాతి పాఠాలు నేర్చుకుంటూ వున్నారు. పంజె, తాతయ్యలాగానే వాళ్ళను పాఠాలు చదవమనేవారు, ప్రశ్నలు అడిగేవారు, సమాధానాలను రాబట్టేవారు, తమాషాగా వాళ్ళు పాఠాలు నేర్చుకునేట్లు చేసేవారు. నేనప్పుడే 'తిరుపణి' అనే నాటకం రాశాను. అందులో కొన్ని పాటలువున్నాయి. నాటకాన్ని ఆయనకు వినిపించాను. నేను సంగీతజ్ఞునివలె పాడలేకపోయినా రాగనిర్దేశం చేయగలిగి ఉండినాను. పంజె సంగీతం ఎరిగినవాడు. అందువల్ల ఇలా అన్నారు: "వీటిని గనక రంగస్థలం మీద సరిగ్గా పాడితే అద్భుతంగా వుంటుంది." నేను పాడడం అంత బాగాలేదని చెప్పేబదులు ఇలా అన్నారాయన. ఎందుకంటే ఆయన ఎవరి మనసునూ నొప్పించలేరు, అయినా సత్యం చెప్పాలి కదా. అయితే దాన్ని సరసంగా చెప్పగలిగారాయన."

ఆ తర్వాత మరొకసారి కొంతకాలం మేము కలిసి గడిపాము. ఆయన నాకు చాలా మంచి స్నేహితులయ్యారు. అప్పుడు కన్నడంలో మొదటి కథానిక రాసిందెవరు అన్న ప్రశ్న వచ్చింది. ఈ ప్రశ్న కొంతవరకు వాగ్వాదానికి దారితీసింది. ఆ గౌరవాన్ని కొందరు ఆయనకు, కొందరు నాకు అంటగట్టారు. నేను ఆయన్ను సమర్థించిన వారి మాటనే ఎప్పుడూ అంగీకరిస్తూ ఆ విషయాన్ని స్పష్టంగా, బహిరంగంగా ప్రకటించి ఉన్నాను. కన్నడ ప్రజల జీవనాన్ని గురించి కథలు రాసిన వాళ్ళలో నేనే మొదటి వాణ్ణని ఆయన అన్నారు. నేను ఆయన రాసినవే కథానికలని, విషయమేదైనా

పరవాలేదని అన్నాను. ఆయన మాటల్లో గమనించవలసిన విషయం ఇది: "ఇటువంటి వాగ్వివాదాలు వూరికే రచయితల్లో మనస్పర్థలను శత్రుత్వాన్ని రేపెడ్తాయి. మన కిప్పుడు కావలసింది అందరి స్నేహభావన, సహృదయత. ఇలాంటి విషయాలను గురించి ఎవరుగాని చర్చించడం, మాట్లాడడం నాకు నచ్చదు." జీవితం పట్ల సాహిత్యంలోను, సంబంధించిన విషయాలతోబాటు చరిత్రాత్మకమైన విషయాలు అణగి ఉన్నాయి. పరుషవాక్కులు లేకుండా, వ్యక్తిగత దూషణ లేకుండా చరిత్రకు సంబంధించిన విషయాలకు మనం ప్రాధాన్యం ఇవ్వాలి. ఒకవేళ రచయితల మధ్య మిత్రభావానికి ఏమైనా అడ్డువస్తుందని భావించినట్లయితే పంజె తాము మొదటి కథానికా రచయిత అనే విషయాన్ని విస్మరించడానికి కూడా సిద్ధపడతారు. అదే ఆయన నిజమైన మిత్రభావానికి వుదాహరణ. బంగారంలాంటి వారాయన. మనస్సులోను, మనుగడలోను పరిశుద్ధమైన వారాయన. అందువల్లనే ఆయన గొప్పవారుగా విలక్షణవ్యక్తిగా దర్శనమిస్తారు."

శ్రీ శివరామకారంత ఒక సంఘటనను గురించి చెప్పారు: "1932 ప్రాంతంలో మేము విద్యావిషయక సప్తాహాన్ని మంగళూరులో జరిపాము. పంజె ఆ పనిని నాకు ఒప్పజెప్పారు. 'ఇవన్నీ జరపాలంటే బోలెడంత డబ్బు కావాలి, ఎక్కడ్నుంచి తేగలం?' అన్నాను నేను. పంజె అన్నారు: 'కారంత్ మీరు పని కొనసాగించండి' నేను పని చేపట్టాను. శ్రీమంతులు, పలుకుబడి గల వ్యక్తులూ అడక్కుండానే చందాలు, దానాలు చేస్తారని అందరూ అనుకున్నారు. అయితే అలా జరగలేదు, సప్తాహం పూర్తి అయింది. లెక్క చూస్తే రూ. 500 లోటు తేలింది. ఇది తెలిసి ఒక్క నవ్వు నవ్వి 'లోటు అంతేనా?' అన్నారు. వెంటనే తమ చెక్ పుస్తకం తీసి రూ. 500కు చెక్కు రాసి నాకు ఇచ్చి: "కారంత్, నేను డెప్యూటి ఇన్‌స్పెక్టరుగా వున్నప్పుడు ఈ గ్రామీణ స్కూల్ మాస్టర్లవల్ల ఎంతో గౌరవమూ, సేవా పొందివున్నాను. నేను ఇప్పుడు తిరిగి ఇస్తున్నది చాలా తక్కువ. వాళ్ళు చూపిన అభిమానాన్ని తిప్పి ఇవ్వగలనా పూర్తిగా?" అన్నారు.

పంజె మనస్సు తియ్యనిది. విసుగును, అసమంజసమైన వర్తనను ఆయన ఇష్టపడేవారు కాదు. ఆయనకు అలాంటివి చాలా బాధ కలిగించేవి. ఆయన అలాంటి వాటికి దూరంగా వుండేవారు.

* * *

మన మహాకవి కువెంపు (కె. వి. పుట్టప్ప) ఆయనమీద సుందరమైన సానెట్ ఒక దాన్ని రాశారు. దాని సారాంశం ఈ విధంగా ఉంది:

"ఓ ఆచార్య! నడతలో, నుడిలో మీరు పాలు చక్కెర కలిసినట్లు

వున్నారు. మీ వర్తన పసిపాప నవ్వువంటిది. స్నేహం చూపే మీ అభిమాన గుణం శత్రుత్వానికి శత్రుత్వం. జీవన సూర్యుణ్ణి కప్పురానికి నిప్పు రవ్వలాగా, సత్యానికి సౌందర్యం తోడయినట్లుగా వెలిగించారు. మా నుడి అనే గుడికి మీరు మంగళ కాంతినిచ్చారు, పరిమళాన్నిచ్చారు. మీ జీవనంలోని శాంతికి, రసవత్కార్యాలకు ఉపమ వీణానాదం మాత్రం. మీ ఔన్నత్యాన్ని కొరికితే చెరకులాగా, పిండితే తేనెలాగా వెలిగించారయ్యా. చప్పట్లు (పొగడ్త) ముక్కుదారం వేసి నడిపించే జీవితం జీవితమా? (అది మీది కాదు) గొప్ప వాళ్ళనిపించుకోడానికి, కీర్తి లోభానికి లోబడి బతుకు బండికాడికి మీరు భుజస్కంధాన్నివ్వలేదు. దేవాలయపు తేరును లాగారే గాని మరి దేనికీ తలవంచిన వారు కాదు-"

ఉళ్ళాల ఇలా అంటారు: "ఆయన వర్తనలోని స్వచ్ఛత, వినయం, కులతత్వం నుంచి దూరంగా వుండడం- ఇవన్నీ ఆయనతో మెలగిన వారందరికీ తెలిసినవే. ఆయన జీవితంలోని ముఖ్యసూత్రం ఏమిటంటే 'ఇతరులమీద ఆధారపడవద్దు. అలా చేశారంటే మీ చేతులు నెత్తిన పెట్టుకోవలసి వుంటుంది.' వ్యక్తిగతంగా ఎంత కష్టంలో వున్నా ఆయన అప్పు చేసేవారు కారు. అట్లే తమ స్వాతంత్ర్య గుణాన్ని కాపాడుకున్నా రాయన. ఆయన కుర్చీమీద అధ్యాపకునిలాగా, ఉపన్యాసకునిలాగా కూర్చొనేవారు కాదు. అటూ ఇటూ తిరుగుతూ పాఠాలు చెప్పేవారు. ప్రతి సమస్యనూ చక్కగా పరిశీలించి ఆయన అభిప్రాయాన్ని వెల్లడించేవారు. ఆయన ధీ వైభవాన్ని అందరూ మెచ్చుకునేవారు."

మడికేరిలో బి.ఎస్. కుశాలప్ప అనే అతను (కూర్గి వంశీయుడు) కేంద్రీయ ఉన్నత పాఠశాలలో ఆయన వద్ద సహాయకుడుగా వుండేవాడు. మొదట్లో అభిమానం చూపేవాడు కాదు కాని ఆ తర్వాత ఆయనంటే ఇష్టం ఏర్పరచుకున్నాడు. ఆ తర్వాత ఆయన కూర్గు అసెంబ్లీకి సభాధ్యక్షుడు కూడా అయ్యారు. ఆయన పంజెను గురించి ఇలా అంటారు: "హుత్తరి హాడు వంటిది రాసిన ఆయన సామాన్య రచయిత కాదు. ఆయన అసాధారణ వ్యక్తి. దానిలో ప్రేమ, భావుకత ఉన్నాయి. దీన్ని నేను రాస్తున్న కాలానికి ఆ గీతం కూర్గులో పొందవలసినంత అభిమానాన్ని, పేరును సంపాదించలేదు. దీనికి రాజకీయ కారణాలున్నాయి. కూర్గులో నవ్య జీవితం ప్రారంభమయ్యే శుభోదయం వచ్చినప్పుడు, కూర్గీయులను మేల్కొల్పే గీతం యిదే అవుతుంది. అప్పుడు గొంతెత్తి దీన్ని ఆలాపించాల్సిన అవసరం వుంది. ప్రతి దేశానికీ ఒక జాతీయగీతం అవసరం. దయాగుణం మొదట గృహంలో నేర్చుకోవాలి అంటారు. దేశభక్తి కూడా అంతే. కూర్గు ప్రజలలో దేశభక్తిని ప్రేరేపించా

లంటే 'హుత్తరి హాడు' పాడవలసిన అవశ్యకత వుంది. అప్పుడు పంజెను అందరూ గుర్తుంచుకుంటారు. సాహిత్యమే చావవలసివస్తే, ప్రజల భాష కూడా చస్తుంది. హుత్తరి పాటే మాసిపోతే కూర్గు ప్రజలు కూడా మాసి పోతారు.."

ఆయన వాటిని చదివినప్పుడు, లేక ఏదైనా వివరణ ఇవ్వడానికి కొన్ని భాగాలు చదివినప్పుడు ఆయన కంఠమాధుర్యం రచనల కొక కొత్త సొగసును ఇచ్చేది. ఒక్కొక్కసారి మొదట ఆయన ఏదైనా చదివి వినిపించే వారు. తర్వాత వాటినే పంచలోహంనుంచి బంగారాన్ని వేరుచేసినట్లుగా, ఊరక లక్షణబద్ధంగా, పదజాలంతో కూడి, కృత్రిమంగా వుండే రచనల నుంచి మంచి రచనలను వేరుచేసి చూపడానికి వుపయోగించేవారు. అటు తర్వాత ఆయన ఎందువల్ల ఒక రచనను అభిమానించేదీ వివరించేవారు.

ఆయన మంగళూరులోని ప్రభుత్వకళాశాలలో వున్నప్పుడు అనేకవినోద కార్యక్రమాలలో, వక్తృత్వపు పోటీలలో పాల్గొనేవారు. ఏ విషయాన్నిగాని అత్యంత సామర్థ్యంతో నిర్వహించేవారు. చెప్పదలచుకున్న విషయాన్ని చక్కగా వివరించేవారు. ఆయన మంచి నటులుకూడా అంటారు. ముందుగా నాటకాన్ని అభ్యాసం చేసేటప్పుడు అందరితోనూ మంచిగా వుండేవారు. అయితే ఖచ్చితంగా వుండేవారు. ఎప్పుడూ ప్రమాణాలను కాపాడేవారు. విలువలను పెంచడానికి ప్రయత్నించేవారు. నానుడును, కపటగుణాన్ని ఆయన ఎప్పుడూ బలంగా ఎదిరించేవారు. అన్ని కారణాలను చక్కగా విచారించి ఏదైనా విలువకట్టేవారు. ఆయన కాలంలో జనులు ఎక్కువగా సాంప్రదాయిక ఆచారాలను అలవాట్లను అనుసరించేవారు. పదవుల్లో వుండేవారు, సాంఘికంగా నాయకత్వం కలవారు అటువంటి అనుసరణనే ఆకాంక్షించేవారు. ఒకానొక ప్రవర్తనలో విలువలు ఎటువంటివైనా, శీలం ఎటువంటిదైనా పరిస్థితి ఇలాగే వుండేది. అన్యాయాన్ని, క్రూరత్వాన్ని ఆయన తప్పక ఎదిరించేవారు. దీనివల్ల ఒక్కొక్కసారి ఆయనంటే కొందరు భయపడేవారు, అయిష్టం చూపేవారు. ఆయన చురుకుదనం, చమత్కారం ఒక్కొకసారి యితరులకు బాధగా పరిణమించేవి. ఆయన ఏది చేసినా ఎంత సొంపుగా చేసేవారంటే, కాఠిన్యం ఏమీ కనబడేదికాదు. అన్నీ హాస్యంతో, అభిమానంతో చేసేవారు. ఆయన కొడుకు శ్రీ రామరావు గుర్తుంచుకొన్న సంఘటన ఈ క్రిందిది.

"ఒకమారు విందు భోజనం జరుగుతుండగా పిలవని పేరంటంగా తగవు కొచ్చే శ్యామరావు ('శ్యామణ్ణ' అనే పేరుతో ప్రసిద్ధులు) అనే ఆయన మా నాన్నగారిని అవమానిస్తూ, అవివేకిని చేసి ఆడిస్తూ వున్నాడు. మా నాన్న గారు ఆయనకంటె బాగా చిన్నవారు. కొంతసేపు నాన్నగారు కూడా

అందరితోబాటే నవ్వేస్తూ వున్నారు. తర్వాత నెమ్మదిగా తోటపనికి సంబంధించిన ఒక వ్యంగ్యోక్తిని విసిరారు - "జగళద బీజక్కె యావ మణ్ణు?" (జగడపువిత్తులు వెయ్యడానికి ఎటువంటి మన్ను కావాలి ?) కొంత సేపు పంక్తిలోని వాళ్ళు అన్నం తినడం, నవ్వడంమాని, ఏమిసమాధానం చెప్పాలని తోచక, నాన్నగారివైపు సాభిప్రాయంగా చూశారు. ఎవరో మళ్ళీ అదేప్రశ్న వేశారు. "జగళద బీజక్కె యావమణ్ణు?" మా నాన్నగారి దగ్గర్నుంచి జవాబు వచ్చింది: "శ్యామణ్ణు !" అని. అక్కడ చేరినవాళ్ళం దరూ విరగబడి నవ్వడంతో శ్యామరావు ముఖం సిగ్గుతో కుంచించుకు పోయింది !"

విద్యారంగానికి ఆయన చేసిన గొప్ప సేవ ఏమిటంటే అధ్యాపకుని జీవితాన్ని బాధ్యతా యుతమైనదిగా, సంతోషకరమైనదానిగా చేయడానికి శ్రమించడం ; ఈ విలువలను ధర్మప్రచారంలాగా వృత్తిలోని అతి సామాన్య స్థాయివరకు ప్రసారం చేయడానికి పాటుపడడం. ఆయన వంటవాడిద్వారా, సేవకుని ద్వారా సేకరించిన జానపద విజ్ఞానం జ్ఞాపకాలను పునరుద్ధరించు కోడానికి వుపయోగపడింది. తుళులోని పదరూపాలను, సామెతలను, సామాన్య జనంలో వాడుకలో వుండే పలుకుబళ్ళను సేకరించి ఆయన తమ పదజ్ఞానాన్ని, భాషాతత్వ జ్ఞానాన్ని వృద్ధిచేసుకున్నారు. ఆయనది లోతైన జ్ఞాపకశక్తి. అభిమానం, గౌరవం చూపే వ్యక్తి ఆయన. ఎవరు ఎలాంటి వారో, ఏది ఎటువంటిదో ఆయనకు తెలుసు. ఆయన అభిప్రాయాలు ఎప్పుడోకాని వ్యర్థం కాలేదు.

* * *

వ్యక్తిగా పంజె చాలా గొప్పవారు. పెద్ద, చిన్న రచయితలందరూ ఆయన ప్రభావానికి లోనయిన వారే. ఆయన వద్దకు సంకోచంతో, భయంతో వెళ్ళినవాళ్ళు కూడా ఉత్తేజితులై, ప్రేరేపితులై తిరిగి వచ్చేవారు. ప్రొ॥ రమానందరావు ఒక విశిష్ట గుణాన్ని తెలిపే సంఘటనను చెప్తున్నారు :

"ఒకమారు నేను ఆయనను కలిసినప్పుడు కన్నడంలో రాయమని నన్ను బలవంతంచేశారు. నేను రాసిన ఒకటి రెండు తేలిక రచనల్ని యితరులు కొంకణి కన్నడ అని విమర్శించారు అన్నాను ఆయనతో. 'కాని అదే కావలసింది!' నొక్కి చెప్పే కంఠంతో అన్నారాయన. 'కొంకణి కన్నడ, తుళూ కన్నడ, మరాఠీ కన్నడ ఇవన్నీ కావాలి మనకు. అన్నివైపుల నుంచి స్వేచ్ఛావాయువులు కన్నడంపై ప్రసరించాలి ! అప్పుడే భాష సమృద్ధమవుతుంది. ఇంగ్లీషును చూడండి, ఎన్ని పదాలను అది ఎరువు

తెచ్చుకుందో, ప్రపంచంలోని అన్ని భాషలనుంచి ఇంకా తెచ్చుకుంటున్నదో! అందువల్లనే అది చాలా గొప్ప భాష అయింది, ప్రపంచభాష అయింది. అందువల్ల కన్నడంలో రాయడం వదలిపెట్టకండి. మీకు తెలియకుండానే మీ కొంకణీ కన్నడం కన్నడభాషను సమృద్ధం చేస్తుందేమో, ఎవరికి తెలును!"

అట్లా ఆయన అనేక యువ రచయితలను, ప్రదర్శకులను, పనిమంతులను తయారుచేశారు.

*        *        *

కొంకణి మాతృభాషగా కలిగిఉండీ, కన్నడ భాషాభివృద్ధి కోసం ఆయన కృషి చేయడం కొంకణిలో ఎలాంటి సాహిత్యమూ లేకకాదు. కన్నడం ప్రాంతీయ భాష. దక్షిణ కన్నడ, ఉత్తర కన్నడజిల్లాలలో మాత్రం తుళు, కొంకణి ఎక్కువగా వాడుకలో వున్న భాషలు. ఆయన కన్నడాన్ని సుసంపన్నం చేయడానికి ఈ రెండు భాషలనూ వాడుకోడానికి ప్రయత్నించారు. కొన్ని పదాలకు, పేర్లకు మూలాన్ని కనుక్కోడంలో తుళు, కొంకణి ఆయనకు సహాయపడ్డాయి. ఒక దానికి వున్న సహజ పుష్టి, మరొక దాని సాంకేతిక వుపయోగం ఆయన పరిశోధనకు వెన్నెముకలా నిలిచాయి. అవి ఆయనకు కన్నడభాషకు సంబంధించిన తులనాత్మక పరిశీలనలో సహాయం చేశాయి. 'వాటి బలము, ఐశ్వర్యము కన్నడానికి వుపయోగపడాలి' అనేవారాయన. ఆయనకు భాషాశబ్దాలపై గల ప్రీతి, వాటి అర్థాలను ధ్వనులను, లయను అన్వేషించేలా చేసి పరిశోధనా రంగాన్ని దీప్తిమంతం చేసింది. 'పదార్థ' అనే పేరుతో స్థలనామాలను గురించి ఆయన వ్రాసిన వ్యాసంలో ఆయన పొందిన తోడ్పాటు ఎంత విలువైనదో మనకు తెలుస్తున్నది. అదొక గుప్తమైన ప్రజ్ఞ; అన్యోన్య సంబంధాలను కనిపెట్టే తెలివి. అది సృజనాత్మక వివరణకు పనికివచ్చింది: భాషంటే కేవలం పదాలు, పదనిర్మాణం, వాక్యాలను నిర్మించడం కాదు. ప్యారాగ్రాఫులను, పద్యాలను, వ్యాకరణ సూత్రాలను నిర్మించడం కాదు. ఇవన్నీ జీవం నిండిన దేహానికి అంగాల వంటివి. హామ్లెట్ తండ్రి ప్రేతాన్ని గురించి చెప్పినట్లుగా: "మనం దాని విషయంలో అపచారం చేస్తున్నాం. బల ప్రయోగానికి తగని గాంభీర్యం దానిది."* చప్పిడిగా, చిరాకు కలిగించేదిగా వుండేదాన్ని కూడా, భాషకుండే ఈ జీవసత్వమే పూర్తిగా మార్చగలుగుతుంది. ఆయన భూగోళాన్ని గురించి, బీజగణితాన్ని గురించి, చరిత్రను గురించి, ఖగోళ శాస్త్రాన్ని గురించి

* ఈ పంక్తులను ఎంత మంది ఎన్ని విధాలుగా వుపయోగించుకున్నారు!

మాట్లాడినప్పుడు భాష జీవనాడి కొట్టుకోవడం కనిపించేది. ఆయన ఏదైనా వివరించేటప్పుడు, బోధించేటప్పుడు జీవసత్వం ఏమిటో తెలుసుకోగలే వారంటారు. అయినా ఆయనెప్పుడూ అహంకారాన్ని, గురుత్వాన్ని చూపే వారు కాదు. ఒక్కొక్కసారి ఆయన బరువైన, విపులమైన మాటల నిర్మాణాన్ని కల్పించేవారు. అంతలోనే దానిని బెలూనులాగా సూదితో గుచ్చి అంతవరకు ఆయన మాటల గారడీకి ఆశ్చర్యపోయిన వారిని వినోదింపజేసేవారు. ప్రత్యేకమైన వాగ్ఝరి ఆయనది.

## V

పంజె గురించిన నా జ్ఞాపకాలు కొన్ని ఆయన వ్యక్తిత్వానికి సంబంధించిన ఒకటి రెండు విషయాలను తెలపవచ్చు. నేను చెప్పబోయే వాటిలో రెండు మూడు మంగళూరులో వుండగా సంభవించినవి ;

1927 ప్రాంతంలో కన్నడ సాహిత్యసమ్మేళనం జరిగినప్పుడు ఆహ్వానసంఘ సభ్యులతో బాటుగా ఆయన ఒక ప్రదర్శన ఏర్పాటుచేశారు. అది 'ప్రసంగం' లేక 'తాళమద్దళె'. ఇది మౌఖిక రూపమైన యక్షగానం వంటిది. నృత్యనాటిక అని చెప్పవచ్చు. దక్షిణ, ఉత్తర కన్నడ జిల్లాలలో నాలుగైదు వందల సంవత్సరాలనుంచి ప్రచారంలో వుంది. పాత మైసూరు రాష్ట్రంలోని కొండప్రదేశాలైన మలెనాడు లేక మల్నాడు ప్రాంతాలలో కూడా వుంది. యక్షగానం లేక బయలాటను ఢిల్లీ, బొంబాయి మొదలైన ప్రాంతలకు కూడా తీసుకొని వెళ్ళి ప్రయోగించి, ప్రచారం చేసినవారు డా. కె. శివరామ కారంత. ఆయన తమ పెద్దతనంలో దానిని ఒక నృత్య రూపకంగా ప్రయోగిస్తూ ఉన్నారు. అది నృత్యం, గీతం, అభినయంతో కూడింది. కేవలం జానపద కళ అని కూడా చెప్పడానికి వీలులేనిది. ఒక సాహిత్య ప్రక్రియగా రూపొందినదది. భరతుని నాట్యశాస్త్రంలో చెప్పబడిన ఆంగిక, వాచిక, ఆహార్యాభినయాలకు ఇది సరిపోలుతుంది. తాళమద్దళె లేక ప్రసంగం అన్నది మౌఖికం. కవిత్వపఠనానికి, గమకకళ, హరికథ మొదలైన వాటికీ మధ్యరకంలో వుంటుంది. మరొక వైపు పట్టణాలలో శిష్టనాటకరంగం మీద ప్రయోగింపబడే నాటకాలను పోలుతుంది. వస్తువు సామాన్యంగా ప్రాచీనేతిహాసాలనుంచో, పురాణాలనుంచో, స్థళీయచరిత్రనుంచో తీసుకో బడుతుంది. సూత్రధారుడు లేక దర్శకునివంటి భాగవతుడు మధ్యభాగంలో వెనుక వైపు ఒక తాళవాద్యాన్నీ, దాన్ని వాయించడానికి ఒక కోలనుపెట్టు కొని వుంటాడు ప్రార్థన అయిన తర్వాత వస్తువును గురించి సంక్షిప్తంగా

చెప్తాడు. ప్రత్యేకమైన దుస్తులుగాని, శరీరాలంకరణగాని, దీపాలంకరణగాని వుండవు. కొందరు నేలమీద కూర్చొని కథలోని పాత్రలను తమలో తాము పంచుకుంటారు. భాగవతుని ఉపోద్ఘాతం పద్యరూపంలో ఉంటుంది. రెండు నిముషాల్లో దాన్ని పాడడం జరుగుతుంది. నాటక సంవాదరూపంలో అప్పటికప్పుడు తయారవుతుంది. కథావస్తువు నాటకంలోని సంవాదాలలోలాగే కొనసాగుతుంది. దృశ్యాలుగా విభజన వుండదు. తెరకు సంబంధించిన విషయాలు ఏవీ వుండవు. సంప్రదాయమూ అలవాటువున్నా చాలావరకు సంభాషణలు అప్పటికప్పుడు రూపొందుతూ వుంటాయి. అదే దీనికి విలువను, వైవిధ్యాన్ని, సహజత్వాన్ని, స్వేచ్ఛాతత్వాన్ని ఇస్తుంది. కథనం, వర్ణనలు, విమర్శ, వాగ్వాదం వస్తువును ముందుకు నడిపిస్తాయి. రెండు మూడు గంటల్లో ఇది ముగింపుకు వస్తుంది. దక్షిణ కన్నడ జిల్లాల సాహిత్యవేత్తలు వక్తలుగా, వాదనాపటిమ గలవారుగా రూపొందడానికి ఇటువంటి ప్రదర్శనలే కారణం.

ఆ దినం జరిగిన కథ బహుశా రామాయణానికి సంబంధించిన 'సుగ్రీవసఖ్య'. రాముడు, లక్ష్మణుడు సుగ్రీవుణ్ణి కలుస్తారు. సుగ్రీవుని అన్నయైన వాలి తమ్ముణ్ణి రాజ్యంనుంచి వెళ్ళగొట్టి అతని భార్యను వశం చేసుకున్నాడు. వాలిని రాముడు చంపాడు. చివరకు సుగ్రీవుడు కిష్కింధకు రాజయ్యాడు. సుగ్రీవుడు నాయకుడికి, దేవతలకు సహాయకుడయ్యాడు. వాలి శత్రువర్గంలోని వాడు; అతనొక రాక్షసునిలాగా చిత్రించబడ్డాడు. వాలి మాట్లాడను ప్రారంభించగానే ప్రచండ శబ్దం వచ్చే 'చండె' అనే వాద్యం మోగిస్తారు. ఆ శబ్దంతోబాటే వాలి ఆవేశంగా తనకు సంబంధించిన విషయాలను గురించి మాట్లాడతాడు. చండె వాయించడం నిజంగా తెలివితో గూడినపనే. కేరళ సంప్రదాయాలూ పద్ధతులూ వేరయినా చండె కేరళ, కర్ణాటకాలలో రెండుచోట్లా వుంది. సరళమైన స్నేహపూర్వకమైన శబ్దాల కోసం మద్దళె (మద్దెల) వాయించడం జరుగుతుంది. ఆ దినం కథను దక్షిణ కన్నడ ప్రాంతంలోని ప్రసిద్ధులు, అనుభవం కలవారైన ప్రదర్శకులు నడిపారు. ప్రస్తుతం నాకు రెండుపేర్లు మాత్రం గుర్తున్నవి. ఒకరు విద్వాన్ ఉడుపి సీతారామాచార్య, మదరాసులోని ప్రెసిడెన్సీ కళాశాలలో కన్నడ ఆచార్యులు; మరొకరు శ్రీ బాలిగ లేక వెంకప్పశెట్టి. వీరు ఆ ప్రాంతంలో చాలా ప్రసిద్ధులు. సామర్థ్యంలోను, అభివ్యక్తిలోను, వాదనాపటిమలోను పేరెన్నికగన్నవారు. ఆ దినం నాకొక ప్రత్యేక అనుభవం, నూత్నమైంది లభించింది. నన్ను ఆకర్షించిన విషయమేమిటంటే నా ప్రక్కన మరోముగ్గురు నలుగురు పెద్దలతో కూర్చొన్న పంజె చిన్న, తియ్యని కంఠంతో ఆ దినం ప్రదర్శకులు ఏ విధంగా కథను పెంచుతున్నారో ఒకటి రెండు మాటల్లో

నాకు వివరిస్తూవుండినారు. అంతేకాదు. భాగవతుడు షట్పది. ఛందస్సుని ఎట్లా చదువుతున్నాడో తాళయుక్తంగా అది ఎట్లా కూర్చబడిందీ, కథలో నాటకీయ సందర్భం ఎటువంటిదో వగైరా వివరిస్తూవుండినారు. ఇవన్నీ నృత్యరూపమైన యక్షగానంలో* స్పష్టరూపాన్ని పొందుతాయి.

సభ ముగిసిన తర్వాత పంజెను వచ్చి ధన్యవాదాలుచెప్పి కొన్ని ముగింపు పలుకులను ప్రదర్శకులను, అక్కడ సమావేశమైన పరిషత్తు వాళ్ళను ఉద్దేశించి చెప్పమన్నారు. వాళ్ళ అహ్వానాన్ని అయన మన్నించారు. బహిరంగ సభలో కూడా అయన తమ మామూలు ధోవతీ, పైన పొడుగుచేతుల మల్లు బనీను, దానిపైన వుత్తరీయమే వేసుకున్నారు. ఆ రోజు పంజె ఆ కళనుగురించి, ఆ కథను గొప్పకళాకారులైన తమ పరిచయస్థులు ఎట్లాచెప్పిందీ వివరించారు. అక్కడక్కడ ప్రదర్శనలోని కొన్ని విషయాలను తీసుకొని వాటి విలువను గూర్చి చెప్పారు. హనుమంతుడికీ రామ లక్ష్మణులకు మధ్య, రామ సుగ్రీవులమధ్య జరిగిన సంభాషణలను గూర్చి, వాలిని సంహరించడానికి ఒప్పుకోడం, చనిపోతున్న వాలికీ రాముడికీ మధ్యజరిగిన ఐతిహాసిక సంవాదం (అన్నికాలాలోనూ వివాదాస్పదమైనది) అక్కడక్కడ కొన్ని వాక్యాల నుదాహరిస్తూ చెప్పారు. భాగవతుణ్ణి ఉచితరీతిని ప్రశంసించారు. ఆ దినం అధికప్రసంగాలు, చర్చలు మొదలైనవి లేవనే విషయాన్ని ప్రత్యేకంగా చెప్పారు. బహుశా విద్యావంతులైన ప్రేక్షకులు అలాంటివి మితంగా వుంటేనే మెచ్చుకుంటారని, విలువనిస్తారని వాళ్ళకు ముందే చెప్పారేమో! అలాంటి సందర్భాలలో ఆనాడు, ఈనాడు కూడా అధికప్రసంగాలు, శిష్టత్వం, పదాడంబరం ఎక్కువై తాళమద్దళె ప్రదర్శనను పాడుచేశాయి. ఆనాటి సంభాషణ చేసేటప్పుడు ఆయన అటు ఇటూ కదులుతూ, ముఖం వెలుగుతుండగా, కళ్ళు మిలమిలలాడుతుండగా, చిరునవ్వు నవ్వుతూ, ఛలోక్తులు విసరుతూ, అనేక చోట్లనుంచి వాక్యాలను తీసుకుంటూ ఆనాటి విషయానికి తగినట్లు వుపన్యసించారు. అయన వుత్తరీయం ఎగురుతూ వుండింది. దాన్ని ఆపడానికి అయన ఎంతో ప్రయత్నించారు, దాన్ని తల మీాదికి లాక్కున్నారు – మొత్తానికి ఆ దినం ప్రదర్శనకు సాటివచ్చేటంత, విలువైన ప్రసంగమే**చేశారు. అది వక్తృత్వానికి సజీవ వుదాహరణ అని

* తాళగతులు సంగీతంలోను, నృత్యంలోను ఒక్కలాగే వుంటాయి. భరత నాట్యంలోను, యక్షగానంలోను అట్లే. వాక్యాలు, చరణాలు, పేరాగ్రాపులు మాత్రం నిర్మాణంలో ఉచ్చారణలో వేరువుంటాయి.

** రామరావుగారుదీని విధానాన్ని, ప్రభావాన్ని గురించి ఇంతకుముందే వర్ణించారు. (ప్రసంగమని తాళమద్దళెకు గూడా పేరు)

చెప్పవచ్చు. విద్యావంతులకు గాని, సామాన్య ప్రేక్షకులకు గాని అది మనస్సుకు హత్తుకునే వుపన్యాసం. ఆయన మాటల తీపి, చెదరని శైలి, సహజమైన అభివ్యక్తి – హృత్పూర్వకము, మధురము, ఉత్తేజకరము, మానవతా దృక్పథంతో కూడినది – క్రియాన్వరూపులైన వారి చిత్రాన్ని కలకాలం జ్ఞాపకం వుంచుకునేలా చేశాయి. అంత సుసంస్కృతమైన, సజీవమైన ఉపన్యాసాన్ని నేను ఎప్పుడోతప్ప వినలేదు. ఆయన ఉపన్యాసం ఇస్తారంటే జనం ఆతురతతో, ఎంతో ఆశతో చేరతారంటే ఆశ్చర్యంలేదు. కేవలం ఈర్ష్యా బుద్ధి కలవారు, ఆయన వెనక మాట్లాడాలని అనుకునేవారు, సాహిత్య, సాంస్కృతిక పరమైన కారణాలవల్ల కాక, మరో అభిప్రాయాన్ని వెలువరించవచ్చునేమో!

ఎన్నోమార్లు ఆయన నన్ను సెయింట్ ఎలోషియస్ చర్చి వుండే కొండమీదికి తీసుకువెళ్ళి తిప్పారు టిప్పుసుల్తాన్ గోరీ దగ్గరికి తీసుకు వెళ్ళారు. చిన్నపార్కులో కూర్చొని మేము సముద్రంలో సూర్యాస్తమయాన్ని చూచాము. ఒకవైపునుంచి మంగళూరు నగరదృశ్యాన్ని, మరో వైపునుంచి జిల్లా న్యాయస్థానాలను, నగరంలో వ్యాపించివుండే టెంకాయ చెట్లను చూచేవాళ్ళం. దుఃఖం, సంకీర్ణత, బీదతనం, భిన్నవర్గాల మధ్య సంఘర్షణ, మనుష్యులకు మనుష్యులకు మధ్య ఘర్షణ ఇవన్నీ నగరం లోపల ఎన్నయినా వుండనివ్వండి. అవన్నీ దేవునకే తెలుసు. ఇవన్నీ ఇతర నగరాలలో ఎంతవరకు వున్నాయో, భూమిమీద ఎక్కడైనా సహజమైనట్లుగానే మంగళూరులోకూడా వున్నాయి. అయినా దృశ్యమంతా ఒక రసవత్కావ్యంగా వుండేది.

ఆయన ఆహ్వానాన్ని పురస్కరించి వాళ్ళ వూరికి నేను మొదటిరిగా వెళ్ళడం ఇంకా గుర్తుంది. నేను నావస్తువులను అక్కడపెట్టగానే ప్రాచీన అర్ఘ్యపాద్యాలలాగా నాకు కాళ్ళు చేతులు కడుకోడానికి నీళ్ళు ఇచ్చారు. ఆయన నన్ను రైల్వే స్టేషనుంచి మంగళూరులోను, ఉత్తర కర్ణాటకంలోను విచిత్రంగా కనిపించే గుర్రపుబండిలో పిలుచుకొని వెళ్ళారు. త్వరగానే రెండుపళ్ళాలలో పేలాలబియ్యాన్ని, రొట్టెముక్కలను నా ముందుంచి, కప్పునిండా కాఫీ పెట్టి ఆయన అన్నారు: "మా కాఫీ మీరు మైసూరులో తాగే కాఫీఅంత బాగుండకపోవచ్చు. అయినా . . . . తర్వాత "నీళ్ళు సిద్ధంగావున్నాయి, చన్నీళ్ళూ, వేడినీళ్ళూ. స్నానం చేయండి" అని స్నానాలగదిలోకి వెళ్ళేముందు కుండనిండా బావి నీళ్ళు తీసుకొని పొమ్మన్నారు. స్నానానికి వెళ్ళేముందు వుతికే గుడ్డలన్నీ తీసి ఇవ్వమన్నారు. దుప్పట్లతోసహా తీసుకున్నారు, మరోమాట అన్నారు. మీ మనీపర్సు మీదగ్గరే పెట్టుకోండి. లేకుంటే నాదగ్గర ఇవ్వండి, వెళ్లే

ప్పుడు ఇస్తాను. మీరు మా ఇంట్లోవుండగా ఏమన్నా పోగొట్టుకోవడం నా కిష్టంలేదు" అన్నారు. ఇప్పటివరకు ఇంత మంచినలహాను మరెవ్వరూ ఇవ్వలేదు. కొంతమంది ఇలాగే డబ్బు పోగొట్టుకొని ఆతిథ్య మిచ్చేవారిని తీరా వెళ్ళేముందు ఇరకాటం పెట్టడంకద్దు.

స్నానం అయిన తర్వాత ఏదో వేడి వేడిగా తాజావంటకం ఒకటి పెట్టి, ఒక కప్పుకాఫీ, నమలడానికి కొన్ని వేయించిన జీడిపప్పులు ఇచ్చారు. కొంతసేపు విశ్రాంతి తీసుకున్న తర్వాత నగరంలోకి బాలసాహిత్య మండలి దగ్గరకు ఉళ్ళాలగారిని చూడడానికి వెళ్ళేము మేము. అక్కడికి వెళ్ళేముందు ప్రామాణికుడైన ఒక కొబ్బరిబొండాల విక్రేత దగ్గరికి తీసుకొనివెళ్ళి లేతకొబ్బరి నీళ్ళు త్రాగమని బలవంతం చేశారాయన. మా పరిచయం అలాఉండేది. ఒకటి రెండు సందర్భాలలో ఆయన నన్ను ప్రేక్షకులకు సమావేశాలలో పరిచయం చేశారు. నేను మాట్లాడిన చోట అధ్యక్షత వహించారు. ఆయా సాహిత్య, ఆర్థిక లేక రాజకీయ విషయంలో నేనుచేసిన వివరణను పొగిడేవారు. కారణం నేను ఒకవిధంగా అన్నిట్లోనూ చెయ్యివేసి సామాన్యంగా సర్వవిషయాచార్యుడనే బిరుదు సంపాదించాను.

మేమొకసారి కర్నాడ్ సదాశివరావుగారుండే చోటికి వెళ్ళాము. ఆ దగ్గరలోనే ఒక చికిత్సాకేంద్రం వుంది. అక్కడ ఒక యువక ఉపన్యాసకుడు (ఇంగ్లిషు సాహిత్యం) క్షయతో కాబోలు మంచం పట్టివున్నాడు. అతణ్ణి కలుసుకోవడంలో ఎంతో ఆర్ద్రత, అభిమానమూ వుండింది. ఇది నామీద ప్రభావం చూపింది. మేము మంజేశ్వర్‌కు ఇద్దరమే వెళ్ళాము; ఇతర స్నేహితులతోనూ వెళ్ళాము. సముద్రతీరంలో వాహ్యాళికి వెళ్ళినప్పుడు, బహుముఖ ప్రజ్ఞావంతులైన ఎం. గోవిందపైగారితో మాట్లాడినపుడు జరిగిన సంభాషణలు మరువలేనివి. అక్కడ్నుంచి మేము సాయంత్రం రైలులో మంగళూరికి వచ్చాము. మధ్యాహ్నం విశ్రాంతి తీసుకున్న తర్వాతగాని, పొద్దునపూట ఏదైనా సందర్భవశాత్తుగాని ఆయన దగ్గరికి అనేకులు వచ్చేవారు. వారిలో బడిపంతుళ్ళు, వృత్తివిద్యలవారు, భిక్షుకులు, మహర్నవమి పాటలు పాడుతూ గుంపుగా వచ్చేవారు. ఆ స్థలంలో కనిపించే కొందరు పాములవాళ్లవంటి విచిత్రమైన వినోదగాళ్ళు వచ్చేవారు. వాళ్లంటే ఆయనకు మంచి అసక్తివుంది. అందరిని ఆదరంగా ఆయన చూచేవారు. వెళ్ళేటప్పుడు ఆ వచ్చినవాళ్ళు ఆయన పొగడ్తతోనూ కొంత బక్షీష్‌తోనూ వెళ్ళడం తప్పేదికాదు.

నేను మరి రెండు సందర్భాలను గురించి మాత్రం చెప్తాను. అవి

మేము మా సాహితీ మిత్రులయిన ముళియ తిమ్మప్పయ్యను, కడెంగోడ్లు శంకరభట్‌ను కలుసుకోడానికి సంబంధించినవి.*

ఇంట్లో భోజనాలప్పటి దృశ్యం ఒకదాన్ని గురించి చెప్పవచ్చు. కుటుంబ సభ్యులు తలక్రిందులు 'L' ఆకారంలో కూర్చొనేవారు. పొడుగు పాటి వరుసలో కూతుళ్ళు కొడుకులు, కోడళ్ళు మొదలైనవాళ్ళు కూర్చునే వారు. పంజె మూల కూచొనేవారు, నేను ఆయన ఎడమచేతి ప్రక్కన కూచొనేవాడిని. మాకెదురుగా ఎడమచేతివైపు మూలచివరలో వంటమనిషి తాను చేసిన పదార్థాలను శ్రీమతి పంజెకు అందిస్తే ఆమె మౌనంగా వడ్డించేది. అంతా సంతోషమైన మాటలతో గడిచేది. పంజె పిల్లలను ఎవరి కైనా ఏదైనా పాటగాని, పాదం గాని, కథగాని తెలుసా అని అడిగేవారు. నేను చెప్తూవున్న రోజున ఇతర పిండివంటలతో పాటు మంచి పాయసం కూడా చేశారు. అవి కుంకుమ పువ్వు, సీమబాదంకాయలు, ఏలకులు, మొద లైనవి బాగా దొరికే రోజులు, చౌకగా కూడా దొరికేవి. పాయసం బాగా తయారుచేశారు. అతిథికి కొంచెం ఎక్కువ పాయసం వడ్డించారు. మామిడి పళ్ళు కూడా పెట్టారు. మామిడి పండు ముక్కలు చేయకుండా పండుగా తినడం అలవాటు లేక నేను అవస్థపడ్డాను. అప్పటికి పంజె రెండవ పండు కూడా తిన్నారు. నాకు మరికొంత పాయసం వెయ్యమని భార్యకు చెప్పి ఆయన తనకు మరో రెండు మామిడిపళ్ళు వెయ్యమన్నారు. అవి ఆయన కిష్టమైనవి. నమ్మకమైన మామిడిపళ్ళ విక్రేతనుంచి రోజూ తెప్పించు కొనేవి. అవి అంటుమామిడి రకం కాదు; కొంచెం పీచు వున్నవే. అయినా తియ్యగా రసాలూరుతూ వున్నాయి. గమనించాల్సిన విషయం ఏమిటంటే పంజె వాటిని శుభ్రంగా తిన్నారు. మెల్లగా వాటిని కొరికి రసమంతా జుర్రు కున్నా చేతికి తడి కూడా కాలేదు. నిజంగా నేర్పుతో కూడిన పని. నేను ఇది నిజంగా అద్భుత మండీ అంటే ఆయన నవ్వారు. మీరు ఎందువల్ల ఇంత తియ్యని వారో ఇప్పుడు తెలుస్తున్నది అన్నాను. అంతకు ముందు ఎవరితోనో అన్న మాటల్ని ఆయన మళ్లీ అప్పుడు చెప్పారు. "చిన్నతనంలో

---

*ఇద్దరూ కన్నడ పండితులని ప్రశంసించబడ్డారు. విద్వాంసులు, కవులు అయిన వీరు విద్వత్పూర్ణమైన సాహిత్యకృతులను వెలయించారు. ముళియ పెద్దవారు. ప్రాచీన సాహిత్యంలో నిష్ణాతులు. కడెంగోడ్లు యువపత్రికా రచయిత కూడా, ఆయన 'రాష్ట్రబంధు అనే వారపత్రికను నడిపించేవారు. ఆయన పంజెతో తాను ఒక వారపత్రిక ప్రారంభిస్తున్నట్లుగా చెప్పేసరికి పంజె రాజకీయాలు, పత్రికారంగం అన్నవి సున్నిత మనస్సుగల అతనివంటి వారిని బాధపెడతాయని చెప్పి వద్దన్నారు. సాహిత్య సంబం ధమైన, సృజనశీలములైన కార్యాలకు అవి అడ్డువస్తాయని ఆయన అభిప్రాయం. కాని పత్రికా రంగంమీద, రాజకీయంమీద వుండే వ్యామోహాన్ని చంపుకోడం సాధ్యంకాదు.

"మావన హెణ్ణు" (మామకూతురు)ను ప్రేమిస్తే, పెద్దవాణ్ణి అయ్యాను కాబట్టి యిప్పుడు "మావిన హణ్ణు" (మామిడి పండు)తో తృప్తి పడాల్సిందే." కన్నడంలోని 'మావన హెణ్ణు', 'మావిన హణ్ణు' అనే మాటలతో చమత్కారం చేశారాయన. అప్పుడు శ్రీమతి పంజె ఇబ్బంది పడ్డారని చెప్పకుండా వుండలేను. ఆయన ధోరణి ఆమెకు తెలుసు. అటువంటి సరసోక్తులు, ప్రేమవాక్యాలు ఆమెకు అలవాటే కాబట్టి మొహాన్ని అటు వైపుకు తిప్పుకుంది. అప్పటి వాతావరణమంతా అభిమానంతో, సరదాతో కూడి వుండింది.

ఒకదినం మధ్యాహ్నం 'అంబి' అని యింట్లో పిలిచే ఆయన పెద్దకూతురు అనసూయ బొంబాయినుంచి ఆయన్ను చూడడానికి వచ్చి వుండింది. నేను వరండాలోని పిట్టగోడమీద కూర్చొని వున్నాను. ఆయన పొట్టిచేతుల బనీనుతోనో, లేక పైన ఏమీ ధరించకుండానో అటూ ఇటూ తిరుగుతున్నారు. ఆయన ధోవతి మోకాలి క్రింది వరకే వుంది. సజీవ చిత్రంలా, అప్పు డప్పుడూ వేళ్ళతో మీసాలను నిమురుతూ, సిగరెట్టు తాగుతూ – ఓ దేవుడా, ఎన్ని భంగిమల్లో!– ఆ సిగరెట్టు పొగల వంపుల్ని చూస్తూ తిరుగుతూ ఉన్నా రాయన, అప్పుడు కూతుర్ని వెలుపలికి పిలిచి ఒక గ్రుడ్డి బీదపిల్ల వచ్చే పోయేవారికి పూలమ్మే పాట పాడమన్నారు. ఆమె సున్నితంగా, మధురంగా ఎంతో శ్రావ్యంగా ఆ పాట పాడి నన్ను ముగ్ధుణ్ణి చేసింది. ఆమె పాడిన రీతి, కర్ణాటకి కాదు హిందూస్థానీ కాదు. అది క్రైస్తవ బాణీకి చెందినది. సంగీతం సరళంగా ఉన్నా కదిలించేదిగా ఉంది. ఆ పాట రాగం, దానిలో పదాలూ నలభై ఏళ్ళ తర్వాత ఇప్పటికీ నా చుట్టూ తిరుగుతూనే వున్నాయి. *నాలోని సంచలనాన్ని గమనించి, ఆయన మరొక మైసూరు అతిథి కొన్నిరోజుల ముందు వెలిబుచ్చిన అంత సంతోషకరం కాని అభిప్రాయాన్ని గురించి చెప్పారు.

నేను ఒకటి రెండుసార్లు పంజెతో యదాలాపంగా అన్నాను: నేను ఆయన అతిథిగా మంగళూరు రావడమే కాని ఆయన బెంగళూరుకి వచ్చి మా ఇంటిని పావనం చేయలేదని. నిజానికది బాలిశమైన అసందర్భపు మాట! ఒక దినం ఆయన అన్నారు: 'ఒకవేళ నేను మీ ఇంటికి వచ్చి కొన్ని రోజులు మీతో వుంటే ఏం చేస్తారు?'' ఆయన పెద్దవారు, 'మీరు ఆ పని చెయ్యండి చూద్దాం' అనలేక పోయాను. 'నాకు చాలా సంతోషం. అది గౌరవం' అని

* ఉత్తర, దక్షిణ పద్ధతులు మాత్రమే సంగీతమని ఒప్పుకొనే దేశంలో ఇతర పద్ధతుల్ని వినడానికి చెవి అంగీకరించదు, ముఖ్యంగా క్రిస్టియన్, భారతేతరము అయిన దానిమీద విముఖభావం వున్నప్పుడు. ఈ నాటి చలన చిత్రాలలో విదేశీయాలైన రాగతాళాదులున్నా ఎట్లా వాటిని మెచ్చుకుంటున్నారో నాకు ఆశ్చర్యం.

మాత్రం అనగల్గాను. సుమారు 1934-35 ప్రాంతంలో ఆయన తమ బెదరింపును అమలులో పెట్టగలమని, నాకు అతిథిగా వుంటామని చెప్పారు. అది నా జీవితంలోనే సంతోషపురోజు. అనేకులు పెద్దవాళ్లు, స్నేహితులు, బంధువులు ఆశ్చర్యపడేట్లుగా అలా జరగనే జరిగింది.

పంజెగారికి మామిడిపళ్ళమీద వుండే ప్రీతి నాకు తెలుసు. కాలేజినుంచి ఇంటికి వెళ్తూ కొన్ని మంచి రకాలైన మామిడిపళ్ళు తీసుకొని వెళ్ళాను. బెంగుళూరులో రసపురి, బాదామి, మల్గోవా అనేవి చూడడానికి బాగుండక పోయినా పెద్దరకం, రుచి వేరుగా వుండేవి దొరుకుతాయి. ఆ పళ్ళు ముక్కలుగా కోసి మా అమ్మాయి ఆయనకు పెట్టింది. ఆయన వాటిని ఇష్ట పడ్డారు. కాని ఇలా అన్నారు. "నా రకం వేరు. నేను పండును అట్లే పూర్తిగా తింటాను. అవి కొంచెం పీచు వుండేవే, కాని తియ్యటివి. ఈ దినం బజారుకు వెళ్దాం. నా కేది ఇష్టమవుతుందో నేనే ఎంచుకుంటాను." మేము అలాగే చేశాము. అక్కడున్న అనేక రకాలలో ఏదీ బాగా నచ్చకపోయినా విధిలేక ఆయన కొన్ని ఎంచుకున్నారు

మరొకరోజు, నేను ఒక సిగరెట్ల అంగడిలో కాలేజీనుంచి వస్తూ ప్రవే శించాను. అంగడివాణ్ణి అతని దగ్గర వుండేవాటిలో ఏది చాలా విలువైన రకమని అడిగాను. నన్ను, నా అలవాట్లను తెలిసినవాడు కాబట్టి నా వైపు ఎగాదిగా చూశాడతను. ఒక స్నేహితుడి కోసం కావాలని చెప్పాను. నాకు జ్ఞాపకం వున్నంతవరకు అతను "ది స్టేట్ ఎక్స్‌ప్రెస్" 777 లేక 555 తీసి యిచ్చాడు. దాన్ని నేను భోజనం తర్వాత పంజెకు అందించగా ఆయనేమీ సంతోషపడలేదు. ఆయన ఇలా అన్నారు: "నేను పొగ త్రాగుతానని నాకు తెలుసు. నేను అలా చేస్తుండగా మీరు చూశారు. అయితే మీరు త్రాగని సిగరెట్లను నాకు సరఫరా చెయ్యడానికి ప్రయత్నించకండి. మీరు మళ్ళీ ఈ పని చేయవద్దు. ఏ యజమాని కూడా అతిథికుండే ఆశలన్నీ తీర్చలేడు"- అది ఖచ్చితమైన వుత్తరువు లాగుండింది. 'హుకుం సార్' అన్నాను నేను.

మరునటి దినం నా గదిలో కూర్చొని మా పెద్దమ్మాయిని నీళ్ళు తెచ్చి ఇవ్వమన్నాను. మేము ఆ అమ్మాయిని కమలు అంటాం. నేను అలాగే పిలిచాను. 'ఆమె వినలేదు కాబోలు, మళ్ళీ పిలవండి' అన్నారాయన. నేను కమలును మళ్ళీ పిలిచాను. కొంత సేపయిన తర్వాత దేనికో ఆయన ఆమెను మళ్ళీ పిలవమన్నారు, నేను అలాగే చేశాను. పంజె నన్ను కౌగలించుకున్నంత పనిచేసి నేను ప్రతిసారీ ఎంత సున్నితంగా మా అమ్మాయి పేరును వుచ్చరించానో తెలిపారు. * ఆ శబ్దం, కంఠం ఆయనకు ఇష్టమయినట్లున్నాయి.

*ఆ పేరులో మూడు హ్రస్వాక్షరాలున్నాయి. ప్రారంభంలో 'అ' వుంది, చివర ఉ వుంది – అన్నీ హ్రస్వాలే.

ఆయనకు ఆ సందర్భంలో చాలా సంతోషం కలిగింది. ఆయన శబ్దమంటే ఎంత పిచ్చికలవారో తెలుస్తుంది. ఆ పేరును 'అ' తో అంత చేస్తే బాగుండదు. 'ఆ' తో కృత్రిమంగా ఉంటుంది; 'ఇ'తో అంతం చేస్తే మా వైపు అమర్యాదకరం.

మరొక సందర్భం: ఆయన్ను ఎలాగైనా ఒక సంగీతప్రధాన చిత్రానికి తీసుకుని వెళ్ళాలని కొట్టుమిట్టాడుతుండినాను. ఆ చిత్రం మంచిదే అయివుండాలి. ఎందుకంటే మారిస్ చెవలీర్, జీనెట్ మాక్డొనాల్డ్ అందులో పాత్రధారులు. ఆ చిత్రం పేరు 'వన్‌నైట్ అఫ్ లౌ'. ఇద్దరూ మంచి గాయకులు. దాని దర్శకుడు ఎర్నెస్ట్‌లూబిట్చ్ లేక రేబెన్ మమౌలియన్ కావచ్చు. నాకు నచ్చిన యిద్దరు డైరెక్టర్లు వాళ్లు. వారిది సరళమైన సమర్పణ. నాకు చాలా ఇష్టమైన గొప్ప చిత్రాలతో వారికి సంబంధం వుండటం కారణం. ఆశ్చర్యం ఏమిటంటే ఆయన ఆ చిత్రాన్ని ప్రతి నిమిషమూ చక్కగా ఆస్వాదించారు. పంజెగారికి అది నచ్చినట్లే వుంది. కథంతా ఒక పొరపాటు చుట్టూ పరిభ్రమిస్తుంది. ఒక రాణో, రాజకుమార్తో తను మెచ్చిన వాణ్ణి ఒకణ్ణి ప్రేమిస్తుంది. కొంతకాలం సంతోషంగా గడిపిన తర్వాత అతను మంచి వంశంలో పుట్టినవాడు కాడని, ఒక దర్జీవాడని తెలుస్తుంది. ఆమె గుండెలు బద్దలయ్యాయి. తను మోసపోయినట్లుగా భావించింది. ఆ ప్రేమికుడు బహిష్కరించబడ్డాడు. అందులో చివరి పాట 'తుపాకి కొడుకు ఎవరో కాదు దర్జీ' అని సాగుతుంది. దీన్ని అనేక స్థాయిలలో అనేక కంఠాలు ఎత్తుకుంటాయి. ఒక్కొక్కరు ఒక్కొక్క భాగాన్ని పాడుతారు. ఏక కంఠంగా, సామూహికంగా సాగిన ఈ పాట చివరికి ఇలా ముగుస్తుంది—

ఎవరోకాదు ఒక దర్జీ.....
ఒకదర్జీ.....
దర్జీ.....

—బిగబట్టి చెప్పిన గుసగుసలాగా ముగుస్తుంది. మేము వెలుపలికి వచ్చిన తర్వాత పంజె తమ వుత్సాహాన్ని పట్టి వుంచలేకపోయారు. తీసుకు వెళ్ళినందుకు చాలా కృతజ్ఞతలని, తమకు అపురూపమైన అనుభవం కలిగిందని చెప్పారు. తరువాత ఆయన వున్న రెండుమూడురోజులు, అప్పుడప్పుడు సరిగ్గా సినిమాలోలాగే 'బట్ ఎ టైలర్... ఎ టైలర్.... టైలర్...' అంటూ వచ్చారు. 'ది సన్ అఫ్ ఎ గన్.. హ! హ!' అనేవారు. అది పసిపిల్లవాని సంతోషం వంటిది. ఆయన సంతోషాన్ని ఇంతకంటె చెప్పవలసిన పనిలేదు.

పెద్దవాళ్ళు చిన్నవాళ్ళ మెప్పుపొందేట్లుగా నడుచుకోవడం ఎప్పుడో గాని జరగదు. ఆ దినం అది నా అదృష్టమనే చెప్పాలి.

సెంట్రల్ కాలేజి కన్నడసంఘంలో ముద్దణ చిత్రాన్ని ఆవిష్కరించి నప్పుడు రామాశ్వమేధం కర్తృత్వాన్ని గురించి ఆయన తాము కనుగొన్న విషయాన్ని చెప్పారు. వస్తువును ఆయన ఎంత బాగా అల్లి, అభివ్యక్తీ కరించిందీ మనోహరంగా వివరించారు పంజె. మా వాళ్ళందరికీ అపూర్వమైన అనుభవం కలిగింది. అలాంటి అనుభవమే ఆయన తమ మంచి స్నేహితులైన 'శ్రీ' గారి 'అశ్వత్థామన్' నాటక ప్రదర్శనను రత్నావళి థియట్రికల్ కంపెనీ వారి రంగమందిరంలో చూడడానికి వెళ్ళినప్పుడు కలిగింది. ఆ ప్రదేశంలో ప్రస్తుతం ఒక బస్‌స్టాండు వుంది. దాన్ని ప్రస్తుతం కళాశపాళెం అంటారు. ఆ నాటకం వల్ల కలిగిన రసభావస్థితికి, వస్తువులో సాధించిన గొప్పదనానికి ఆయన లోనుకాకుండా వుండలేకపోయారు : "కథనంలోని వివిధస్థాయిలలో పద్యాలధాటి, స్వగతాలలో నాయకుని మాటలు, ఏకలవ్యుడు, భీముడు, కృష్ణుడు మొదలైన వారి సంభాషణలు, చివరి సన్నివేశం చాలాగొప్పగా వున్నాయి" అన్నారాయన. వివిధదృశ్యాల మధ్య వచ్చేపాటలు తమను చాలా ఆకర్షించాయని, సామూహికంగా పాడేపాటలు, నాయకుడు పాడిన పాటలు హత్తుకున్నాయని చెప్పారు. సాఫోక్లిస్ రాసిన అజాక్స్ ఆధారంగా మహాభారతంలో సౌప్తిక పర్వంలో అశ్వత్థామ కథను తీసుకొని ఈ నాటకం రాశారు రచయిత. అశ్వత్థామ కన్నడదేశంలోని ఒక వేటాడే జనుల గుంపుకు నాయకుడని, గురువని చెప్పబడ్డాడు. ఆ గుంపులో ముఖ్యుడు ఏకలవ్యుడు. ప్రాచీన కథలలో చిరంజీవిగా వర్ణించబడిన అశ్వత్థామ (అతను ఇలా ఎందుకు చెప్పబడ్డాడో తెలియదు. ద్రోణుడు తన ఆయుధాలను విసర్జించి నప్పుడు ఈ విషయం తెలియదా ?) ఏకాంతప్రదేశంలో, కురుక్షేత్రంలో (మూలంలో ట్రాయ్‌లోని గ్రీకుబిడారంలో) నేలకు గుచ్చి వుంచిన ఒక కత్తిమీద పడి తన్ను తాను చంపుకుంటాడు. అంతకు ముందు రాత్రి జరిగిన రక్తపాతం వల్ల ఇతరులు తనను ద్వేషించడం, అవమానించడం కంటె ఇదే మంచిదని అతనికి అనిపించింది. అతని ప్రవర్తన ఇతర నాయకుల తిరస్కారానికి గురి అవుతుందన్న భావన అలా చేయించింది. ఇందులోని భీముడు అగామెమ్నాన్ మెనెలాస్‌కు, కృష్ణుడు అజాక్స్‌లోని యులిసెస్‌కు పోల్చదగినవారు. అయితే కృష్ణుడు ట్రోజన్ యుద్ధంలోని కపట యులిసెస్ కంటె భిన్నంగా కనిపించే యులిసెస్. పంజె ఈ నాటకం గురించి: "ఇది నిజంగా గొప్ప అనుభవం. ఇటువంటి నాటకం ముందు, దాని ఔన్నత్యం ముందు ప్రణామం చేయడం కంటె చేయగలిగిందేముంది" అన్నారు.

ఆయన తమ గీతాల్నిగాని, ఇతరుల గీతాల్నిగాని చదివినప్పుడు కలిగే ప్రభావం గురించి అందరికీ తెలిసిందే. ఆయన అర్థం వివరించడమే కాకుండా ఆ విషయం ఆత్మలోకికూడా చొచ్చుకొనిపోతాడు. ప్రతి పదమ్ము

పాదము, పద్యము ప్రాణం పోసుకుని పలికేలా చేస్తారు. ఆయన పఠనంలో ప్రత్యేకత ఏమిటంటే గొంతును, ధాటిని, భంగిమను మార్చి మార్చి చెప్తూ చివర వుండే పూత పదాలనుకూడా అర్థం మారే విధంగా వివిధ భంగిమల్లో చదివేవారు. అంటే దీనికర్థం రచయిత ఆ పద్యాలను ఈ విధంగా పాడడానికి అనువుగా రచించాడనే. ఇటువంటివి నేను ఒకటి రెండుసార్లు సంగీత ప్రదర్శనల్లో విన్నాను. వాటి ప్రభావానికి ముగ్ధుణ్ణయ్యాను. భారతీయ గేయ నిర్మాణంలో, పల్లవిని పాడడంలో ఇప్పటికీ అదే పద్ధతుల్ని అనుసరిస్తున్నారు. ఇక్కడా, అక్కడా ఒకటిరెండు మార్పులు వుండవచ్చు. సంగీతకారులు ఎలా తప్పించుకుంటారంటే, ఒక పాదం పాడి దాన్ని పల్లవి, అనుపల్లవులతో చేర్చి మొదలుపెడతారు.* పంజెకు సరియైన పద్ధతి తెలుసు. ఎందుకంటే ఆయన జర్మన్ మతాధిపతుల ప్రభావానికి లోనయ్యారు. మంచి విద్యావంతులైన కొందరు విద్యాశాఖాధికారుల ప్రభావానికీ లోనయ్యారు. ఆయన వేరువేరు భాగాలను కవిత్వంలాగా పఠించడం మాత్రమే కాకుండా, అర్థం వివరించి, గేయ రచన వుద్దేశాన్ని చెప్పి, పల్లవిని పాడడంలో వైవిధ్యాన్ని చూపించేవారు. నేను ఇంతకుముందు చెప్పిన సంజెయహాడులో ఇలాంటివే చేసేవారాయన. 'శ్రీ'గారి 'దుఃఖసేతు' (హుడ్ రాసిన 'బ్రిడ్జ్ ఆఫ్ సైస్' కు అనువాదం) ను ఎవరో చదువుతుండినారట ఒకసారి. పాటను గురించిన మొదటి వివరణలన్నీ అయిపోయిన తర్వాత చదివే పనిని పంజె తీసుకున్నారు. దాని ప్రభావం తక్షణమే విద్యుత్తులా కనిపించింది. మరొకసారి ప్రేక్షకవర్గంలో కూర్చొని వుండిన ఒకవ్యక్తి ఆయన గీతాలాపనకు చలించిపోయి మధ్యలోలేచి అరిచాడట - 'రావుజీ, అటువంటి తప్పు మళ్ళీ చెయ్యను. చేసిన పనికి అనుభవిస్తున్నాను' అలా అని ఆయని లేచి సభనుంచి ఏడుస్తూ వెళ్ళిపోయారట. అందువల్ల ఒక పాటో, చరణమో, లయోకాక పాడే వైఖరి ముఖ్యమని చెప్పవచ్చు. పాట ప్రభావం పూర్తిగా అనుభవించేట్లుగా చెయ్యడం ముఖ్యం. ఒక రాగమాలిక లోనో, తాళమాలిక శైలిలోనో శ్రావ్యతను మాత్రం చేర్చి ఊరకుండడం కాదిది. ఒక పద్యాన్ని చదవడమంటే ఒకరి సంగీత పరిజ్ఞానాన్ని తెలియ

---

*1940 ప్రాంతాలలో లెవిస్ కేసన్, డేమ్ సిబిల్ తోర్న్డికే అనేవాళ్ళు మద్రాసు లోని మ్యూజియం థియేటర్‌లో గానసభ చేశారు. వాళ్ళ గానరీతి డేమ్ సిబిల్ గానం చేసిన "అప్ ఇన్ ది విల్లా అండ్ డేన్ ఇన్ దివ్యాలి" అనే దానిలో, కేసన్ గానం చేసిన 'కార్కసొనె' అనేదానిలో బాగా వ్యక్తమయింది. గీతశక్తి రక్తనాళాల్లో ప్రజ్వరిల్లిన ప్రతిక్రియలను బట్టి గుర్తించవచ్చు. మన జాతీయగీతాన్ని ఊరక ఒక్కొక్క చరణంగా సరళంగా, చప్పగా, దుఃఖం ఉట్టిపడేట్లు చదవకుండా ఈ విధంగా చెయ్యగలిగితే మంచిదని నా వుద్దేశం.

జేయడంకాదు. సాహిత్యభాగాన్ని తీసుకొని దానిలోని పదాలు, పాదాలు, సందర్భం, అర్థం మొదలైన వాటిని చక్కగా తెలిసేట్లు చెప్పాలి. అన్ని వేళలా పంజె ఈ విషయంలో కృతకృత్యుడే అని చెప్పవచ్చు.

ఆయన కోసం సిగరెట్ కొన్నానని చెప్పినది కాక మరొక సందర్భం ఏమిటంటే ఆయన తమ కవితలన్నిటినీ కలిపి ఒక సంపుటంగా తీసుకు రావాలని నేను ప్రతిపాదించినది. ఆయన జవాబు వెంటనే, సంక్షిప్తంగా, తిరుగులేనిదిగా వచ్చింది: "మనం దీన్ని గురించి మాట్లాడవద్దు." ఆయన ఎందువల్లనో తమ కవితల సంకలనాన్ని తీసుకురావడానికి ఇష్టపడలేదు. ఆయన చనిపోయి 35 సంవత్సరాలకైనా ఒక సంకలనమంటూ ఏర్పడడం అదృష్టం అని చెప్పాలి. రాశిలో ఎక్కువ కాకపోతే మాత్రమేమి? దీపం కాంతి నిస్తుంది, అగ్ని ఎక్కడైనా, ఎప్పుడైనా వేడినిస్తుంది. ఆయన వ్రాసిన గొప్పరచనలన్నీ, కన్నడంలోని గొప్ప రచనలలో చేరేవే. . ఆయన రచన కంటే, రచయిత అనే భావం కంటే కూడా ఆయన సాన్నిధ్యం, ఆయన సరసత అందరి మన్ననకు పాత్రమయ్యేవి. ఏ కూటమినైనా సంతోష పెట్టేవి. అదే ఆయన కాలంలో ఆయన చేసిన సేవ. ఆయనను కలుసుకొని, ఆయనతో వుండి, ఆయన వ్యక్తిత్వంలోని గొప్పదనాన్ని రుచి చూచిన మాబోటి వాళ్ళకు ఆయన సాన్నిధ్యం, కలయిక శాశ్వత జ్ఞాపకాలుగా మిగిలి పోయాయి. తరువాతి తరాల వాళ్ళకు ఇది ఒక పురాణంలాగా వుండవచ్చు. నమ్మకంలేని వాళ్ళకు ఇవి అతిశయోక్తులుగా అనిపించవచ్చు. ఆయన వంటి వాళ్ళు జీవించి, పని చేస్తూవున్నప్పుడు సత్యమే సజీవమైనట్లు అనుభవానికి వచ్చేది. అది మానవునికి అరుదైన వరం. అప్పటికి కర్ణాటకమంతా ఒక్కటి కాలేదు. ఆయన ఎక్కడో దూరంగా తీరప్రాంతపు జిల్లాలో నివసించారు. అది సమున్నతమైన సహ్యాద్రి పర్వతాలవల్ల మిగిలిన ప్రదేశాల నుండి వేరు చేయబడింది. రవాణాసౌకర్యాలు చాల తక్కువ. సరైన సంబంధాలు, ప్రసారసౌకర్యాలు లేవు. కాని ముంతలో దీపాన్ని మూయలేమని సామెత. ఆయన జ్ఞానదీపం స్వచ్ఛమైనది, ధవళ కాంతిగలది, నిలకడైనది. అది వెలుగునే కాదు సంతోషాన్నీ, హాయినీ వెదజల్లింది.

ఆయన రచించిన కొన్నిభాగాలు, పద్యాలు, కొన్ని వచనరచనలు, వ్యాసాలు, చిన్నదీ పెద్దదీ అయిన కథలు ఆధునిక కన్నడంలోని అత్యంత తేజోవంతమైన ఏ రచనలకు తీసిపొయ్యేవి కావు. 'తెంకణ గాళి యాట' (దక్షిణపుగాలి ఆట), 'హుత్తరి హాడు' (హుత్తరి పాట), 'దొంబర చెన్నె' (దొమ్మరి చెన్నె), ఉళ్ళయ్య ('ఉన్నయ్యా!' లేక 'మంచిదండి') 'నాగరహావే' (నాగుబామా!) ఒక్కొక్కటే ఒకవిశిష్ట మనోవైఖరిని ప్రతిబింబిస్తాయి. 'పదార్థ వేను', 'స్థళనామ' అనేవి పదాల అర్థాలను గురించి, ఊరిపేర్లను గురించి

తెలుపుతూ కన్నడ, తుళు, కొంకణి అనే మూడు భాషలను కలుపుతవి. ఆయన 'అబద్దపు దినచర్య' గమనార్హమైనది. 'కోటి-చెన్నయ' గద్య కథనంలో గొప్పదని చెప్పవచ్చు. ఒక్కటీ వ్యర్థపదం లేదు. చివరి వరకు వాతావరణం బిగువుగా వుంది, సంఘటనలు వేగంగా వూపిరి బిగబెట్టినట్లు పరుగెడ్తాయి. సాహసమయంగా వుండే సంఘటనలతో కూడిన ఈ రచన వచనరచనలో పరమోత్కృష్టమైనదని, శక్తివంతమైనదని, ఏ సాహిత్యమైనా గర్వంగా చెప్పుకోగలిగినదని గుర్తించవచ్చు.

* * *

దేశంలోని ఈ భాగంలో, సరైన వాతావరణాన్ని కల్పించడానికి, ప్రతిభను గుర్తించి అభివృద్ధి చేయడానికి, విద్యారంగంలో వాతావరణాన్ని శుద్ధి చేయడానికి, మంచి రచనలను గురించి జనులకు తెలియ జెప్పడానికి కొందరు నడుం కట్టి నిలిచారు. వాళ్ళు వ్యక్తులను రూపొందించగల్గిన మహనీయులు. వాళ్ళ వ్యక్తిత్వ ప్రభావం వందమంది ప్రచారకుల పెట్టు. వాళ్ళ బహుముఖమైన ప్రతిభ, పెద్దలను పిన్నలను సమానంగా చూచే సహృదయత, బీదలను, దళితులను, పిల్లలను ఉన్నత విద్యావంతులతో, శిష్యులతో సమానంగా చూడడం-దానికి గల సృజనాత్మక శక్తి-ఒక్క మాటలో చెప్పాలంటే అది బీజ ప్రాయమైనది. మంగళూరులో పంజె, బెంగుళూరులో, మైసూరులో టి. ఎస్. వెంకణ్ణయ్య అటువంటివారు. ప్రాతః స్మరణీయులు వారు. తరువాతి తరాల రచయితల, విద్యావేత్తల అభిమానంతో గూడిన జ్ఞాపకాలలో వాళ్ళు సుప్రతిష్ఠులై వున్నారు.

# అనుబంధాలు

## అనుబంధం I



కుటుంబ రేఖాచిత్రం
పంజె దానప్పయ్య (సుబ్రహ్మణ్యకు చెందినవారు)
విట్టలప్పయ్య (బంట్వాల్)
దానప్పయ్య
వాసుదేవయ్య
రామప్పయ్య = శాంతదుర్గ (లేక సీతమ్మ)
కృష్ణారావ్ (కొగ్గ)
మంగేశరావు
శివరావ్
శంకరరావ్
శ్రీనివాస
రాఘవేంద్ర (అగంద)
నారాయణ
(= భవానిబాయి లేక గిరిజాబాయి)
అంబ
ముకుందరావ్
గోపాలరావ్
అనసూయ
రామరావ్
శాంత

# అనుబంధం II

## జీవిత రేఖా చిత్రం

1874
(ఫిబ్ర. 22తేది) — బంట్వాల్‌లో జననం; తండ్రి రామప్పయ్య; తల్లి శాంత-దుర్గ లేక సీతమ్మ.
చిన్ననాటి విద్యాభ్యాసం, ప్రాథమిక పాఠశాల, బంట్వాల్; మునిసిపల్ పాఠశాల, మంగళూరు.

1888 — మంగళూరులోని ప్రభుత్వకళాశాలలో విద్యార్థిగా ప్రవేశం.

1890 — మెట్రిక్యులేషన్.

1892 — ఎఫ్.ఎ.
— సెయింట్ ఎలోసియస్ కాలేజి, మంగళూరులో బి ఎ.లో చేరిక.

1894 — భవానిబాయి (లేక గిరిజాబాయి) తో వివాహం.

1895 — బి.ఎ.లో భాషకు సంబంధించిన పేపర్లు (ఇంగ్లీషు కన్నడ) పూర్తి చేశారు.

1896 — ప్రభుత్వ కళాశాల, మంగళూరులో జూనియర్ కన్నడ పండిట్.
— 'సత్యదీపిక' లో అనువాద పద్యాల ప్రచురణ.

1900 — హిస్టరీ (చరిత్ర), ఎకనామిక్స్ (అర్థశాస్త్రం)లలో బి.ఎ.
— బంట్వాల్‌లో కుటుంబం; మంగళూరులో స్థిరపడడం.

1900-03—వ్యంగ్య, విమర్శాత్మక రేఖా చిత్రాలను, కథానికలను వివిధములైన పేర్లతో, గుప్తనామాలతో రాసి, ప్రచురించారు.

1905 — ఎల్. టి.. మద్రాసులో.

1906 — సబ్- అసిస్టెంట్ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్. మంగళూరు విభాగం.
— సోదరుడు రాఘవేంద్ర (అగంద) మరణం.

1907 — కాసరగోడు విభాగానికి బదిలీ; బోర్స్‌గారి ప్రత్యక్ష బోధనా పద్ధతి పరిచయం కావడం; మొదటికవితా సంకలనం ప్రచురణ.

1907-15 — జీవితంలో అత్యంత సంతోషకరమైన దినాలు.

1915-18 — మళ్ళీ మంగళూరు విభాగానికి బదిలీ; స్థిరపడడం.

కాద్రిరోడ్‌లో నివాసం.

— ప్రధానోపాధ్యాయులు, హయ్యర్ ఎలిమెంటరీ ట్రైనింగ్ స్కూల్, మంగళూరు.

— జిల్లా; తాలూకా బోర్డు వాళ్ళతో తగాదా; లిటిల్ హైల్స్‌చే విచారణ; గెజటెడ్ ఆఫీసరుగా హెచ్చింపు.

— రెండవ కవితా సంకలనం ప్రచురణ.

1918 — తల్లి మరణం.

1919 — పెద్దకూతురు అంబ ఇన్‌ఫ్లూయెంజా వల్ల మరణం.

1921 — సాహిత్య కృషిలో ఉన్నతదశ; 'అజ్జియ కథెగళు' ప్రచురణ. యేట్స్‌గారితో (పాఠశాలా ఇన్‌స్పెక్టర్) సంబంధాలు.

— మంగళూరులో బాల సాహిత్య అభివృద్ధి, ప్రచురణ కోసం 'బాలసాహిత్య మండల' ఏర్పాటు.

1921 — మద్రాసు విద్యాశాఖలో హెచ్చింపు ఉద్యోగం - కొడగుకు సహాయక పాఠశాలా ఇన్‌స్పెక్టరుగా బదిలీ; తర్వాత సెంట్రల్ హైస్కూలు, మడికేరి ప్రిన్సిపాలు.

1921 - 28 — కొడగులో నివాసం; 'కోటి చెన్నయ' రచన, ప్రచురణ.

— 'హుత్తరి హాడు' మొదలైనవి; కర్ణాటక సాహిత్య ప్రపంచంతో సంబంధాలు; మద్రాసు, మైసూరు విశ్వ విద్యాలయాలనుంచి కార్యనిర్వహణకోసం పిలుపు.

1928 — మంగళూరుకు సెలవుమీద పోక.

1929 — నివృత్తులు కావడానికై కోరడం.

1930 — కన్నడ సాహిత్యంలో హాస్యాన్ని గురించి మద్రాసు విశ్వవిద్యాలయంలో ఉపన్యాసాలు.

1934 — రాయచూరులో కన్నడ సాహిత్య పరిషత్సమావేశానికి అధ్యక్షత.

1935 - 6 — పాట్నాలో కుమారుని వద్ద; మైసూరు విశ్వవిద్యాలయ కోసం బి. ఎం. శ్రీకంఠయ్యతో కలిసి జైమిని భారతానికి సంపాదకత్వం; 'పదార్థవేను?' మొదలైన వ్యుత్పత్తులకు సంబంధించిన రచనలు, ప్రచురణ.

1936 - 7 — హైదరాబాదులో కుమారుని వద్ద.

1937 [అక్టోబర్ - 24 తేదీ] — న్యుమోనియావల్ల కాలధర్మం

# అనుబంధం III

## హుత్తరిహాడు (హుత్తరి పాట)

ఎల్లి భూరమె దేవ సన్నిధి బయసి బిమ్మనె బందళో ?
ఎల్లి మోహనగిరియ బెరగిన రూపినిందలి నిందళో ?
ఎల్లి ముగిలలి మించినోల్ కావేరి హెుళె హెుళె హెుళెవళో ?
ఎల్లి నెలవను తణిసి జనమన హెులద కళె కళె కళెవళో ?
అల్లె ఆ కడె నోడలా !
అల్లె కొడగర నాడలా !
అల్లె కొడగర బీడలా !
నవిదు మెద్దరొ యారు పూర్వది హులియ హాళిన మేవను ?
కవణె తిరి కల్లాట హగ్గకె సెళెదరో హెబ్బావను ?
నవరి ఆనెయ సొండిలలి రణకొంబనార్ భోర్గరెదరో ?
నవెదు నవెయద సాహసత్వద క్షాత్ర బేటెయ మెరెదరో ?
అవరె సోల్ సావరియరు !
అవరె కడుగలి గరియరు !
అవరె కొడగిన హిరియరు !
తమ్మనాడిన కొరళు దాన్యద నొగద భారకె బగ్గదొల్,
హెమ్మెహగెగళ హెుడెదు హిరియరు హసిదు హారువ బగ్గదొల్,
బొమ్మగిరియిం పుష్పగిరి పర్యంత బెళెదీ దేశవు
ధర్మదానద కట్టు కట్టళె రీతినీతియ కోశవు !
నమ్మ కొడగిది జమ్మదు ;
జమ్మ కొడగిదు నమ్మదు ;
నమ్మొడల్ బిడలమ్మదు !
ఇదు అగస్త్యన తపదమనె, కావేరి తాయ తవర్మనె,
కదన సిరినియ్యాలె తూగిదగుల్లి చందిరవర్మనె !
ఇదకో ! చెంగాళ్వరన రాడం బరవు కుణిద శ్రీరంగవు !
ఇదో ! ఇదో ! ఇల్లురుళ్ద హాలేరియర బలగిరి శృంగవు !
విధియ మాటద కొడగిదు !
మొదలె నమ్మదు, కడెగిదు
కదల దెమ్మను ; బెడగిదు !

ఒమ్మతవు ఒగ్గట్టు ఒందే మనవు ఎల్లిదే హేళిరి ?
సుమ్మ నిత్తరో దట్టికువ్పన ! హాడుహుత్తరి గేళిరి ?
చిమ్మి పాతురెకోల హాయిగె కుణివ పద హెురర హెుమ్మలి !
నెమ్మదియను తాళలి !
అమ్మెయా బలతోళలి
నమ్మ కొడగిదు బాళలి !

## హుత్తరి పాట

ఎక్కడికైతే భూరమ దేవసన్నిధిని కోరి ఘనంగా వచ్చిందో
ఎక్కడైతే మోహనగిరిలో వెరగు పుట్టించే రూపంతో నిలిచిందో
ఎక్కడైతే మబ్బులోని మెరుపులా కావేరి థళథళ మంటుందో
ఎక్కడైతే నేలను తడిపి జనమన మను కలువు తీసి కళనిస్తుందో

అక్కడే ఆవైపు చూడు !
అక్కడే కొడగు నాడు !
అక్కడే కొడగుల వీడు !

ఎవ్వరైతే ప్రీతిగా పులుల పాలను త్రాగిరో
చిన్న తాడుతో కొండచిలువను పట్టిరో
ఏనుగు తొండము కొమ్ముగా జేసి వూదిరో
సాహసికులై క్షాత్రమున వేటాడిరో

వారు ఓటమిని చావు నెరుగరు !
వారు గండుమగలు, వీరులు !
వారె కొడగులోని పెద్దలు !

తమదేశం కంఠాన్ని దాన్యపు నొగలుకు వంచదు
ఘనముగా పగవారి గొట్టి ఆకలిగొన్న పులివలె లంఘించు
బ్రహ్మగిరి నుండి పుష్పగిరి వరకు వ్యాపించినదీ దేశము
ధర్మదానములు కట్టుబాట్లు రీతినీతికి కోశము !

మా కొడగిది గౌరవాన్వితము
మా కోసమున్న కొడగిది మాది
మా దేహము దీనిని వదలదు !

ఇది అగస్త్యుని తపోగృహం, కావేరి తల్లి పుట్టినిల్లు
కదనశ్రీకి వుయ్యాలలూపెను చందిరవర్మ !
ఇదుగో! వెంగాళ్వరసులాడంబరమున ఆడిన శ్రీరంగము!
ఇదే! ఇదే! హాలేరి పొంగి పొర్లిన బలగిరి శృంగము!

విధి విలాస మీ కొడగు !
ఇది మాకు మొదలు, చివర
మమ్ములను వదలని బెడగిది !

ఐకమత్యం, భావైక్యత, ఒకే మనసు ఉన్నదెక్కడ ?
వూరక ఇచ్చారా ఈదట్టి, కుప్పసం, హుత్తరి పాట పాడండి.
ఈ వేడుక ఆట పాటలను నింపనివ్వండి
అమ్మ దీవించిన సీమ ఇది మనకు వుండనివ్వండి
మనది మనకే వుండనివ్వండి

నెమ్మదినిది అనుగ్రహించనీ!
అమ్మ కుడిభుజంలో
మన కొడగు బ్రతకనీ!

హావిన హాడు (పాముపాట)

నాగర హావె! హావొళు హూవె!
బాగిల బిలదలి నిన్నయ ఠావె!
కైగళముగివె, హాలన్నీవె!
బాబా బాబా బాబా బాబా ॥౧॥

హళదియ హెడెయను బిచ్చోబేగా !
హొళపిన హొందలె తూగో, నాగా!
కొళలనూదువె లాలిసు రాగా!
నీనీ నీనీ నీనీ నీనీ ॥౨॥

ఎలెనాగణ్ణ, హేళెలో నిన్నా !
తలెయలి రన్నవిహ నిజవన్నా!
బలు బడవగె కొప్పరిగెయ చిన్నా !
తాతా తాతా తాతా తాతా ॥౩॥

బరిమై తణ్ణగె, మనదలి బిసిహాగె !
ఎరడెళె నాలగె ఇద్దరు సుమ్మగె
ఎరగువె నినగె, ఈగలె హొరగె !
హోహో హోహో హోహో హోహో ॥౪॥

అనువాదం :

ఓ నాగుబామా ! నాగుల్లో పూవా !
వాకిట బిలమున నీ బిడారమా !
కైమోడ్చెదనే, పాలిచ్చెదనే
రారా రారా రారా రారా ॥౧॥

పసుపు పడగను విప్పుము త్వరగా !
మెరిసే బంగరు తలతిప్పు నాగా !
బుర్ర నూదిన ఆలించు రాగం !
నువ్నువ్ నువ్నువ్ నువ్నువ్ నువ్నువ్ ॥౨॥

ఓ నాగణ్ణ, చెప్పర అన్న !
తలపై రత్నముండుట నిజమా అన్న !
బీదవానికి బంగారు రాశివలె
తేతే తేతే తేతే తేతే ॥౩॥

ఒళ్ళు చల్లన, మనసు పగలపొగ
రెండునాల్కలు ఉన్నా దండగ
దండము నీకు ఇపుడే బయటకు
హోహో హోహో హోహో హోహో ॥ ॥౪॥

తెంకణ గాళియాట (దక్షిణానిలపు ఆట)

బరలిదె ! అహహా ! దూరది బరలిదె—
బుసుగుట్టువ పాతాళద హావా ?
హసివిన భూతవు కూయువ కూవా ?
హొనతిదు కాలన కోణన - ఓవా !
ఉసిరిన సుయ్యో ?- సూసూకరిసుత, ॥౧॥

బరువుదు ! బరబర భరదలి బరువుదు-
బొబ్బెయ హబ్బిసి, ఒందే బారిగె !
ఉబ్బర ఎబ్బిసి కడలిన నీరిగె,
బొబ్బుళి తెరెయను దడక్కె హొమ్మిసి,
అబ్బరదలి ఘోర్ ఘోరెనె గుమ్మిసి, ॥౨॥

బరుతదె ! మైతోరదె బరుతదె ! అదె-
నడుమురియుత నగనావెగె, కూవెగె ।
ఉడిసిద హాయియ హరియుత బిరియుత,
హడగను కీలిసి, తుమురను తేలిసి,
దడదలి ఝాడిసి, దోణియనాడిసి, ॥౩॥

ఇదె ! ఇదె ! బరుతిదె ! ఇదె ! ఇదె ! బరుతిదె-
హక్కియ కణ్ణిగె ధూళిన కాడిగె ।
ఇక్కుత, హొలదెత్తిగె దనకాడిగె ॥
ఫక్కనె హట్టిగె అట్టిసి, కాడిగె ।
సిక్కిద కిచ్చన ఊదలు హారుత, ॥౪॥

బరుతిదె ! ఇదె ! ఇదె ! ఇదె ! ఇదె ! బరుతిదె-
నడలిసి మడదియరుడియను ముడియను,
బడముదుకర కొడెగరి హరిదాడిసి,
హుడుగర తలె తలె టొప్పియ ఆటవ
దడబడ నాడిసి, మనెమనె తోటవ
అడిమేలాగిసి, తెంగను లాగిసి,
అడికెయ బాగిసి, పనె ఇబ్భాగిసి,
బుడదూటాడిసి, తలె తాటాడిసి,
గుడిసల మాడను హులుహులు మాడిసి, ॥౫॥

బంతై ! బంతై ! ఇదె ! ఇదె ! బంతై !-
గిడగిడదిం - బెలు గొంచలు మించలు-
మిడియను హణ్ణను, ఉదురిసి కెదరిసి
ఎడదలి బలదలి కెలదలి నెలదలి,
పడువణ మోడవ బెట్టకె గట్టకె
హెడెదట్టుత, కోల్మించను మిరుగిసి,
గుడుగను గుడుగిసి, నెలవను నడుగిసి,

సిడిలను తాళెగె బాళెగె ఎరగిసి,
జడిమళె సురివోల్, బిరుమళె బరువోల్,
కుడినీరను ఒణగిద నెలకెరెవోల్,
బంతై బీసుత! బీసుత బంతై!
తెంకణగాళియు కొంకణసీమెగె
బంతై! బంతై! బంతై! బంతై! ॥౬॥

అనువాదం :

వస్తున్నది ! అహహా ! దూరంనుంచి వస్తున్నది—
బుసగొట్టే పాతాళపు పామా ?
ఆకలిగొన్న భూతం అరిచే అరుపా ?
కాలుని మహిషపు కొత్త నద్దులా ?
ఊర్పుల శబ్దమా సూసూ అంటూ. ॥౧॥

వస్తున్నది! బరబర త్వరగా వస్తున్నది—
బొబ్బలిడుతూ ఒక్కసారిగా
కడలినీటికి ఉప్పెన తెస్తూ
అలపై అలలను ఒడ్డుకునెడ్తూ
నురగలు కక్కుతు శబ్దం చేస్తూ, ॥౨॥

వస్తున్నది ! కనించకనే వస్తున్నది—అదే—
పడవకు తెరచాపకు నడుం విరుస్తూ
కట్టిన గుడ్డను చించేస్తూ
పడవను విరిచి కొయ్యలు తేల్చి
ఒడ్డుకు తోసి పడవనాడించి. ॥3॥

ఇదే ! ఇదే ! వస్తున్నది ! ఇదే ! ఇదే ! వస్తున్నది—
పక్షుల కళ్ళకు దుమ్ముల కాటుక।
పొలమున ఎద్దులనింటికి తోలుతు ॥
అడవినుంచి పశువుల దోలుతు
దొరకిన నిప్పును వూదుతు మరి మరి. ॥౪॥

వస్తున్నది ! ఇదే ! ఇదే ! ఇదే ! ఇదే ! వస్తున్నది—
మగువల వుడుపుల ముడులు విప్పుతూ,
పేద ముదుసలుల గొడుగు లెగిరిస్తూ,

పిల్లల తలపై టోపీలనాడిస్తూ,
ప్రతి పెరటి తోటనూ దడబడలాడించి,
తలక్రిందులుచేసి, టెంకాయలు దొర్లించి,
పోకను వంగించి, తాటిని రెండుచేసి,
మూలం కదిలించి, తల లెగరగొట్టి,
గుడిసెల కప్పులు ఎగురగ చేసి, ॥3॥

ఇదిగో ఇదిగో! వచ్చెను వచ్చెను—
చెట్టు చెట్టుకూ గుత్తులు మెరవగ—
పిందెల, పళ్ళను కదిలించి విదిలించి
ఎడమను, కుడిపక్కను, కిందా, అంతట,
పడమటి మబ్బును కొండలు కనుమలకు దరిమి,
మెరుపులలోకి చొచ్చుకొని పోయి,
ఉరుమును ఉరిమించి, నేలను వణికించి,
పిడుగును తాటికి అరటికి తాకించి,
జడివాన కురిసేలా, గాలివాన వచ్చేలా,
ఎండిన నేల చెరువులా చేస్తూ!
వచ్చెను వీస్తూ! వీస్తూ వచ్చెను!
తెంకణగాలి (దక్షిణపుగాలి) కొంకణ సీమకు
వచ్చెను! వచ్చెను! వచ్చెను! వచ్చెను!
(బంతై, బంతై, బంతై, బంతై)

# అనుబంధం IV

## ఉపయుక్త రచనలు

## I. పంజె రచనలు

### 1. కథానికలు, నవల :

ఇతిహాస కథావలి- (కథానికల సంకలనం), బాలిగ అండ్ సన్, మంగళూరు. కోటి - చెన్నయ్య - (నవలిక), బాలసాహిత్యమండల, మంగళూరు, 1926.

చండికారహస్యసమాజ - (డిటెక్టివ్ నవల), సువాసినిలో ప్రచురితం, 1-9, 10 & 11 సంచికలు, 1901; మొదటి అధ్యాయం మాత్రం లభిస్తున్నది.

### 2. బాలసాహిత్యం :

బాల కథావలి - (పిల్లల కథాసంకలనం), బాసెల్ మిషన్ బుక్ డిపో, మంగుళూరు, 1916.

బాల సాహిత్యమండల ప్రచురించిన ఇతర బాలకథలు.

అంగళదుగ్గు; అర్గణె ముద్దె; అగోళి ముంజణ; అజ్జి సాకిద మగు; ఇలిగళ తకత్తై; ఏక్‌రోజ్‌కా కలీఫ్; ఒడ్డన ఓట; కర్ణ చరిత్ర; కొక్కొకో కోళి; గుడుగుడు గుమ్మట దేవరు; గోణి తట్టిన పట్టెహులి; బిట్టి బసవయ్య; బెక్కిన బిడారబేరె; బొక్కెబాయి కొక్కెరాజ; చంద్రహాసన కథె; మాతాడో రామప్ప; మెణసిన కాళప్ప; మూరు కరడిగళు; సీగడియాకె ఒణగలిల్ల?; హేను నత్తు కాగె బడవాయితు; హులియో ఇలియో?

### 3. పద్యభాగం & కావ్యసంకలనాలు :

కన్నడ మొదలనెయ పద్యపుస్తక (కన్నడ పద్యాల మొదటి పుస్తకం) - బాసెల్‌మిషన్ బుక్ డిపో, మంగళూరు, 1912. కన్నడంలో మొదటి పద్య సంకలనం. పంజెవి ఆరు కవితలు; మిగిలినవి పదహారూ సమకాలీన కవులవి.

కన్నడ ఎరడనెయ పద్యపుస్తక (కన్నడ పద్యాల రెండవ పుస్తకం) బాసెల్‌మిషన్ బుక్ డిపో, 1919; పంజెవి 7 కవితలు.

కన్నడ మూరనెయ పద్యపుస్తక (కన్నడ పద్యాల మూడవ పుస్తకం) - బాసెల్‌మిషన్ బుక్‌డిపో, మంగళూరు. ఒక్క కవిత మాత్రం ఉంది. అది పంజెగారి హుత్తరి హాడు, పాణిపత (యక్షగానరూపకం) మొదట భక్తి సందేశ, మంగళూరులో వెలువడింది. తర్వాత 'పంజెయవర నెనపిగాగి' (1952)లో వచ్చింది.

4. ప్రకీర్ణము :

కన్నడమూల వ్యాకరణ (వ్యాకరణం) - బాసెల్‌మిషన్ బుక్‌డిపో, 1905. శబ్దమణిదర్పణ - కేశిరాజ, సంపా. రెవ. కిట్టెల్ ; బాసెల్‌మిషన్ బుక్ డిపో, మంగళూరువారికోసం పంజెచే పరిష్కృతం, 1920. ప్రాణిగళూ ప్రదేశగళూ (జంతువులు, ప్రదేశాలు) - భౌగోళిక అధ్యయనం, బాసెల్‌మిషన్ ట్రాక్ట్‌డెపాసిటరీ, మంగళూరు, 1933.

బోధన వెందరేను? - ప్రాథమిక పాఠశాలా విద్యను గురించిన బులెటిన్ నం.1, జిల్లావిద్యాశాఖ, మంగళూరు. 1920.

కన్నడదల్లి సుధారణెగళు (భాష, సాహిత్యాలను గురించి)- రాయచూరులో జరిగిన కన్నడ సాహిత్య పరిషత్తు సమ్మేళన అధ్యక్షోపన్యాసం, 1934.

లఘుకోశ (చిన్ననిఘంటువు) ఇంగ్లీషు - కన్నడం, క్రిస్తానుజవత్స, పరిష్కరించి, పెంచి, సంపాదకత్వం నెరిపినవారు పంజె, బాసెల్‌మిషన్ బుక్ & ట్రాక్ట్‌డెపాజిటరీ, 1933, మంగళూరు.

మహాయుద్దద కథె (ప్రపంచయుద్ధం కథ) - ప్రచు. మదరాసు ప్రభుత్వం, మదరాసు, పంజెచే అనూదితం.

## II

(మొదట పత్రికలలో ప్రచురింపబడి ఇటీవలి వరకు సంకలితములై పుస్తకరూపములో రానివి)

1. కథలు :

నన్న చిక్కతాయి (నా పిన్నమ్మ) — సువాసిని, 1-223.
నన్న హెండతి (నాభార్య) — సువాసిని, 1-8 (ఫిబ్ర. 1901.)
నన్న చిక్కతందె (నాచిన్నాయన) — సువాసిని, II - 2 (ఆగ.1902).
నన్న చిక్క తందెయవర ఉయిల్ (నా చిన్నాయన వీలునామా) సువాసిని, II 2 - 8 (ఫిబ్ర. 1903).
పృథులా — సువాసిని, II - 8 (ఫిబ్ర. 1903).

2. కవితలు :

సత్య సీమెగె తాయె నడెసెన్న ; శోకగీతె ; సారి హేళువెను ; జోగుళ ; తూగువె తొట్టిల ; జోగుళ హాడు ; సంజెయ హాడు ; ఆడిన మరి ; స్థిర ప్రయత్న ; ఉద్యమ ; హొగెయ గాడి ; ఇదు భక్తి ; నడె ముందె ; చంద్ర నన్నుతా ; సూర్యోదయ ; నది ; నక్షత్ర ; జేనుగూడు ; చిక్కందిన వెనపుగళు ; హొలెయన హాడు.

3. చమత్కార, వ్యంగ్య రచనలు :

హళెయ సబ్ - అసిస్టెంటన సుళ్ళు డైరి యింద (పాత సబ్ - అసిస్టెంట్ అబద్ధపు డైరినుంచి ) కంఠీరవ, విశేష సంచిక, 1935.
భారత శ్రవణ - సువాసిని, II – 5 (నవం. 1902)
కమల పురద హొటెలినల్లి - సువాసిని.
వైద్యర ఒగ్గరణె - సువాసిని.
హల్లి - సత్య దీపికె .
హమ్ నహిమ్ గద్ధా – సువాసిని, II - 4 (అక్టో. 1902)

4 . సాహిత్య వ్యాసాలు :

కుమారవ్యాసన హెగ్గళికె, హైదరాబాదులో చేసిన ఉపన్యాసం, 18 - 3 - 36 .
హొసదారి, అధ్యక్షోపన్యాసం, మిత్రమండలి సాహిత్యోత్సవము, మంగళూరు, రాష్ట్రబంధులో ప్రచురితం , 1932. బాలసాహిత్య, హైదరాబాదులో చేసిన ఉపన్యాసం, కంఠీరవలో ప్రచురితం 1935.
నందళికె లక్ష్మీనారాయణప్పనవరు, ముద్దణనుగూర్చి, ప్రబుద్ధకర్ణాటక.
కన్నడక్కె కైపిడి బేకు, సువాసిని, II - 12.
సర్వజ్ఞన ఓనామా పద్దతి, కంఠీరవ.

5. వ్యుత్పత్తిని గూర్చినవి :

పదార్థవేను ? - కంఠీరవ ; మూడబిదరెయ హొస బసదియ శిలాశాసనగళు పంచకజ్జాయ ; బిళిగియకెలవు శాసనగళు, రాష్ట్రబంధు, 1929 ; స్థళనామ- స్వదేశాభిమాని, 1931,

6. ఇంగ్లీషులో కథలు :

ది క్రో అండ్ స్పారో ; రబ్ ఎ రబ్ గమ్మత్ రే ; ది వుడ్ లౌస్ ఈజ్ డెడ్ మాస్టర్ పెప్పర్ ; హౌ ది మైస్ డాన్స్‌డ్ ; ది లార్క్ అండ్ ఇట్స్ ఎగ్స్.

## III పంజెను గూర్చి

పంజె యవర నెనపిగాగి (పంజె స్మారక సంపుటం), పంజె స్మారక గ్రంథ సమితి, ప్రచు. హర్ష ప్రకాశన, పుత్తూరు. సంపా. సర్వశ్రీ ఎం. గోవింద పై, వి. సీతారామయ్య, కె. శివరామ కారంత, 1952.

పంజె మంగేశరావ్ - శేఖర్ ఐద్య, ఎం. జి. ఎం. కాలేజి, ఉడుపి, 1971.

పంజె మంగేశరాయరు – కె. శివరామ కారంత్, ఐ. బి. హెచ్. ప్రకాశన, బెంగళూరు, 1972.

పంజె మంగెశరావ్ - ఎం. సుమిత్రా శానభాగ, భారత - భారతి పుస్తక సంపద, బెంగళూరు, 1974.

(ఈ గ్రంథసూచిని శ్రీ శేఖర్ ఐద్య, ఎం. ఎ. శతాబ్ది ఉత్సవ సంపుటం తెంకణగాళి (1974) కోసం తయారుచేసిన గ్రంథసూచి సహాయంతో తయారుచేశాను).